# న వ ల లు

| | | | రు | అ |
|---|---|---|---|---|
| నుడిగాలి | 1 వ భా | | 1 | 8 |
| డిటో | 2 | ,, | 1 | 8 |
| శిశుహత్య | 1 వ భా | | 1 | 0 |
| డిటో | 2 | ,, | 1 | 0 |
| డిటో | 3 | ,, | 1 | 0 |
| మంత్రదగబ్బ | 1 వ భా | | 1 | 0 |
| డిటో | 2 | ,, | 1 | 0 |
| భయంకరనారీపిశాచి | 1 వ భా | | 0 | 12 |
| ప్రతాపసౌజన్యము | 2 | ,, | 0 | 12 |
| చోరాగ్రేసరచక్రవర్తి | 3 | ,, | 0 | 12 |
| అగ్గిరాముడు | | | 1 | 0 |
| భయంకరుడు | | | 1 | 0 |
| రమేశబాబు | | | 0 | 12 |
| రక్తజ్వాల | 1 వ భా | | 1 | 0 |
| డిటో | 2 | ,, | 1 | 0 |
| ఛాందసుడు | | | 0 | 12 |
| శక్తికుమారి | | | 1 | 0 |
| పంజాబు మెయిల్ | | | 1 | 0 |
| కన్నపుదొంగ | 1 వ భా | | 1 | 0 |
| పగటిచుక్క | 2 | ,, | 1 | 0 |
| డిటో | 3 | ,, | 1 | 0 |
| (పై 3 భాగములు చదివిన కథ పూర్తి యగును) | | | | |
| రమాసుందరి | 1 వ భా | | 1 | 0 |
| డిటో | 2 | ,, | 1 | 0 |
| రక్తవాహిని (ఐమహత్యలా?) | | | 1 | 0 |
| ఇంద్రజాలము | | | 0 | 12 |

| | | | రు | అ |
|---|---|---|---|---|
| రాజద్రోహి | | | 0 | 12 |
| అర్ధరాత్రపువింత (3 హత్యలు) | | | 0 | 12 |
| దురాశ | 1 వ భా | | 1 | 0 |
| డిటో | 2 | ,, | 1 | 0 |
| దొంగలనాయకుడు | | | 1 | 0 |
| మోహపిశాచము | 1 వ భా | | 0 | 12 |
| డిటో | 2 | ,, | 0 | 12 |
| కాలసర్పము | 1 వ భా | | 0 | 12 |
| డిటో | 2 | ,, | 0 | 12 |
| విషప్రణయము | | | 1 | 0 |
| వలపులరాణి | | | 1 | 0 |
| లవంగలత | | | 1 | 0 |
| నేనెవరిభార్యను ? | | | 1 | 0 |
| నేనెవరిభర్తను ? | | | 1 | 0 |
| వ్యామోహము | | | 1 | 0 |
| తల్లావఝ్ఝుల శివశంకరశాస్త్రిగారి | | | | |
| జీవనప్రభాతము (రఘునాథజీ) | | | 1 | 8 |
| జీవనసంధ్య (తేజసింగు) | | | 1 | 8 |
| ప్రఖ్యాతి నొందిన | | | | |
| దేవరాజు వెంకటకృష్ణారావుగారి | | | | |
| వాడేవీడు | 1 వ భా | | 1 | 8 |
| నేనే | 2 | ,, | 1 | 8 |
| కాలూరాయ | 3 | ,, | 1 | 8 |
| (వంగభాషనుండి తర్జుమాచేయబడిన బహుచక్కని నవలలు మూడు భాగములు చదివినచో కథ పూర్తియగును) | | | | |

# నేనే

[ 'వాఁడే వీఁడు' తరువాయి కథ ]

గ్రంథకర్త :

దేవరాజు వేంకట కృష్ణారావుగారు



పబ్లిషర్సు :

కొండపల్లి వీరవెంకయ్యా అండ్ సన్సు

శ్రీ సత్యనారాయణ బుక్ డిపో

రాజమండ్రి

1947 వెల 1—8—0

చల్లని పుట్టినిండ్లు గల
చానల మువ్వురఁ బోలి సర్వ సం
పల్లలితాత్మయై, బుధుల
ప్రస్తుతిఁ గాంచి సుమంగళీ మణీ
తల్లజయై మమున్ దన యు
దార కృపార్ద్ర వివేక దృష్టి రం
జిల్లగఁ జేయు తల్లికి ర
చించితి నీకృతి నంకితంబుగన్.

దేవరాజు వేంకట కృష్ణారావు

# చిన్న మనవి

పాఠకాభిమానులారా, వందనములు. నాయెడ మీరు మీసహజ యౌదార్యమును జూపిన యభిమానమునకుఁ గృతజ్ఞతనుఁ దెలుపుటకు నాకింతకన్నను పూర్వము సమయము చిక్కనందులకుఁ జింతించుచున్నాను. 'వాఁడేవీఁడ'ను నా గ్రంథమున కాంధ్రలోకమునఁ గలిగిన ప్రచారమునకుఁ గారణము నానేర్పరితనము కాదనియును, మీయవ్యాజవిలాసమే యనియు నే నెఱుంగుదును. ఇట్టి మీ యభిమానమునకు నమస్కృతులర్పించి నా కృతజ్ఞతను వెల్లడిఁజేయుచున్నాను.

వాఁడేవీఁడు రచించుటలో మాతృక నెన్నియో విధముల మార్చి యసంభవముల నెల్లఁ దొలంగజేసితినని తమకు నివేదించియే యున్నానుగదా. వాఁడేవీఁడు అరిందము, '* * కాని జుమీలియా మాత్రము మరి కానరాలేదు. దాని యంతముసుగూడ వినగోరుచున్నాను' అని చెప్పియున్నాడు కావున నా జుమీలియా యొక్క అనంతర చరిత్రంబు 'వాఁడేవీఁడు'నకు చివర కలంతాజాలో నివేదించినరీతిని వేరుగా వ్రాయవలసియున్నదిగదా; కావున నా రెండవభాగమును బ్రచురించి నా వాగ్ ఋణమునుండి విముక్తి నందజూచునంత, మాతృకయొక్క కథాభాగము నాకేసరిపడకయుండి, యిట్టిది పాఠకులకు వాంఛితార్థముల నిచ్చునాయను సందేహమును గలుగజేసెను. వాడే

వీఁడు ప్రచురించిన 1912 సంవత్సరమునుండి నేటివఱకును 'వాఁడేవీఁడు' తరువాయి కథను పంపుడనుచు, నా గ్రంథము నవలోకించు నాసక్తి గనబఱచుచు, దాదాపు 800 లేఖలు నాపేరవచ్చినవి.

*    *    *    *    *

ఈ గ్రంథమునందు అరిందమునకు మొదటిపని అనగా బొంబాయి పట్టణమునుండి తాను కలకత్తానగరమునకు వచ్చిన పని దొంగనాణెములను తయారుచేయుచు దొరతనమువారికి ప్రజల ద్రోహ మొనర్చిన కాలూరాయి యనునట్టి ద్రోహిని పట్టుట యను పని మిగిలిపోయినది. ఆ పని నెరవేర్చుటయందు అరిందమునకుఁ గల బాధ్యత తీరలేదను చింతతో అరిందము ఈ గ్రంథమునందు సెలవుగైకొనినాఁడు. కావున నీభాగమునందు పాఠకుల యభిమానమును జూచి యింకను అరిందం నిరూపణలను తెలియజేయు మఱికొన్ని పుస్తకములను వ్రాయు నూహ బలీయముగ మనమున నున్నది. తమ యభిమానము నా కన్ని విధముల నాదరణీయముగదా!

ఈ గ్రంథమును సంస్కరించినందుకు సంపాదకులను ఆంధ్రలోక ప్రచారమునకు వీలొనంగినందుల కీమండలివారికిని నేనెంతయు కృతజ్ఞుఁడను.

బరంపురం,
1—6—18.

ఇట్లు,
దేవరాజు వేంకటకృష్ణారావు.

# నే నే

## మొ ద టి ప్ర క ర ణ ము

### మచ్చువటాకి

"ఓమాటు అడిగితే ఓజవాబూ, పదిమాట్లు అడిగితే మరోజవాబూ చెప్పడానికి నే నేఁవిటి దొంగ ననుకుంటున్నారా ఏఁవిటి? బాగుందండోయి! మీడిటెక్టీవ్ గిరీ అంతా మా మీదేనా యేఁవిటి చెలాయింపు? రావడానికి యిష్టం లేకపోతే ఇప్పుడే మోటార్ దిగి వెళ్లిపోవచ్చును; ఆయనరాలేదండీ' అని నన్నుపంపినవాళ్ళకి జవాబు చెప్పినా అద్దె నేను పుచ్చుకొని మరీ వెళ్ళిపోతాను—ఏం-ఆపమన్నారా?" అని కోపముతో నేమో యనునటులఁ జోదకుఁడు పలికెను.

"అబ్బీ, నువ్విలాగకోప్పడితే నేనేఁవనగలను? చూశా! ఇదంతా ఒక మహానాటకంలాగుందంటావా లేదా; నే నెవరో నీకు తెలియదునరేగదా! పైగా నన్ను డిటెక్టివ్ గిరీ అంటూ నేనెవడినో పోలీసువాడనని కూడా ఊహిస్తున్నట్టు కనుపిస్తున్నాది. ఎక్కడికి నన్ని మోటరులో ఇంతజోరుగా తీసుకుపోతున్నావో ఎంత అడిగినా చెప్పవాయను - ఎవరు నన్ను పిలిపించారో అదీచెప్పవు-నిన్నే మరొకళ్ళు ఈఁగాగు చేస్తు

న్నారనుకో; నువ్వెన్ని ప్రశ్నలడుగుదువో ఆలోచించుకో— రమ్మన్నావుగదా అనీ, ఏదో మోటార్ మీద ఒక చక్కర్ కొడదామనీ వచ్చాను—గాని ఇంతదూరమూ వచ్చి ఇప్పుడు దిగిపొమ్మంటే దిగిపోతానా- చెప్పు, యిప్పుడైనా సంగతేమిటో చెపుతావేమో అని అడిగాను. చెప్పవు సరేకదా కొప్పడుతు న్నావుకూడాను. పోనీ ఆ ధర్మమంతా నీకే దక్కనీ" అని గొణుగుకొనుచు లోపలకూర్చుండినయాతఁడు పలికెను. ఆకారమును వర్ణింప వలసినంత యవసరము వీనిని జూచిన వారికిఁ గానరాదు. అత్యంత సాధారణరూపము, మాసినధోవతి; గజము మూఁడణాలు వెలగల రంగుగీరల చొక్కాయి, ఒక బిన్నికంపెనీ చెక్కకోటు; మలినమయి మచ్చలుగట్టి యున్న యొక యుత్తరీయమును వాఁడు ధరించిన వస్త్రములు. చొక్కాయి కొంచెము చినిఁగి యున్నను, కోటుమాత్రము కొనినప్పుడు క్రొత్తదే. మూఁడువారముల మురికి గడ్డము, చము రెఱుఁగక జడలు గట్టుచున్న జుత్తును, వాని ముఖవికారమును గొంత తెలియఁజేయును

రథమాగినది :—

“అయ్యా, మీరుదిగొచ్చును” అనిసారథి యనుచుండ నితఁడు నివ్వెర పాటులేకయే దిగెను. మోటారు తనదారిని బోయెను. ఈతఁడుమాత్రము నలుదిక్కులుగలయఁజూచుచుండెను, ఏమి రానున్నదో యని యక్కడినుండి కదల

నుండెను. టంగు టంగున పదిగంటలు వినవచ్చెను. అంతలో మూఁడుకాళ్ళముసలి యొకర్తుక, యొండచేఁజెమ్మటలు గ్రక్కు-చు, సీతని ప్రక్కనుండియే పోయిపోయి, యొకసందుమలుపున నొక్కక్షణమాగి, యిటునటుఁజూచి, తనవైపుననే తెప్పవ్రాల్చక చూచుచుండు నీపురుషుని రమ్మని సంజ్ఞచేసి తనదారి దాబోవుచుండెను ఇదియేగురుతుగా భావించి యీతఁడునామె వెంబడి యనేకసందులుదూరి, గంతులుసొచ్చి, రథ్యలనరిగి, యెప్పటికైన నీబాట కంతము గలుగునా యని నివ్వెరపడి పోవుచుండెనేగాని యాముసలి సమీపమునకుఁబోయి ప్రశ్నింప నమకట్టుటలేదు. ఆరీతి దాదాపొక గంటవఱకు దిక్కుతెలియని తెన్నులఁబోయి ముసలిది యొకయింటి ముంగిట నొక్కింత యాగి తన కుడిచేత నాయింటినిజూపి తనదారిని దా బోయెను. ఈతఁడును సరియేయని ముసలివెంట నేగుటమాని యాయింటఁ బ్రవేశించి యెద్దియోపనియున్న యట్టులచావడిని గడచిలోనికిఁ బోయెను అచ్చట నాలుగిండ్ల చదరముఁ గాంచి యెటుఁబోవుటయో యని యించుక తాళగా, 'ఇటు, ఇటు' అని యొక శబ్దము వినవయ్యెను, ఈతడు నాదిక్కుననే పోవుచుండెను.

అందొక్కగదిలో నెనిమిది సంవత్సరముల బాలుడొక్కఁడు బంతితోనాడు కొనుచుండ నాచేరువనొక యున్నతాసనమున నారీరత్న మనఁదగిన యొక తరుణి యఱచేత నాననముంచుకొని దీర్ఘాలోచనలోనున్న యట్టులఁ గానవచ్చెను. ఈనారీమణి వయసున నిరువదియైదునకు మించినట్టు గానరాదు.

విచారమున మునింగియుండియు నత్యంత సౌకుమార్యంబుః నెంతచూచినను దనివితీరనిదియయి యుండెను. వలి పంపు సన్న దువ్వలువను మునుఁగిడి సొబఁగగు వాలుఁగన్నుల నబ్బాలుః ఖేలనము నాలోకించు చున్నట్టు లుండెను; గాని యాచూపుఁ నారసిచూచిన సందర్భము గానగాదు అట్టి యీసుదతీమణినిఁ గాంచినంత నితఁడొక్కింత యాఁగెను ఆగెననుట యేమి అగ వలసివచ్చెను.

తోడనే యామె దిగ్గునలేచి 'మీఁదకురండు' అని చేరుఁ నున్న సోపానపంక్తిని మేడమీఁదికేగి యీపురుషున కొః యాననమును జూపితానొక దానఁగూర్చుండెను. ఇట్టిద్దఱును సుఖాసీనులయియుండ 'అయ్యా! మీరేనా మోటారుమీఁద నిప్పుడువచ్చినారు?'

'అవును'

'మీరుడిటెక్టివులా?'

'అవును'

'మీనామధేయమో?'

'దానితో బనియేమి'

'పని యేమియా? సహాయార్థము మిముఁ గోరువార లకు ధైర్య మొసగునుగదా! ధైర్యము తానేసగము కార్యసిద్ధి నిచ్చును. కావున పేరవశ్యముకాదా?'

'గోపాలచందు నాపేరు. నే నెవరితో మాట్లాడు చున్నానో, యేకార్యమునుగూర్చి నాసహాయము కావలయునో తెలియఁజేసెదరా?'

'అట్లనా? మీరడిగిన రెండు ప్రశ్నలలో తొలుతటి దానితోఁబనిలేదు. నేనెవరయినను మీకార్యమునకు కొఱంత యుండదుగదా. ఇంక రెండవది చెప్పకున్న మిమ్మిటకు రప్పించుట యెందులకు? చెప్పెదను గాని, యిప్పుడు నేనీయఁబోవు కేసు మహాఘోరమయినది. నాకున్న బాధయుండ నేయున్నది గాని నిరూపకులకుఁగూడ ప్రాణాపాయము సంభవింపగలదు. ఇందు నిరూపకుడేమయినఁ బొరపాటొనరించెనా, పలువురు నిన్నందేహముగాఁ జావవలసి వచ్చును కాబట్టి ఘోర విషయములో జోక్యముగలుగఁజేసికొని, మహాహంతకులము దాదాపు ముప్పదిజీవంబులను యమపురికనిపి, యింకను నెన్నియేని దీయఁ గంకణము గట్టుకొనియున్న మహాపాతకులతో సయ్యాటలాడుటకు సాహసము, సహాయము, సూహాబలము నున్నవియో లేవో మీరే యాలోచించుకొని మీ నిశ్చయమును తొలుతఁ దెలుపుడు అదినిష్ఠరము మేలుకదా. తరువాత నన్ను మీరును, మిమ్ము నేనును నిదించుకొనుచు నాక్రూరుల వాతఁ బడుటమేలా? ఆలోచించుకొనుఁడు.'

గోపాలచంద్రున కిప్పు డాశ్చర్యము జనించెను. ఆసూశ్చర్య మింతఘోరముండుట నిజమగునా యనియో, నిరూపకముల నారితేరిన తనొక్క నారీమణి యిట్లాడించుచున్నదే యనియో, యూహించుకొనవలసినదే. ఎట్టకేలకు "విపద్దశ యందున్న వారలకు సహజంబగు నీమాటలువినగా నాకు

నగవు వచ్చుచున్నది. ఇంతదూరము డిటెక్టివను పేరు పెట్టుకొని వచ్చిన వెనుక నాకు సాహసముచాలదు, సహాయములేదు, అని యెవ్వడనును? పిరికిపందయయిన నిట్టిస్థితియందు ఊరకయుని యుననేకాని వేరుపలుకునా? కాబట్టి యింతశ్రమతో నడిగిన యీప్రశ్న కర్థము లేదనియే నాయూహ. ఏమయినను నే నీ కార్యమును సాధింపఁజాలుదుననియే నిరాఘాటముగఁ బలుకు చున్నాను. ఇంకనయిన సంగతియేమిదియో తెలుపవచ్చునా?" అనియనెను.

"అయ్యో, తెలుపుటకు సంశయములేదు. కానిమీచర్య సాగించుటకుఁగూడ నాధారము లెవ్వియు నీయజాలనని భయ పడుచున్నాను.'

'ఆభయ మెక్కనాటికైనవలదు. సంగతియేమియో చెప్పిన నాకు గావలసిన యాధారములను నేనేసమకూర్చుకొనె దను. ఆధారముల నిచ్చివేసిన నింక నేమున్నది. అనుదిగూడ నిరూపణ చేయగలదను మాటయే.'

'అయ్యో, గొప్పలెందుకు. ఒక్క దమ్మిడీయయిన చే యవు. ఆధారములేని వాడెవ్వఁడైననేమిచేయగలడు? నాదొక రత్నహారముపోయినదని మీకుచెప్పిన చాలునా? అపరాధు లను పట్టుకొనఁగలరా?'

'ఆహా మూడుదినములలో పట్టియిచ్చెదను, ఈచర్చ యెందులకు. సంగతి చెప్పకూడదా?'

'చెప్పకేమి, కాని మీ మాటలు నా కాశ్చర్యముగ నున్నవి.'

'ఆశ్చర్యమేల, ఒకవస్తువు పట్టుకొనిన ఆవస్తువే తన చరిత్రముఁ జెప్పును. అట్లు చెప్పించు సామర్థ్యముఁగలవాఁడే డిటెక్టివ్ కావలెను. ఇంకొకని కీవృత్తితోఁ బనిలేదు.'

'ఏదీ చూచెదను. నాయుంగరము చేత నేమి చెప్పించెదరో చెప్పింపుడు' అని యామె తనవ్రేలినున్న రవల యుంగరమును వానికిచ్చెను.

ఉంగరమును బట్టుకొని యొక్కింతతడవు పరిశీలించి 'నాకుదోచినంత చెప్పెదను అందలి సత్యాసత్యముల దాచక చెప్పవలయును. వినుము ఇది ఆఁడువారలే ధరించు కొనిరి; కాని చాలకాలము పురుషుల వాడుకలో నుండెను. దీనిని వాడుకచేయుచుండిన పురుషుఁడు గొప్పవాడేయయినను మోటుకార్యములఁ జేయువాఁడు. కాదు-కాదు. మితిమీఱిత్రాగుట హానియలవాటు. ఒక్కసారి యీయుంగరమితరుల యాధీనములోనికిఁ బోయినది—దొంగిలింపఁబడినదనుము. ఈయుంగరముఁగలవాఁడు మొన్న మొన్ననే యించుక పేదతికము నందెను—కాకున్న, స్థితి యొక్కింత తగ్గెను. ఈమధ్యరవ పురాతనపు రవయేకాని, దీనిలో మాత్రము క్రొత్తగా నమర్పబడెను—అంతకుమునుపు దీచోట మంచివజ్రముండెను. ఇదిమీ చేతికిచ్చి కొలఁదికాలము — ఒకమాసమునకుఁ దక్కువ —

ఆయెను. నమ్మకము కుదురుట కీపాటి చాలదా ? ఇంకెంత సత్యమున్నది?' అని గోపాలుచందు శిరమునెత్తునరికా యంగన హృదయమిట్లులున్నదని చెప్ప నలవియగునా! ఒక్క ముహూర్తకాలము నిర్వారపాటున నూరకొని 'ఓహో! మోసముగ నున్నదే! మీకెచటనో యీ యుంగరమును గూర్చి కొంత తెలిసెను. ఆవిషయము నేదియో యోచనచేసి చెప్పుచున్నట్లు నటించుచున్నారు' అని యామె యనెను

'నాపై నింద నారోపించురీతిని నన్నమితముగఁ బొగడుచున్నారు. నాకింతకుఁ బూర్వమీ యుంగరమునుగూర్చి యావంతయుఁ దెలియదు. ఇప్పుడు నేను నుడివిన యంశములన్నియు నీయుంగరమును సరియగు విచక్షణతోఁ జూచిన నెల్లరకుం దెలియును. వలయుననిన నే నెట్టుల సాధించితినో చెప్పెదను.'

'దీనిని వాడుకచేయుచుండిన పురుషుడు మోటనియుఁ ద్రాగుఁ బోతనియుఁ జెప్పినారే. ఎట్లు సాధింపఁజాలినారో తెలిపెదరా ?'

'వాడుక ననుసరించి యుంగరములను సన్ననిగీతలు బడుట సహజమే కాని, ఇవిగో 'యాలో త్తలు, యాగంటులును గలుగుటకు మోటుకార్యముల ప్రసక్తియుండవలెను. ఇంక త్రాగుఁబోతనుటకు, ఇదిగో యీదెబ్బ; సరిచేయించినప్పుటికిని బీటవారినట్లు గనిపించుచున్నది. ఇదిగో, ఇదిచూడుడు మీరవమీదనే దెబ్బతగిలినది. ఒక్కదెబ్బయయిన నేమో యను

కొనవచ్చును. వ్రేలియందు నుంగరమున కింత బలీయములగు నీదెబ్బలు దగులుట యసంభవము. కావున త్రాగుఁబోతని యూహించితిని.'

'సరియే, యొకసారి దొంగిలింపఁ బడినదంటిరే. అది యెట్లు ?'

'అదియా ? ఇదిగో లోపలమొదట M. R. అని, చేయించినవారి పేరనుకొనెదను, చెక్కియుండెను. తరువాత, నాయక్షరములను రూపుమాపుటకుఁ బ్రయత్నము విశేషముగఁ జేయబడినది. ఇవిగో సుత్తిదెబ్బలు, ఇతరగీతలును, ఇవి కంసాలి పనిరానియొక మూర్ఖుడు చేసియుండెను.'

'ఏమేమీ ? మఱియొకరుకొని యీయక్షరముల రద్దు చేయరాదా ?'

'అవును, అదియు నేనూహించినదే. ఇంతవెలకుఁ దెగించికొనినవాడు ఒక్క నాలు గణాలకు లోభముచేసి యుంగరముఁ బాడుచేసుకొనునా ?'

'ఈనడుమ దీని యజమాని పేదపడియుండు నంటిరే అది యెట్లు సాధింపఁ గలిగినారు ?'

'అందులకే మున్నది ? ఈ రవలుఁ, ఈ కట్టడము, ఈ చేఁత, వీనినిబట్టి తొలుత నీనడుమనుండు రవ మంచి ప్రశస్తమయిన వజ్రమయియుండు నంటినిగదా, ఈమధ్యను యీవజ్రముతీయవలసివచ్చెను. కారణమేమయియుండును. 1. మంచి

రవను వేయుటకు వజ్రమయియుండవచ్చును. ఇప్పుడున్నది పది రూకలయిన చేయునిక్కొరగానిది. కాబట్టి ఆకారణముకాదు. 2. దెబ్బతగిలి రవ చిరిగిపోయినదేమో — అట్లయిన నంతదెబ్బ చుట్టుప్రక్కలను కొంచెమయినఁదగుల కుండుట కానేరదు. ఇదియుఁ గారణముకాదు. 3 దొంగలుతీసియుందురా — చేత వాతగార చెడుగీతలు గీసిన యాదొంగలు వజ్రమును తీయు నేర్పుకలిగియుండరు. 4 మఱియేమి? అవసరముకొఱకు యజ మానియే ఆవజ్రమును దీసి యుండవలయును. ఒకవస్తువునుండి యిటుల దీయుట స్థితి మారినట్టుల తెలియఁజేయును గదా. ఇంక నొక్కవిశేషము. ఆవజ్రమును దీసినవారికిఁ గుటుంబగౌరవము కూడఁ గోల్పోవగూడదను నూహ యుండెను. లేకున్న నింత పురాతనపు రవ్వను సంగ్రహించి దీనిలో సమర్చరు. ఇంకనయినఁ బ్రస్తుతవిషయము నెఱింగింపబూనుదురా?'

'నాకు మఱియొకకారణము స్ఫురించుచున్నది. అది కాఁగూడదా?'

'సరి, సరి ఆయూహ నాకుఁదెలిసినది. దీని నెవరిదగ్గర నయిన దాచి యుంచినప్పుడు వారిట్లుమోసము చేయకూడదా. అనియేనా?'

ఇంక నాస్త్రీ మన సెట్టులుండునో యోచింపవలసినదే తా నేయూహనుగలిగియుండెనో అదియే యిది. తాను ప్రసంగించుచున్న యాతఁడు మనుష్యమాత్రుఁడు గాఁడనియుఁ గేవ

లము దేవాంశ సంభూతుఁడనియు లోలోనఁ బ్రణమిల్లును, 'నదియే నాయూహ అట్లుకాకూడదా?' అనెను.

'కావచ్చును గాని అట్లయినయెడల మరల నీ రవ దాపినప్పుడెంతరో శ్రద్ధతో గురుతు కానరాకుండచేయును గాని యిట్టుల నతుకులు కానవచ్చునట్లుంచునా? కాబట్టి ఆకారణ మొక్కనాటికిని కానేరదు ఇంక నాలస్యమేల?'

'మహానుభావా, మీమాటలవలన నాకార్యము మఱచిపోతిని. నేనెందఱినో డిటెక్టివులను జూచినాను, గాని మిమ్ముఁ బోలిన యూహాసమృద్ధిని గలవారినిచూచి యెఱుఁగను. మీ యమూల్య చాతుర్యమునుజూచి మీకీకేసు నీయకుంట యేమంచిదియగునేమో యని భావించుచున్నదాన. ఇట్టి కుశాగ్రబుద్ధినిగూడ నాహంతకుల వాతఁబడవైచినే నేల పాపముఁ గట్టుకొనవలయునని విచారించుచున్నదానను.'

'ఇదేమి? నన్నువట్టి పందగా భావించుచుంటివా? ఉలగరమునుగూర్చి యింత యూహించినవాఁడను నిన్నుఁగూర్చి కొంతయైన యూహించియుందునుగదా ఆయూహాలో నీవిట్టి పిరికి కండను జూపుదువనునది తోచ లేదేమని యాశ్చర్యము నందుచున్నాను. నీ కావంతయెన నావంత యసవసరము. నేనా హంతకుల వాతఁబడుదునో, లేక వారే-ఎవ్వరో, ఎందరో— నావాతఁబడుదురో చూచెదవుగాక.'

'చిత్తము; పదినిమునములు నాకు వ్యవధి విచ్చెదరా? వలయు విషయంబులఁ జక్కఁజేసికొనెదను?'

'అందుల కభ్యంతరమేమి. నేనీలో నిటు నటుఁ దిరుగు చుండెదను.'

---

# రెండవ ప్రకరణము

---

## అవకతవక కథ.

సుందరాంగి యడిగిన పది నిమునములును నిరూపకున కన్ని దినంబులయట్లు యెంతయో లాభ హేతువులై తా నున్న గృహంబునకు నలుదిక్కుల నున్న విషయంబులును, నాయింట నటునట నున్న వాకిళుల నవలోకించి కర తలామలకంబుగ నా స్థానంబు నెఱుఁగు నదను నమకూడినది. ఇంతలో నా యింతి తిరుగ వచ్చి యథాస్థానంబు నలంకరించియుండుట చూచి యే మియు నేరనియట్టుల నీ గోపాలచందు తనకు నియమించిన యాననమునఁ గూర్చుండెను. అంత నా యిరువురకును సంభా షణ యీ తీరున జరిగెను.

'అయ్యా, (అని నంత లెంపలు గొట్టుకొని) మహాను భావా, శ్రద్ధతో వినుడు. మాది దేవీపూరని యిక్కడకుఁ జాలా దూరమునసున్న యూరు.'

'ఓహో, మేదినీ పురమునకు నాలు గైదు మైళ్ళ దూర ముండును గదా మీ యూరు?'

'అవును, అదియే. మీ రక్కడికి కెప్పుడయిన పోయి యుంటిరా?'

'పోవుట యెన్నడును లేదు. వినుటయే.'

'అట్లనా! ఆ యూరిలో నధిక ధనవంతుడు—'

'రాధారమణ సర్కార్ కదా వాని పేరు. క్షేమముగా నున్నాడా?'

'ఓహో! యిదియేమి? వినియుండవచ్చును గాని యింత బాగుగ జ్ఞాపక ముండుట యాశ్చర్యముగా నున్నది! అవును. ఆతడే. క్షేమముగా నున్నాడు. కాని యాతని యన్న యొకఁ డుండెను. మీ రెఱుఁగుదురా?'

'ఔను. వినుటవలననే యెఱుఁగుదును. ఆతడేగదా భగవాన్ సింగు.'

'మహాత్మా, నా కనుమానము వృద్ధి యగుచున్నది. మీ రెప్పుడో ఆ యూరికి పోయియుండి యిటుల నన్ను మోసపుచ్చుచున్నారు. సందేహము లేదు.'

'అయ్యో! నీ కింత వెఱ్ఱి యెందులకు? వినిన యంశము లన్నియు జ్ఞాపక ముంచుకొనకున్న మా వృత్తి జరుగునా! ఏదయిన మన కేమి; సంగతి యేమియో చెప్పుము.'

"చిత్రము. ఆతఁడు నా మేనమామ. దిగువను బంతి
యాడుకొనుచున్న బాలుఁడు వాని కుమారుఁడు. మే మిరువుర
ముఁ దప్ప నా కుటుంబమున నందఱు నౌకరి వెనుక నౌకరు పర
లోకంబునకుఁ బోయిరి. ఆస్తియంతయు నితరు లాక్రమించు
కొనిరి. దొంగపత్రములతో, యథార్థములో దేవునకే ఎఱుక.
మా మామగా రన్ని యప్పులుచేసి సంస్థానమునంత పాడుచేసి
యుండు నని యొక్కనా డయిన మే మనుకొనలేము. కుటుంబ
మునకు నాశనము సంభవించినది గదా యని భయమున నే
నిందు వచ్చి మారుపేరుతో నతి గూఢముగా జీవించు చున్నా
ను. ఇది నా స్థితి. తెలిసినదా?'

'ఏమిది? నేను వట్టి పశుప్రాయుఁడ ననుకొనియా య
ట్లడుగుచున్నదానవు. నీవు చెప్పిన సంగతులలో నెంతయో
దాచి చెప్పుచున్నప్పుడు నే నెట్లు చక్కగా తెలుసుకొనఁ గలు
గుదును. ఒక్కయంశమైన సత్యముగఁ జెప్పనూంవా నీ కున్న
గదా నేను తెలుసుకొనుట?'

(నివ్వెరపాటుతో) 'అదియేమి! మీకే యంశ మింత
కుముందు తెలియకున్న నేను దాచితి నని యెట్లు చెప్పఁ
గలరు?'

'ఎట్లా—వినుము. దొంగపత్రములో యేమో యనినప్పు
డెవ్వ రాపత్రములు చూపిరో యా సంగతిఁ జెప్పవలయునా?
ఇట్టి చిత్తు ఇంటికి వచ్చునప్పుడు రాధారమణగా రేల యూర

కుంటిరో చెప్పవలయునా? ఒకరి తరువాత నొకరు పరలోక మునకుఁ బోవుటకుఁ గారణమో, అనుమానమో, చెప్పవల యునా? ఇక్కడ నీబాలునితో వచ్చి మా రుపేరున నున్న యప్పుడు ఇందులకుఁ గారణము లుండునుగదా? ఇన్ని విషయ ములు కొంఱతయుండఁ దెలియుట యనగా నెట్టిది? చక్కగా విరళముగా నీ మామూలు మాటలతో చెప్పు.'

'అలాగయితే వినండి. అయ్యా, ఇప్పుడు మాకు కలి గిన ఆపద మహా ఘోరమయినది. ఈ ఘోరస్థితిలో బడి దాదాపు మావంశంలో ముప్పయిమంది ప్రాణాలు వదులు కున్నారు. పాపము వాళ్ళలో ఒక్కరికైనా ఇన్ని మరణాలు ఇంత స్వల్పకాలంలో రావడమునకు కారణమేమిటో, దీని కంత టికిన్నీ ఎవరు పూచీదారులో, యీసంగతి యేమీ తెలియదు తెలియదేమిటి—వారికి అనుమానమే లేకపోయింది. ఇదంతా ఒక గ్రహచారమే అనుకున్నారు గాని మరేమీ వారెరు గరు. ఈకథంతా ఎలాగు చెప్పడమో నాకే తెలియకుండాఁ ఉన్నది. నా నోరు విప్పకముందే నా కాచావులు, ఆ బాధలు, ఆఘోరాలు జ్ఞాపకం వచ్చి గుండెలు దద్దరిల్లుపోతున్నాయి. అయినా, మిమ్మల్ని చూస్తుంటే నాకు కొంతధైర్యం కలుగు తూఉంది. ఇహ చెబుతాను వినండి. మాది జాల్వారు రాజ్య ములో దేవీపూరనే సంస్థానము. భగవాన్ సింగు గారిని మీ రెరిగే యుంటారు—ఆయన మామేనమామగారు. ఆయనకు

నామీాద చాలా అభిమానం ఉండేది. ఏ వ్యవహారంలో నైనా నాఆలోచన పుచ్చుకునేవారు. ఆమాటలకేం గాని అయనగురించి మీాకేమైనా తెలుసునా?' అని యీానుందరి కొంత యీాగెను.

'ఆ, ఆ, కొంచెము తెలియును. ఆ భగవాన్‌సింగు గారే కదా నాలు గయిదు సంవత్సరముల క్రిందట జాల్వారు రాజుగారితో స్వతంత్రమునకై పోరాడి వారిచేత కొన్ని షర తులు వ్రాయించుకొన్నారు. గొప్పజమీాందారుడనే వాడుక. మంచి ధైర్యశాలి కూడాను.' అని గోపాలచందు చెప్పెను.

'ఆ చాలు ! ఆయన అలాగ లోకఖ్యాతి గడించి సంస్థా నాన్ని 40 లక్షలనుండి 75 లక్షలకు తెచ్చి సుఖముగా నుంటు న్నారా; ఇంతలో మాపాలిటి మృత్యుదేవతలాగ ఒక దివాను గారు దయచేశారు. వారి దేవ్వూరో యెలాంటివారో యెవరికీ తెలియదు, పేరుమాత్రం భానోజీ అని చెప్పేవారు మహాను భావా, నేనేమి చెప్పగలను. ఆ దుర్మార్గుడు సంస్థానంలో కాలు పెట్టాడు; ఎక్కడచూచినా చావులే! యేముఖాన్ని చూచినా ప్రేతకళలే. రాజ్యములో విశ్వాసముగానుండే గొప్పవాళ్ళంతా ఆకు డుల్లిపోయినట్లు గభీ గభీ మని చచ్చిపోయినారు వారిస్థానే కొత్తవాళ్ళను నింపేశీవాడు ఈ భానోజీ. రెండుసంవ త్సరములయేసరికి యెక్కడచూచినా వీళ్ళదండే. మా కోటే మాకు ఖైదుఖానాలా గుండేది వీరి నాన్నగారు కూడా అఖ

రకు గాభరాపడి ఏమిూ తోచకుండా అలా ఉండీవారు. మరి రెండురోజులలో కోటలోనికే చావులు వచ్చాయి. దాసీలు దే విడీవారు అంతా ఒక్కొక్క రోజుకి నలుగురైదుగురు చొప్పున చచ్చిపోయేవారు వారి కందరికీ బదిలీలు తక్షణమే వేసే వాడు, అంతా పన్నాగమే అంతా కుట్రే అయిపోయింది. ఆ ఖరికి బాబో, మందు అని వెళ్ళేనరికి ఆ డాక్టరుగూడా కుట్ర లోనివాడే అని అనిపించేది. పాపము ముసలి డాక్టరుగారు పోయిన దగ్గఱనుండి కూడా ప్రజలకు, కోటలోవారికి మరి వైద్య సహాయము పోయింది. వీరినాన్నగారికి భానోజీమీద అనుమానం ఉండేది. కాదుగాని నాకుమాత్రము మొదటనుండీ ఆఅనుమానం ఉండి వీడి నేలాగైనా పనిలోనుండి తప్పించియ్యండని యెంత చెప్పినా 'ఛీ నీకు తెలియదు. వీడు చాలా నేర్పరి. ఎలాగైనా మనకు స్వాతంత్ర్య మిప్పించేశక్తి వీడికున్నాది. ఆ కాగితాలే యిప్పుడు వ్రాస్తున్నాము.' అని అనేవారు గాని నామాట కొంచమైనా వినేవారు కారు. ఆయన మతే విరిగి పోయింది అదికూడా ఈ పాపి దెబ్బే; సరి మరేముంది; నాలుగురోజు లయిన తరువాత నేను బలిమిని పోరుపెట్టగా, ఒకనాడు ఎలాగైతే నేమి భానోజీని పిలిపించి వీరి నాన్నగారి తరఫున నేనే మాట్లాడి ఆ దుర్మార్గుణ్ణి పని చాలించమని చెప్పేశాను. అంత వాడు 'సరే, దీనికేమున్నది.' అని 'అయ్యా, నేను వెళ్ళిపోతాను గాని ఈ కాగితాల కేమంటారు?' అని ఏవో

యింగ్లీషు కాగితాలు చూపించేసరికే ఆయనప్రాణాలు పోయి నాయి. 'ఇదెవరిచ్చారు? ఇదంతా మోసమే.' అని స్మారకము తప్పిపోయినారు. ఆ సాయంకాలమే వారు గతించినారు. మరేముంది ఖానోజీగారే సంస్థానానికి జమీందారుగారు.' అని యాతన్వంగి గ్రుక్కిళ్ళు మ్రింగుకొనుచుండెను.

అంతలో డిటెక్టివు గోపాలచందు, 'ఇదియా సంగతి? నీ వెట్లు తప్పించుకొంటివి? ఈకుమారు నెట్లురక్షింపగలిగితివి? తప్పించుకొని వచ్చునప్పుడు కాగితములేమైనా నీతోఁ దీసుకొని వచ్చినావా? అదిగదా ముఖ్యమైన సంగతి. విచారమువలన లాభ మేమియు లేదు. పోనీ; నే నడిగినదానికి జవాబుచెప్పు. నీపై గాని ఈకుఱ్ఱవానిపై గాని వారు వారి ప్రభావము చూపించడానికి యేమీ ప్రయత్నాలు చేయలేదా?'

'అయ్యో, చెయ్యకేమి? మాకొఱకు నియమించిన భోజనము, బట్టలు, నీళ్ళుకూడా మేము ముట్టేవారము కాము. పొరపాటున ఎవరైనా అవి ముట్టారా, సరి వారు మాకళ్ళెదుటే బాధపడుచుండేవారు. ఇది అంతా చూచి ఒకనాడు మా కుమారసింగు మరణించిపోయినట్లు నటించి ఏలాగో వీణ్ని మాత్రం దానీదాని యింట దాపించి నేను తప్పించుకొని వచ్చినప్పుడు వెంట తెచ్చుకున్నాను.'

గో—నీవు ఇక్కడకువచ్చి ఎన్నాళ్లైంది?

సుందరి:—ఈయింటికి వచ్చి నాలుగు మాసాలైంది.

ఇంతకుముందు రాధా బజారులో ఉండేదాన్ని. అంతకు ముందు ఖిదర్‌పూరులోను, అంతకుముందు గయాలోను యిలాగ యీమూడు సంవత్సరాలు తిరుగుతునే ఉన్నాను. ఊరి కొక వేషము-ఊరి కొక నాలుగు నెలలు-ఊరి కొక పేరు-ఇదే బ్రతుకు.

గో:—ఈ మూడు సంవత్సరాలు లేని తొందర ఇప్పు డెందుకు పుట్టింది డిటెక్టివును పెట్టడానికి?

నుం:—అలాగైతే వినండి. నేను వచ్చినప్పుడు జాల్వారు రాజుగా రిచ్చిన షరతుల కాగితాలు, మరికొన్ని కాగితాలు పట్టుకొని వెళ్ళిపో వచ్చాను. నా ఉద్దేశ మేమిటంటే వీడు కొంచెము పెద్దవాడయి-ఆ దుర్మార్గుడు భానోజి చచ్చిపోయినప్పుడు-ఈ కాగితాలతో జాల్వారు రాజుదగ్గరకు పోతే మా హక్కు మాకు ఇచ్చివేయునని. మంచో చెడ్డో నాకు తెలియదు. కాని నామట్టుకీ ఊహే మంచిదిలాగ తోచింది. మరేమైనా ఇప్పుడు చేశానా, ఈ పిల్లడి ప్రాణాల మీదికే వస్తుంది ఇదీ నా ఊహ.

గో:—సరే నన్నిప్పు డెందుకు పిలిపించావు?

నుం:—అదే ముఖ్యమయింది. ఇన్నాళ్లు నే నెక్కడ ఉండేదీ ఏమి చేసేదీ కూడా భానోజీకి గాని వాడి తాబేదార్లకు గాని తెలియదు. ఇప్పుడో—ఈవేళ ప్రొద్దున్న వాడిదగ్గర ఉండే రాక్షసి ఒకడు మోటారుమీద అదిగో ఆ పక్కనున్న

రోడ్డుమీదికి వచ్చాడు. వాణ్ని నేను చూశాను. నేను బాగా గుర్తుపట్టాను. ఒక్కసారి వీరి కంట పడేనా, సరి-నాపనీ యీ పిల్లడిపనీ-అంతా ఐపోయిందన్నమాటే. నాకేమీ కాల్లాడక మంచి చాకచక్యం గల డిటెక్టివును తెప్పించే ప్రయత్నం చేశాను. ఇప్పుడు నన్ని దుర్మార్గులనుండి ఎలా తప్పిస్తారో!

గో:—దుర్మార్గులు అంటున్నావు-ఎంతమంది ఉన్నారు?

మం:—ఎంతమం దేమిటి? లోకమంతా వాళ్ళే గాబోలు. వీళ్ళకి తోడు వచ్చి కసాయివాళ్ళలాంటి అడివి మనుష్యులు కొందరు. ఇప్పుడిక్కడి కెందరు వచ్చారో, ఎంతవరకు పోల్చుకున్నారో నాకేమీ తెలియదు. ఒక్క క్షణ మాలస్యమైతే నన్నూ యీ పిల్లవాణ్ని కూడా చంపి నా కాగితాలు తీసుకపోతారు. అందుకు సందేహంలేదు.

గో:—ఇప్పుడు నువ్వు చూచినవాడొక్కడే కదా; వాడి పేరేమిటో చెప్పగలవా? బాగా పోల్చావా?

మం:—నేను చూచినవాడు కరీమ్. వాడూ వాడి చప్పిముక్కూ, గరిమీసాలు, పిల్లికళ్ళూ అంతా చక్కగా బైనాక్యులర్‌లో చూశాను. వాడే- వాడే- ఏమీ అనుమానం లేదు.

గో:—కరీమ్ మోటార్ మీద కదా వెళ్లిపోయినాడు, నీవు బైనాక్యులర్ పట్టి చూచినంతవరకు వ్యవధి ఎలావచ్చింది?

సుం—అదిగో చూశారా? ఆ వేపచెట్టు. అక్కడ వాడి మోటారు చక్రం బద్దలయిపోయింది. అక్కడ వాడు మరమ్మత్తు చేసుకుంటూ ఆగిపోయినాడు. కనుక బాగా గుర్తు పట్టినాను.

గో:—సరే-నీ కిప్పుడున్న భయం అంతా నిన్ను ఆ దుర్మార్గులు చవారాపట్టి పోల్చారనే కదూ; అలాగయితే నువ్విప్పుడు యింకోయింటికి మార్చుకుంటే బాధేవిటుంది?

సుం:—బాధే విటంటా రేవిటి? అంతా బాధే. బాధకాక మరేవిటి? ఒకమాటు వీళ్ళకంట బడడమున్నా, మళ్ళీ మనం తప్పించుకోవడ మున్నా? మీకు వీళ్ళసంగతి తెలియదండీ.

గో—సరే గాని నువ్వు చెప్పవలసిన సంగతులన్నీ చెప్పడం అయిందా? మరేవైనా కొత్తసంగతు లున్నాయా?

సుం—అదేవి టలాగ అడుగుతూన్నారు — మీరు ఎక్కడికో వెళ్ళిపోతారా యేవిటి?

గో—ఎక్కడికీ వెళ్ళకపోతే యీ అల్లరంతా తగ్గడం యేలాగ?

సుం—మళ్ళీ వేగంగానే వస్తారుకదూ? జ్ఞాపకంవస్తే, మఱచిపోకుండా మీతో చెప్తాను.

గో—సరే. బాగుంది. కాని యిక్కడ నీపేరేవిటి?

సుం—లక్ష్మీబాయి.

'నీకు పెళ్లైందా ?'

'లేదు'

'ఎక్కడనుండి మీరిక్కడకు వచ్చినట్లు ?'

'ఉదయపూరునుంచి. మేము గొప్పవాళ్ళము అనే బాధుక ఇక్కడ.'

'మరి యీ కుఱ్ఱవాడో ?'

'వీడు కుమారసింగు ఇక్కడ.'

'అక్కడో ?'

'జగత్ సింగ్.'

'చక్కగా నున్నది. నీ సేవకులు నమ్మదగినవారేనా ?'

'అందు కభ్యంతరములేదు. నాకోసం ప్రాణాలుకూడా వదులుకుంటారు. వాళ్ళయినా ఎంతమంది — ముగ్గురు. ఒక ఆడది ఇద్దరు మగవాళ్ళు'

'సరే—నేనుపోయి ఆ వేపచెట్టుదగ్గరనున్న గుర్తులు ఏమైనా సాయంచేస్తాయేమో చూసి వస్తాను'

'గోపాల్ చంద్ గారూ, మీతో మాట్లాడుతున్నంత సేపూ నాకు అదోమోస్తరు ధైర్యం ఉంటున్నాది. మీరు తిరిగి వేగం రావాలి సుమండీ; మాట—'

అని ఆయన సమీపమునకుఁ బోయి అతి రహస్యముగ నేమేమిరో చెప్పినంత గోపాల్‌చంద్రు 'అంతా నిజమే; అయితే నిజం నిలకడమీద గాని తెలియదు' అని నవ్వుకొనుచు, 'నీవు

ఊహించిన పనిమాత్రం ఎప్పుడున్నూ చేయకుమా. నా పనికి ప్రమాదం కలుగచేస్తుంది. జాగ్రత. నేను వెళ్ళి చూచివస్తాను" అని మెట్లుదిగి ఈ మోటుపనివానివలె నున్న గోపాల్‌చంద్ వీధిని బడెను.

---

## మూఁడవ ప్రకరణము

---

### ఫోటోగ్రాఫ్ వాఁడి—మోటారు బాడ

లక్ష్మీబాయి గృహమునుండి బయలువెడలిన గోపాల్ చందు నడిమింటనుండు సూర్యుని వేఁడిమిని సరకునేయక వడి వడిగ వేఁపచెట్టు దిక్కునకుఁ బోవుచుండెను. ఆ ప్రదేశ మంతయు నెండ వేఁడిమిచేత నిశ్శబ్దముగనుండెను. అక్కడక్కడ దప్పిచేతనో, వేఁడిమివలననో, యాయానమునఁ గావుకావురను కాకుల యఱవులు మాత్రము నిశ్శబ్దమును మరింత విశదీకరించు చుండె. దూరమున నెండ మావులవలె వాతావరణమునఁ దళతళలు గాన నగుచుండెను. ఒక్క పిట్టయైనను వెలుపల గానరాక యీ సర్వం సహా చక్రమునంతయు భానుని యాగడంబునకు విడిచిరా యను సందేహంబు నాపాదించుచుండెను. అట్టి యీ యాతపంబున గోపాల్‌చందు అన్యాయత్త చిత్తంబుతో నావేముకడకుఁబోయి యొద్దియొని త్రోవలోఁ గోలుపోయినవానిం బలె నూరక బాటను పరిశీలించి చూచు

చుండెను. అటుల నాలుగయిదు నిముసములు వెదకుచుఁదిరిగి యొక్కచోట కొంచెము నిలిచి తన గడియారమును పయికిఁ దీసెను.

ఆచోట మోటారును బాగుచేయునప్పుడు వారుపయోగించిన నీరు క్రిందఁ బడుటచే బాట యాభాగమున కొంచెము తడిసియుండెను. మార్గమున నాచోట మాత్రము మోటారుజాడ చెదరక చక్కఁగఁ గానవచ్చుచుండెను. అందుననే చంద్ అట నాగియుండె ననుట వింతకాదు.

ఆతఁడు తనజేబు గడియారమును తీసి యధారీతిని కాల మెంతయైనదో చూడకయే, యంకెలుండు నాదెస లక్ష్యముసేయక, యద్దానివెనుక కప్పును మీటనొక్కి, తెఱచి, కొంచెమునే పేమియోచేసి, ఎప్పటియట్లు దానిని తనజేబున నిడుకొనెను. ఇంక మరి గోపాల్‌చందున కటనుండుట యనావశ్యకము. బిరబిర లక్ష్మీబాయిగృహమునకుఁబోయి చావడిప్రక్కగదిం బ్రవేశించి తలుపులు వేసికొని, ఆచీకటిలో నేమేమో చేసి, అనంతరము లోనికిఁబోవుచుండెను. అంత నొకపనికత్తె యెవరుమీరని ప్రశ్నింపనీతఁడు 'బదులేమి చెప్పవలెనో' అని శంకించుచుండ. 'మీరేనా; ఏమిచేసినారు?' అని పరిచితకంఠస్వనముతో మరలనాదాసియే ప్రశ్నించెను. గోపాల్‌చందున కానందము కలిగెను. తానెవరో తాను చెప్పకపూర్వమే ఆదాసీవంటి యామె తన్ను గుర్తింపఁగలిగినందుకా? లేక లక్ష్మీబాయియే యింతవేగముగా పనికత్తెవలె సంపూర్ణముగా మారజాలినందుకా ఆ గోపాల్‌చంద్ సంతోషము?

'నీవేనా ! చాలా సంతోషమైనది. ఇంక శత్రులగెలుచుటయందు అంతకష్టం వుండదు చాలనేర్పరివే. సంతోషము ఇప్పుడు నేనుపోయినపని సానుకూలపడ్చుకొని మరీవచ్చాను. ఇదిగోచూడు.' అని ఒక చిన్న కాగితపుముక్కను బల్లమీద పెట్టి యొకచిన్న దుర్భిణిని జేబులోనుండితీసి 'ఈ కాగితపు ముక్కమీద ఏఁవిటున్నాదో చెప్పు; చూదాం.' అని చంద్ ప్రశ్నించెను.

మోటారు చక్రఁపుజాడ, ఆ చక్రముమీద నుండుగరును, చుక్కలు, అన్నియు స్పష్టముగా గానవచ్చుచున్నవి. ఒక్కచోటమాత్రము ఆగీతలు కానరాక యుబ్బెత్తుగనున్న గుత్తుకలదు. ఆగుర్తుగూడనొక చోట నొకగోయి:—

దీనినిచూచి యాసుందరి. 'ఇదేఁవిటి—ఫొటోగ్రాఫులాగున్నాది?' అని ప్రశ్నించెను.

'అవును. ఇది యిప్పుడు నే నక్కడ తీసిన ఫొటోగ్రాఫ్ దీనినిబట్టి ఆమోటారు చక్రమునకు ఎట్టిమరమ్మత్తుచేశారో తెలిసిందికదా. రబ్బరుటైరు ఎలాంటిదో, వకంపెనీదో, ఆ టైర్ మీాదమరమ్మత్తుకి ఎలాంటి ముక్కవేశారో తెలిసిందన్నమాట. ఇంక ఆమోటారు ఎక్కడున్నాదో పోల్చాలికదూ; ఆతర్వాత అదియెవరిదో. వారిపేరేఁవిటో, కరీమ్‌కు ఈవ్వాళ్ళ పేరేఁవిటో యిన్నిసంగతులున్నూ తెలుసుకొనుటకు యిదే ఆధారం ఔతుంది. ఇదేలేకపోతే నువ్విప్పు డిచ్చిన ఫోటో మీాద నేనేఁవిటిచెయ్యగలను?' అని చంద్ అనెను.

‘ ఇది మీ రేలాగు సంపాదించారు ? ’

‘ అక్కడ ఒకచోట రోడ్డుమీద కొంచెము తడిసివున్నది. ఆచోట యీగుర్తు స్పష్టంగా కనపడ్డాది. నావాచీ వెనుక భాగంలో ఇమిడివున్న ఫొటోగ్రాఫ్ యంత్రంతో ఈ ప్రతిబింబం తీశాను. పోనీగాని ఈగుర్తుపటంతో నువ్వు మరేదైనా పోల్చ గలవా ?

‘ ఇందులో మరి పోల్చడాని కేంవుందిగనక ? ’

‘ అలాక్కాదు. యీమోటారు చాలాక్రొత్తది. మిక్కిలి తేలికైనది తొంబై తొమ్మిదినాళ్ళు ఇద్దరుకూర్చుండుటకు సరిపోయిందే (అనగా-టూ సీటర్-) అని అనుకుంటాను? ’

‘సరిగాపోల్చారు. నిజంగా అది చిన్నబండే? ’

‘ సరే-నేనిహ నాప్రయత్నంలో వుంటాను. నీవు మాత్రం జాగ్రతగా సంచరిస్తూ ఈచుట్టుప్రక్కల యేంజరుగు తూవున్నదీ గమనిస్తూవుండాలి. నాకు అప్పుడప్పుడు, జరుగు తూవున్న సంగతులు చెప్తూవుండాలిసుమా? ’

‘ మళ్ళీ దర్శనం యెప్పుడు ? ’

‘దర్శనాని కేంవుంది ? ఎప్పుడవసరంవుంటే అప్పుడే- ’ అని యాతడు వీధిలోనికిఁ బోవుచు, ‘ కుమారసింగేడీ? ’ అని ప్రశ్నించెను.

ఇంతలో నొక ముదుసలిదాది యొకర్తుక, యొక యాడుపిల్లతో నావసారాలోనికి వచ్చుచు,-దాదికి దగినరూపమే యాయాడుపిల్లది; చింకిదుస్తులు; చింపిరిజుట్టు-గల యా యాడు

పిల్లను చూచుచు నవ్వినంత, నాకుమారసింగీ రూపమున నున్నాడని సూచించు నగవున గ్రహించి, 'వహ్వా-వహ్వా!' యని చంద్ మెచ్చుకొనుచుఁ బోయెను.

---

## నాల్గవ ప్రకరణము

---

### మోటారువేఁట; దారికావు

కలకత్తానగరము (కాళీఘట్టము) ననేచోటఁజూచినను జనసమృద్ధి విశేషముగనుండి యింకొక ప్రక్కకుఁబోవుట ప్రాణాపాయ కరమనుమాట నానగర రాజంబును జూచిన యెల్లఱకును విశదమేగదా! వీధులన్నియు నారీతినుండునని చెప్పి, నింకధర్మతొల్లా లోనుగాఁగల యంగడివీధు లెట్టు లుండునో చెప్పవలయునా. కొనుటకు వచ్చినవారలు విపణుల లోనికేగి తమకు వలయు వస్తువుల నెంచి కొనినసామగ్రుల నొక మూటగఁ గట్టుచుండ, జేబులు దడుముకొనుచు, 'అయ్యో, అయ్యో, నామనీపర్సు (రూపాయలనంచి) ఏది? ఇప్పు డిప్పుడు చూచుకున్నాను. ఈ జేబులోనే ఉంచుకున్నాను. అయ్యో! కనపడదేఁవి? అన్నా 45 రూపాయలు కొంత చిల్లర' అని బిగ్గరగనఱచుచు, 'దమరోదనమంతయు నరణ్య రోదనంబునుబోలియుంటచే గ్రుక్కిళ్ళుమ్రింగుచు నాయంగడి వానికి క్షమాపణ చెప్పి వచ్చినదారిని మొఱ్ఱోయని పోవుట,

యావీధులలో సాధారణ విషయము - అట్టులసామాన్య విష యమే కాకున్న నటుల వీరు విలపించుచుండ నితరులందఱు నేల జాలిలేక నవ్వుకొనుచుందురు ?

అట్టి యాయంగడివీధిని మధ్యాహ్నము 1½ గంటల వేళ నొకడు చేతనున్న సోగబెత్తము (విలాసదండము) ను త్రిప్పుకొనుచు నూలకో నొక యింగ్లీషు రాగముఁ బాడుచు వడి వడిఁ బోవుచుండెను. వాని యాకారమంతయు దొరల యాకారమును బోలియుండి, త్రోవనున్న వారందఱును వా నికి దారియిచ్చునట్టులఁ జేయుచుండెను. దొరయనుకొనుటకు దగినశరీరవర్ణమును, బాగుగా నమరియున్న దొరటోపీయును, మిక్కిలి విలువఁగల సూటును, తళ తళ లాడుచు మెఱుఁగెక్కి యున్న జోడును, జోడునకును పంట్లాము కాలిచివరకును నడుమ నప్పుడప్పుడు కానవచ్చు చక్కని పట్టు మేజోడును, కంఠమునందెత్తుగా గానవచ్చు కాలరునకుఁ బొందుపరచిన పట్టు నెక్టైయును, అతనికి దొరిచేయు చోప్దారులగు చుండెను. నున్నని గడ్డమును నగము మాత్రముకానవచ్చుచున్న మీస మును ఆతనివయను 20-25 లోపున నుండునేమోయను నను మానముఁ గలుగఁజేయును.

ఈతండట్టులఁ బోయిపోయి పురపాలకసంఘకార్యస్థాన మునఁ బ్రవేశించెను. దీనికే చిన్నపట్టణములో మ్యూనిసిపల్ ఆఫీసనియుఁ, బెద్దపట్టణములలో కార్పొరేషన్ అనియు వాడుక. అట్టుల నా కార్యస్థానముం బ్రవేశించి, నాచోటెంతయో మెరి

గినవానివలె వడివడి లోనికరిగి యొకనితో మాత్రము కొంత ముచ్చటించి, వానితోఁ గూడఁ గొన్ని పుస్తకంబుల నవలోకించి, యాతనికి నమస్కరించి వెలువడెను. తోడనే యట నీతని కొఱకే వేచియుండెనా యని తోఁపఁజేయు నొక్క శకటంబు నధిరోహించి 'మోటారుఖానాకు' అని సారథికుత్తరు వొసఁగెను.

మోటారుఖానాచేరి, శకటముడిగ్గి, 'టూసీటర్' అని యించుక బిగ్గరగననెను. అంత ననేకులు. 'మైకార్ సర్' 'మైకార్ సర్' అని మారుపలుకుచున్నను వారినందఱ సఱకుసేయక, లోనికేగి మోటారులఁ బరీక్షచేయుచుండెను. ఎందఱు తమకు బండికావలయునా యని ప్రశ్నించినను, బదులుచెప్పలేదు. ఒత్తుకొని వచ్చువారల మాత్రము తన బెత్తముతోఁ దొలగించుకొనుచు నన్నిబండ్లను చూచెను. ముఖమున సంతోషచిహ్నములు లేవు. బండివారలతో మారు మాటలేకయే తావచ్చినదారిని మోటారుఖానా వెలుపలకు వచ్చి యట నొక్కనిచెవిలో నేమేమియో చెప్పి, మెల మెల్లన నడచుచుఁ జింతాగ్రస్తుని విధంబున నెద్దియో యాలోచించుకొనుచుండెను.

అట్లు కొంత తడవాలోచించి, పెద్ద నిట్టూర్పు నిగిడ్చి, తుద కేమి యోచించెనో గాని యెప్లనేడు దారిని యప్పటి యట్లు మూలవేసికొనుచు తనయానము సాగించుచుండెను.

ఏచోటనైన చిన్న మోటారు తారసించినఁ దదేకదృష్టి నాబండినిజూచి పెదవి విఱచుచుఁ బోవుచుండెను.

ఇట్లు సాయం సమయమువఱకు పాపమాదొరగారు చింతిల్లుచు, 'మట్టమధ్యాహ్నము ఆబండికి పనియేముండును? లేక భవానీపురమునకు మరల పోయియుండునా, కాక బండి యంతయు నింతశీఘ్రకాలములో మార్పు చెందియుండునా? నాభోగట్టాయంతయు తప్పయియుండునా?' అనుకొనుచు, దలచినదేతలఁచుచు, నూహించినదే ఖండించుకొనుచుఁ బనికిచెడిన వానివలె దిమ్మరుచుండెను. ఐదు గంటలయినది— ఆరు. చీకటి కొంచెము కొంచెము ప్రసరించుచున్నది. ఇంతశ్రమయు, నీయారుగంటల యెండయు వృథాయగునేమో యని దొర గారు చింతిల్లుచుండ 'బాఁ—బాఁ' అని యొక మోటారు ధ్వని వినవచ్చెను. అప్పుడీతఁడు త్రోవప్రక్కనే యున్నను మూర్ఖునివలె బాట నడిమికివచ్చెను. ఇంతలో నామోటారు మిక్కిలి చేరువకువచ్చుటచే దానినొక్కసారి పాపమాసారథి యాపవలసివచ్చెను. మనదొరగారు క్షమాపణ వేడుకొనుచు ప్రక్కకు దొలఁగిపోవుచుండఁ నందున్న యాతడు 'ఢామిట్' అని విసుగుకొనుచు మరల యానముసాగించెను.

రెండునిమిషముల యనంతరము మనదొరయు నొక మోటారునగూర్చుండి యాదారినే పోవుచుండెను. రెండు మోటారులకును గొంచె మంతరమున్నను ముందున్నదానిని

వెనుక వారు చూడఁగలుగుదురు. రెండును నతిశీఘ్రగమనం బునఁ బోవుచుండెను.

ఇంతవడిగఁ బోవుచున్న చు సారథి, 'అదేఁవిటి అలాప్రా ణాలమీదికే తెచ్చుకోబోయారు? కొంచెం తప్పిపోయింది గాని క్లియరు డిక్రీకి అభ్యంతరం ఏఁదైనావుందా?' అని యనెను. దొరగారంచులకు 'చాలులే—ఆచీకటిలో మరి దాని నెంబరు తెలియడఁవెలాగు? తెలిస్కోవు అనదే, ఆగుడ్డివెలు గులో నాకవ్వడు తోచినమార్గఁవే అది. నువ్వాయితేమాత్ర మేమిచేస్తావు? డిక్రియే—యీపాటిదానికి? తెలిసిచేసిన దాని లోనే డిక్రీఅయితే మారేఁవుంది? నీకూనాకూ పనేలేదు. చూడు—చూడు ఆ మలుపుతిరిగినట్లుంది. పోనీ పోనీయ్ తరు వాత మనముకాట్లాడుకోవచ్చున్లే' అని నిశ్చింతముగా బదులు చెప్పెను.

సారథి:— ఒస్నీ, మలుపుతిరగ్గానేసరా. ఇదేఁవిటను కున్నారు. ఉడుముపట్టు దొరుకుతే మరోదిలే రకంకాదే. తప్పి పోవడానికి రుద్రుడురావద్దూ? ఏఁవనుకున్నారు? అదిగో కారు, దొరికిందా? చూశారా.'

అని యనుచుండ నాముందలి మోటారువండుల దిరు గుట యారంభించెను. తోడనే దొరగారికన్నులన్నియు (శరీ రమునిండా కన్నులతో చూచుచున్నయట్టుల నుండెనాతడు) భూమిపైనున్న జాడలపైనే ఉండనారంభించెను. నూరుగజముల

దూరమున్నను మోటారునుమాత్రము వీరు చూడఁజాలకుండిరి వారికున్న యాధారమంతయు బాటనున్న జాడయే. అట్టుల వెంబడించి వెంబడించి కొంతకాలమునకు దొరగారు 'మించి పోయినదే' అని జేబులోనున్న యొకచిన్నయంత్రమును చెవికి తగిల్చి యొక్కింత తడవుండి 'ఆఁ—ఆగింది—నిలువు.' అని యనగానే రథమాగిపోయినది. తోడనే దొరగారు మోటారు నుండిదిగి జాడననుసరించి పోవుచుండిరి.

చిత్రము—రథముడిగ్గిన యాతఁడు మనసీటుగానున్న దొరకాడు. సాధారణముగా కిడర్‌పూరులో నోడలలో పని చేయునట్టి పనివాఁడు. మోటారునగూడ దొరలేడు. ఆదొర యిట్లెప్పుడుమారెనో, యేలాగుమారెనో, ఎవరికిని తెలియదు. మోటారుపోయెను. పనివాఁడుమాత్రము జాడ ననుసరించి పోయిపోయి యొకయింటి ముంగదాగియున్న కారుచుచూచి నలుకెలంకుల నవలోకించి యెవ్వరు నట లేకుంటఁ గనుంగొని మోటారు వెనుకభాగంబున నక్కియుండెను. ఇంతలో సారథి వచ్చి మోటారును మరల్చి మెల మెల్లన నడిపించుకొనుచు బోయెను. మనదొరగారు అనగా కిడర్‌పూరు పనివాఁడు ఆ మోటారు వెనుకభాగము నంటియున్నాడను మాటమాత్ర మాసారథికిఁ దెలియదు.

సారథి బండినితోలుకొని పోయిపోయి యొక యిరుకు సందున నొక పాడుగృహంబు చేరువనాగి తలుపుఁ దట్టెను.

లోపలినుండి యొక ముసలిగొంతుక 'ఎవడురా అది' అని కోపముతోనేమో యన్నట్లు వినవచ్చెను. సారథి "నేను, నేను, తలుపుతీయి" అని బదులుచెప్పెను. "నువ్వంటే ?" అని ప్రశ్న

"నేను—రామచందర్ ను"

"నువ్వా ?—అబ్బా—ఎంతని ఈతలుపు తియ్యగలను నాయనా—మీాజీతానికో దండము రేపటినుంచి మరెవర్నైనా పెట్టుకోండిబాబూ. చక్కగున్నాపని మానుకోని యిక్కడి కొచ్చాను."

"ఆగొణుగుకోవడ మెందుకు ? తలుపుతీసి గొణగ రాదూ ?"

"ఇది గొణుక్కోడమూ? బాగన్నారు. నా గాచ్చారము ఆముసిలితొత్తునవాలి, చక్కగా నెలకి 7 రూపాయలు, రెండు పూట్లతిండీ ఇచ్చివోరుకదా మిత్రాబాబుగారు. ఆబాబుకి దండం పెట్టి ఆతర్వాత వెయ్యిదేవుళ్లకిదండం పెట్టాలి. ఊఁ"

ఆతలుపు తెఱచెను. రామచందర్ యింటిలోనికిఁబోయి 5 నిముసములలో తిరిగివచ్చి మోటారు నొక కొట్టుననుంచి మరల లోనికిపోయి తలుపు గడియ పెట్టెను.

కొంతసేపటికీ కిడయ్యారు పనివాఁడు మరల నావీధికే వచ్చి సారథి తలుపుతట్టిన యింటికడకుఁబోయెను. తలుపులు తీసియున్నవి. ముసలివాడుమాత్రము గుమ్మముదగ్గర కొబ్బరి హుక్కాకాయను చేతఁబట్టుకొని నోటినుండి పొగవిడుచు

చుండెను. ఇదికూడ నొక మేలేయనుకొని కిదర్యారుపనివాడు వడివడి చేరబోయి "ఏంతాతా, యిక్కడున్నావు ? ఏదీకొంచెం అగ్గి ? (బీడీముట్టించుకొనుచు) ఏవీ—మిత్రాబాబుగారిదగ్గర మానేశాఁవేటి ?" అని యడిగెను.

ముసలివాడు—నువ్వా ? బారీ రా, కూర్చో. అదిగో ఆతోట్టునుంచి యిక్కడి కొచ్చాను. బంగారంలాంటి నౌఖరీ ఒదులుకున్నాను. నువ్వింకా గుప్తాగారి ఆతాలోనే పనిచేస్తూ న్నావా ?

పనివాఁడు—మరేంచెయ్యాలి ? వాళ్లేమన్నా పడుగో నుంటున్నాను.

ముసలి—అలాగే ఇదిగోనేను పడుతూన్నపాట్లు చూశావా ? నీకేం నువ్వు వయిసినోడివి. ఎలాగైనా బతుకుతావు. నాపనేంగాను. ఈళ్ల దగ్గిర చాలాకాలమున్నట్టు కనబడదు.

పని—ఏఁవిటీ వీళ్లుపెట్టేబాధ నాకేం తెలియకుంటున్నాది ?

ముసలి—తెలియడాని కేఁవుంది ? మిత్రాబాబుగారి యింట్లో ఎలాండీవాడ్నో తెలుసునుగదా ?

పని—ఎలాగేంటీ. ఇంట్లోవాడిలా గుండీవాడివి. అదెంతమర్యాద; అదేంకార్ఖానా !

ముసలి—ఇక్కడదంతాలేదు. నేను వీళ్ళ కెందుకూ అయాను కాను. వాళ్ళమాటలూ, వాళ్ళగునగునలూ, వాళ్ళ

భానలూ అంతా దేముడికే తెలాలి. నాకిలాగుంటే ఎలా గవుతాది ?

పని—తాతా, వీళ్ళేవర్ణ ములు ? ఇక్కడేంపని ?

ముసలి—అదేంవర్ణమో తెలవు. అందుకే నేనే ఒందు కుంటున్నాను. (మీాఅవ్వ లేదుకదా) అ దేంపనో నాకిప్పటికీ తెల్లేదు.

పని—తెలడమేటి అడుగుతే చెప్పరూ ?

ముసలి—ఎవరినడగడము ?

పని—అదేటి,-ఎంతమందున్నారేంటి ?

ముసలి—ఉన్నారు నలుగురైదుగురు. అందులో ఎవడు పెద్దో ఎవడుచిన్నో నాకు తెలియదు. అంతాయిచ్చిం తరమే.

పని—అదేటితాతా, మరీచెప్తాతావు - యిచ్చింతరం మాట ! ఆళ్ళబట్టలు, ఆళ్ళపేర్లూ, ఆళ్ళమాటలూ, చూస్తే తెల్దంటావేటి ?

ముసలి—అబ్బే ఉత్తుత్తే. ఈవేళ రాజులాగున్నావాడు రేపుబండితోల్తాడు. రేపు బండితోలోడు యెల్లుండిబండీలోనే కూకుంతాడు-మరేంపోలుస్తావు ?

పని—ఆళ్ళపేర్లయినా తెలుసునా ?

ముసలి—పేర్లా-ఒకడు రామచంద్ర. ఒకడు గులాబ్ సింగు. ఒకడు పంథా ఒకడు మోతీలాల్. ఏలాగ పోలుస్తావో చెప్పు. అంతాఅదోటోగాని యిద్దోరంవే. ఒకపిలుపుల్లో

మర్యాదలా ? ఒకమాటల్లోమర్యాదలా ? ఒకదారా ? ఒక తెన్నా ? ఏఁవనిపోల్చుకోవడం. ఏటంటే ఏమేటంటారో అనేభయం.

పని—ఆలాక్కాదుతాతా, అందులో గులాబ్ సింగో, మోతీలాలో పెద్ద-పేర్లుపట్టి ? పోనీలే యిదంతామన కెందుకు అవ్వ యెప్పుడొస్తుంది ?

ముసలి—ఆ యెదవనుంచే యీ గోతులోపడ్డాను. రావాలి యీయాళో, రేపో.

పని—పోతాను తాతా, ఇంట్లో యెవ్వరూ లేరేటి మా తీరు బాటుగ కూకున్నావు ?

ముసలి—ఏదీ-ఇప్పుడే ఆచినోడు ఒచ్చాడుకదా. ఓగంటదాకా పైకిరాడు. రానుకుంటాడు. ఏంతీరుబాటులే; పాడుకాలువు—యిలాగే బారాగంటై పోతాది. ఏటంత తొందరపడుతున్నావు ? కూసోకూడదా గడిసేపు ?

పని—చీకటై పోతుందికదా; బారాగంటదాకా నువ్వి లాగే కూకుంటావేటి ?

ముసలి—బారాగంటతో తీరిందీ. అళ్ళెప్పుడొస్తే అప్పుడంతా పనే.

పని—పాపం అంతరాత్రిదాకా ఎక్కడుంటారో తెల్సునా.

ముసలి—నామొకం-ఏవల్లకాట్లో ఉంటారో అళ్ళకే యెరిక ? ఏదో కూపీలుతియ్యడాని కొచ్చినట్టు కనపడ్తాది.

అలాగ మోటార్లేసుకొని తిరగడఁవే ఆళ్ళపని లాగున్నాది - అందు కే వొచ్చారనుకుంటాను.

పని—ఆలాగా, కొత్తగొచ్చారూ; అయితే బే గల్లి పోతారనుకుంటాను.

ముసలి— ఆళ్ళమొకం—ఇంకాఎక్కడా అదేదో దొరికి నట్టు కనిపించదు—

ఇంతలో లోపలినుండి, 'ఏయ్‌బుడా' అని పిలుపువచ్చెను. 'జీ, హాజర్' అని ముసలి బదులఱచుచులోనికిఁ బోయెను.

మన పనివాఁడు గుమ్మముదిగి వెలుపల నాలుగువైపులు బరీక్షించి, 'నేటికిది చాలును చూతమెట్లగునో' యని తిరిగి పోవుచు నేమియూహించుకొనెనోగాని యొకబండిని చేయించు కొని, 'భవానీపురమునకు' అని యాబండివానితో చెప్పెను. 'బాబూ, నేను కద్దాను' అని మఱియొక బండివాని వంటివాఁడ నెను. ఆమాట నరకుసేయకయే మన పనివాఁడు, మొదటి బండివాని బండిలోఁ గూర్చుండి పోవుచుండెను. బండిలోఁ గూర్చుండినదగి మొదలేమొకో కాని యాతఁడు సంశయము లతో నిండిన మానసముతో ఏమేమో వితర్కించుకొన చుండెను.

రాత్రి దాదా పెనిమిది గంటలయినది. పురము నాభాగమున దీపములు విశేషముగా లేకుంటచే చీఁకటిగ నుండెను. బాటలో సంచారము మిక్కిలి తక్కువగానుండెను.

మనపనివాని బండిమాత్రము వడివడిఁబోవుచుండెను. ఇంతలో ధఁ-ధఁ అని రెండుగుళ్ళచప్పుడు వినవచ్చెను. తోడనే 'అబ్బా-చచ్చాను' అని బండివాఁడు డబ్బున నేలపైఁబడెను. గుఱ్ఱముగూడ నొక్కవింతయగు అఱ పరచి నేలఁగూలెను. వెంటనే మనకిడ్దర పూర్ పనివాఁడు మొలలోనున్న తన చేతుపాకీని బట్టుకొని, 'క్యాం — గాడీవాలా, ఏయ్—గాడీవాలా' అని రెండుసార్లు పిలచెనేగాని, తానుమాత్ర మే దిక్కునుండి యేమివచ్చునో యని బెగ్గిలుచుండెను ఎక్కడ నేపాటి చప్పుడైనను లేదు. తనకిప్పుడుసహాయము చేయువారు లేరనితోచెను. మఱిచేయు నుపాయము లేక కష్టముతో నాతలుపు దెఱచి కొంత చప్పుడుచేసెను. తోడనేమరల నొకగుండుచప్పుడు. ధన్ 'అరే జాఁ గయారే హారామ్—' అని డగ్గుత్తికతో ధ్వని. దబ్బున నొక కళేబరము క్రిందఁబడెను. పాపము. ఇది మనపనివాని కళేబరమే. కొంతవరకు నిశ్శబ్దముగానుండెను. ఇంతలో నెవ్వడోయొక్కడు నల్లనిగుడ్డలతో బూచివలె నీ పనివానిదగ్గఱకు వచ్చుచుండెను. రెండుగజముల దూరమున్న దన నొక వెలుఁగు మహాతేజస్సుతోఁ గానవచ్చెను. కళేబరమును జూచి 'మరెప్పుడూ అక్కరమాలిన భోగట్టాలు చెయ్యకేం—చేసినందుకైందా శాస్తి—' అని బోరగిలబడియున్న శరీరమును త్రిప్పునప్పటికి ధన్—ఇప్పుడు నేలఁగూలినవాఁడు యీ బూచి. మనపనివాఁడు లేచెను. బూచివాని జేబులు తడిమి, వాని చేతుపాకిని, బాకును, మహాతేజస్సు కానవచ్చిన దీపమును, సంగ్ర

హించుకొని, 'ఎవడుపంపాడోకాని చాతావాతా కానివాడ్ని ఎంచెంచి పంపాడు. నేనే కిందికిదిగి చప్పుడు చెయ్యకేపోతే చాల్మాప్రమాదించుండును ఏవుంది—వెనకపాటునవచ్చి ఏం చేసే యేంకాడు! వీడిగురిబాగా తెలిసిందికదా; దిగినా మరేం ఫర్వాలేదనే ఆయెత్తు వెత్తాను. ఫలించింది అయితే దీని పర్యవసానం ఎలావుంటుందో—' అని యోచించుకొనుచుఁ దన దారిని బట్టెను.

---

## అయిదవ ప్రకరణము

---

### ముకురబింబము; ప్రతిబింబము

### చచ్చాం—చచ్చాం; ఆ సంతాలీవాఁడే!

భవానీపురమున లక్ష్మీబాయి గృహమున నత్యంత జాగరూకతతో మెలగుచు వీధితలుపులన్నియుఁ జక్కగవైచి గేయంతయు నిద్దురవోక యేమి వచ్చునో యని కుమారుని నొక వేదబాలికఁగానొసర్చి యొకదానిదగ్గరపండుకొననిచ్చెను. ఆమెయుఁ దానుండవలసిన గదిలోఁ దన మంచముపై లేదు. తనకుబదులుగా నొక పెద్దదిండు సడుపుగనుండి దానిపై నొక పట్టుశాలువఁగప్పి తానింకొక గదిలో నేల నొక్క పఱుపున బరుండియుండెను. అటుల నా పఱుపుననే మేనువ్రాల్చి, తన

యూహాల ననేకరీతులఁ బఱపుచు, నీ నిరూపకుని నియమించు టలో లాభముండునా, లేక కార్యమంతయు వ్యర్థమగునా యని కొంతసేపనుకొనుచుండును. ఇట్టి సమయములో నరీందం బాబూ జానూన్ ఈయూరిలో లేకపోవుటగూడ నాదురదృష్టమే యనివగచుచుండును. ఇంక నీ నిరూపకునకుఁ జాకచక్యము ను తెలివితేటలను అత్యంతముగా నుండుటచేతఁ దప్పక కార్యసిద్ధియగునని నమ్ముకొనుచుండును. ఎంతనమ్మకమున్నను ఆదుర్మార్గుడు భానోజీ జిత్తులమారికాదా యని భయపడును. ఏది యెటుల నైనను దైవమొకఁడు కలఁడుగదా యనిధైర్యము ను దెచ్చుకొనుచుండును — ఎరిగి యొక్కనినైననోనాడని మాయందనుగ్రహించి యాచిఱుతనిఁ గాపాడుమని ప్రార్థించును. మరల తటాలునలేచి తలుపులన్నియు నొకసారి చూచి, కుమారుఁడున్న గదికేగి చూచివచ్చును. పాప మెచ్చట చీమ చిటుకన్న నాతరుణీమణి వెఱఁగందుచు దిక్కులు గలయఁ జూచుచుండును.

ఆనాఁడు సాయంకాలమై చీకటు లలముకొనుచుండెను. నిరూపక చక్రవర్తి యని తా ననుకొనుచున్న గోపాల్ చంద్ రాకుంటకుఁ గారణం బరయలేక చింతించుచు నెప్పటియట్ల తన పనిని నిర్వర్తించి తన పఱుపునఁ బన్నుండెను. కాని నిదుర రాదు. ఎన్నియోగతులఁ బ్రయత్నించెను. ఎట్టకేలకు ప్రమాఁగన్ను వడుచుండు సమయంబున నొక్కసారి పెద్ద వెలుతురు గానవచ్చెను. శ్రీహరీ యేమి యీ వెలుఁగని స్తంభీభూతమై

యున్న యాపెలఁది యెదుటనొక్కఁడు కానవచ్చెను. ధైర్యం బును జిక్కఁజేసుకొని పలుక నుంకించుచు. నోట మాటరాదు. కలయేమో యని తోఁచెను. తుదకు 'ఎవరది' అని యన సాహసించెను.

'నీ వెవరు ?' అని స్పష్టముగా బదులువచ్చెను.

సుందరాంగి ముఖము వెల్వెలఁ బారెను. 'నేనీయింట పనికత్తెను'

'నే నీయింట పనివాడను'

'నీ పేరేమి ?'

'నీ పేరేమి ?'

'నాపేరు లచ్చి'

'నాపేరు గోపి'

'అయ్యయ్యో ! క్షమించండి. మీరని తెలిసికొన లేక పోతిని. ఎంత మారిపోయినారు. దొంగ రనుకున్నాను' అని యా యువతి బిరబిర తన నిజమైన గదిలోనికిఁ బోయి కుర్చీ చూపెను. కూర్చున్న వెనుక 'ఔను గాని నే నింత జాగ్రత్త తో తలుపులన్నీ వేసితినిగదా, మీరు లోపలి కెలాగు రాగలి గినారు?' అని యింతవఱకును మఱచినమాట నడిగెను.

'దానికేమి ? నీ కీ యింట్లో పని యున్నంతకాలము న్నా ఈ యిల్లు నాదిగానే భావించడం నా అభ్యాసం. నా యింటికి రావడానికి నా కేద్యో దారి యుంచుకోకుండా వరుల

చేతుల్లోనే తాళ్ళా లుంచేసానా ? నావారులు నా కుండనే ఉన్నవి. వరే దీనికేం లే. విశేషాలా ఏఁవైనా—?'

'ఏఁవున్నవి ? మీ కేఁవైనా జాడ దొరికిందా?'

'ఏదో కొంచెం. కాని నీ చరిత్ర అంతా మళ్ళీ చెప్ప గలవా ? చిన్న పని ఉంది.'

'దుఃఖములు వినుట మీకు సంతోషము కాబోలు?'

'వేరే అడుగుతావేమి ? మేము వినేదంతా దుఃఖాలే.' ఆ అభ్యాసంచేత అవికూడా ఇంపుగానే ఉంటాయి.'

'అయితే చెపుతాను వినండి' అని యామె తన చరిత్ర నంతయు మరియొకసారి చెప్పెను. నడుమ నడుమ గోపాల్ చంద్ వారివారి యాకారంబుల నడుగుచు నెట్టు లెట్టులో కథ ముగియఁగనే 'అట్లయిన నే పోయి వచ్చెద' నని లేచెను.

'ఇంతరాత్రి యైనదే. ఇప్పు డెక్కడకుఁ బోఁగలరు. ఈ గదిలో మీరు పండుకొనుడు. నేను దిగువకుఁబోయెదను' అని యాయతివ మెట్లు దిగుచుండెను నాటికి తలుపు తీయువరికి 'కింకరో' అనియొక పవ్వడువినవచ్చెను. సుందరాంగి యార్త ధ్వనిచేయుచు గోపాల్‌చందు భుజమును గట్టిగఁ బట్టుకొనెను.

'భయము లేదమ్మా; మనవాడే, అని యా క్రొత్త వానిని దూరముగా దీసికొనిపోయి నిలిచినంత 'వాడ్ని ఎక్కడికి తీసుకపోయారో చూశాను—గుడ్డలు మార్చేసి పట్లో పడిపోయినట్టు నటిస్తారు. ఏమి సెలవు అల్లర చేదామా?' అని అనెను.

'ఆహా! ఏదు ఎంత పనికివచ్చుచున్నది. సరే, అల్లర యేమీవద్దు. నేను మాట్లాడిన ముసలివాని సంగతులన్నీ తెలుసుకొంటివా?'

'చిత్తము, చాలావరకు తెలిసినది. ఇకను ధైర్యంగా వెళ్ళి మాట్లాడడానికి వీలు టుంది.'

'ఈలాగున్నా, నీతో మరోసంగతి చెప్పవలసింటుంది' అని గోపాలచంద్రుడు వానిని లోపల నౌకరగదిలోనికి తీసుకొనిపోవుచు 'నీవింక నెందుకు మేలుకొని యున్నావు నిద్దురపొమ్ము ఇక్కడనే రాత్రియంతయు నుందును. నీవుపోయి సుఖముగ భయములేక యెప్పటియట్ల నిద్రపొమ్ము' అనెను.

'ఈగదిలోనేయుందురా. మేడమీదకురారా?'

'ఇక్కడనే మాటాడుకుంటామమ్మా'

'పరుపులు పంపనా?'

'ఈప్రశ్న నీవడుగుతావేమో అనే మేము మాట్లాడుకుంటామన్నాను కానూ? మాట్లాడుకోవడానికి పరుపులెందుకు కావలి స్తేమేము తెచ్చుకోలేమా?' అని నవ్వుచూ గోపాలచందనెను. సుందరి, సుందరమందహాసపూర్వకముగఁ దన మెప్పు వెల్లడించి మేడపైఁ బరుండఁబోయెను.

ఆ యిద్దరును కొంత మాట్లాడి కొంత యెవరికి వారే యాలోచించి రేయంతయుగడపిరి. తెల్లవారునప్పటికి కింకరుఁడేమి యాయెనోగాని యెక్కడను కానరాదు.

గోపాలచందు లక్ష్మీబాయి గదికేగి యొక్క బాకును చూపి 'ఇటువంటి దెప్పుడైన చూచితివా ?' అని ప్రశ్నించెను. తోడనే యాయబల సొమ్మసిలి మంచముపైఁ బడిపోయెను. మెల్లగ నేదదేరి 'అమ్మనాయనో, వాళ్ళవే ఆలాటిబాకులన్నీ. వీటితోనే వాళ్ళాఘోరాలన్నీ చేశారు. నాకుబాగా తెలుసును. మీా కేలాగు దొరికింది ?'

'గాభరాపడకు—గాభరాపడకు. మనకు బాకు దొరికిందంటే ఒకడికి చావు కలిగిందన్నమాటేకదూ. ఏమిటా చెమ్మట. ఆగాలికిటికీలో కూర్చోవమ్మా, నిన్న ఒక బండివాని ప్రాణముతీసుకొని, మళ్ళీ తన ప్రాణమిచ్చి అప్పుతీర్చుకున్నాడు ఈబాకు దానికివడ్డీ. కాని మరొక్కమాట. ఈబాకుగలవాడు ఎవడో నీకు తెలియదు. నీవుచెప్పిన మనుష్యులవంటివాడు కాదుసుమా' అన్నంత 'సరిపోయింది. నేను చెప్పినవాళ్ళు నాకు కనపడ్డవాళ్ళున్నూ, నేనెఱిగినవాళ్ళున్నూ, ఆలాటివాళ్లు లోకమంతా నిండిపోయే ఉన్నారని మొట్టమొదటనే చెప్పలేదా ? పోనీ. ఒకడుతగ్గినా తగ్గడమే; నాకు చెప్పడానికి వీలయినంతమట్టుకు చెప్పాను. అలాఅని మరి లేరనా మీారనుకోవడం. పోనీ—పోనీ—ఒకడు' అని వెఱ్ఱిరీతి ననుకొనుచుఁ, దటాలున నిశ్చబముగ నూరకొనఁ గన్నులనీరుగ్రమ్మెను.

అదిచూచి 'ఏమింది ! ఇందాకటి సంతోషమంతా పోయిందీ ? ఏమి టలా ఏడుస్తున్నావు ?' అని గోపాలచందనెను.

'ఏమి సంతోషము? మరి సంతోషమే; ఊరుకోక మిమ్మల్నింటులో పెట్టాను. నేనొక తెలివితక్కువ మనిషిని.'

'అదేమి టలా అంటున్నావు?'

'మరిఅనడం వేఁవిటి — ఇన్నాళ్ళూ అబద్ధం ఇప్పుడు నిజం. ఏలాగయినా మిమ్మల్ని చంపేస్తారు. ఆహా—వాళ్ళు ఊరుకొనేవాళ్ళుకారు. అమ్మో నాయనా—వాళ్ళా—చంపేస్తారు. మళ్ళీ రెండోవాళ్ళకి వినికిరి కాకుండా చంపేస్తారు. నేరకపోయి మిమ్మల్నిందులో పెట్టాను. రక్తానికి రక్తం చూస్తారు.'

'పోనీలే; అదేదోచూదాం. నేనుకూడా ఆబరి లోనే చదువుకున్నాను. రెండుపాఠాలు ఎక్కువగానే చదివాను. వాళ్ళు రక్తానికి రక్తంచూస్తే, నేనురక్తానికి రక్తం ప్రవాహాలుగాచూస్తాను. ఏమిటనుకుంటున్నావో?'

'అబ్బా, మీధైర్యంచూస్తే నాకుకూడా కొంతధైర్యం కలుగుతున్నది. కాని వాళ్ళు వేటకుక్కలే సుమండి. జాగ్రత. మీనీడనుగూడా మీరు నమ్మవద్దు. జాగ్రత' అని యానందరాంగి కిటికీనుండి ఏమిచూచెనోగాని 'చచ్చాం వచ్చాం' అని లోయెలుంగుతో నని దబ్బున క్రిందబడిపోయెను నివ్వెరపాటుతో గోపాలచందు మెల్లగ నామెను సేదదీర్చి కారణమేమనియడుగ 'మరేముంది—మరేముంది—తిన్నగ నేనున్న చోటు కనిపెట్టివేసినారు. ఇక్కడే తచ్చాడుతున్నారు. వీళ్ళను

తప్పించుకోవడము ఆబ్రహ్మకైనా వశంకాదుబాబూ !' అని గడగడ వణకుచు బదులు చెప్పెను.

'ఏమిటాసంగతి? చక్కగా చెప్పకపోతే నాకేమి తెలుస్తుంది? చక్కగా చెప్పు.'

'చెప్పడాని కేముంది? ఆ సంతాలీవాడే, మరొకడు క్రింద ఇటు అటు చూస్తున్నాడు. నే నిక్కడ ఉన్నానని పోల్చేశాడు.'

'ఆఁ — నేనే దీనికి కారణము. చిన్న పొరపాటు చేసినాను. పోనీలే వానివల్ల మరొక క్రొత్తసంగతి పోల్చుకున్నాను. వాళ్ళెలాగు వేటాడుదురో తెలిసింది. ఇకను మనలను పోల్చుకోలేరు పోనీగాని, ఈబట్టలు కట్టుకున్నావుకదా, నిన్ను వాడు పోల్చగలడా?'

'అమ్మోనాయనో, వాళ్ళుపోల్చుకోలేరా? బట్టలంతే మారియున్నాయిగాని మొగమో?'

'సరే అయితే నిలబడిపో. అటుచూచినట్లు కనబడకుండా, వాడు నిన్ను బాగాచూచేటట్లు ఉండు — బాగా చూడనీ. నిలబడు.'

'మంచి ఉపాయమే — చూడగానే చంపేయడూ! బ్రతక నిస్తాడుకదూ —?'

'నీకు వాళ్ళసంగతి తెలియదు. నిన్ను చంపుతే వాళ్ళకు కావలసిన సంగతులు ఎలాతెలుస్తవి? భయంలేదు. కానీ నిలబడు.'

గోపాలచంద్రుడు దూరముగాఁబోయి ఎదుటి గోడనున్న ఒక అద్దమును చూచుచుండెను. ఆ అద్దములో స్పష్టముగా వీధియంతయు నిప్పుడు గోపాలచంద్రునకుఁ గనఁబడెను.

సుందరాంగి నిలిచెను. తోడనే వాఁడు నడకను మందముచేసెను. చూడనట్లే చూచుచుండెను గోపాలచంద్రుడు చక్కని వానిముఖమును, వానిముక్కు, కన్ను, మూతి, గడ్డము నద్దములో చూచుచుండెను. రెండు నిముసము లీరీతి సుందరాంగి ప్రాణములుపిటికిటబట్టుకొని నిలిచిన నంతి వాఁడునంతోషముతో నున్నట్లు తలపంకించి నాలుగుదిక్కులను చూచుకొనుచు నేమియు నేరనియట్లులఁ దనదారిని పోయెను.

'వెళ్ళిపోయాడా—ఇంకా లేదా?' ఆమె అడిగెను.

'ఇప్పటికి వెళ్ళిపోయినట్టే—కాని నేడొక సుదినము. మహాసుదినము. పరే-నీవుపోయి నీ మారువేషము వేసుకో. కుమారసింగునిగూడా ఒక పల్లెపిల్లనుచేసేయ్. అల్లా మునలి దానీ దేదీ ?'

'సీతీ, సీతీ.'

'బాబూ, వొచ్చా.' అని యనుకొనుచు లోపలికి వచ్చెను.

సీతిని దూరము తీసుకొనిపోయి, ఏమేమిరో చెప్పి గోపాలచంద్ర్ తనలో, 'తప్పుచేసి దిద్దుకున్నాను—' అని యనుకొనుచు మాయమైపోయెను.

---

# ఆ ర వ ప్ర క ర ణ ము

---

## ముసలిదాని ముచ్చటలు

## మఱికిటోపీ; ఇదే యొక నిక్షేపము

గోపాల్‌చంద్ జాసూన్‌గారు మాయమయిన యఱగంటకు లక్ష్మీబాయి గృహమంతయుఁ బచ్చతోరణమయి, మంగళవాద్యములు సెలంగుచు, వచ్చువారును పోవువారును లెక్కకు మిక్కుటమగునట్లు సర్వతోముఖవైభవంబయి యున్నది. బ్రాహ్మణులు గుంపులు గుంపులుగాఁ గనిపెట్టుకొని యున్నారు. కుంటి, గ్రుడ్డివారు లోనుగాఁగల యంగవిహీనులు బారులుకట్టి బాటయావలిదెసఁ గూర్చుండియున్నారు తూర్యారావముల హోరున, నెంతయో బిగ్గరగా మాట్లాడియుఁ, జేసంజ్ఞల సహాయము లేక సంభాషణము చేయఁజాలకున్నారు. అందినవారలే మరల సంభావనల నందుచున్నారు. అందని వారలు 'అయ్యో, మాకు అందలేదండోయి' అని ముందుకుఁ ద్రోవచేసికొనుచు నందినవారల శాపంబులకు లోనగుచున్నారు. బిచ్చగాండ్రలో నొకరొకర రీసుదీయక, యాచోటునకే యందఱును రావలయునా యని తిట్టుకొనుచున్నారు. ఎచ్చటజూచినను స్పర్థయే కానవచ్చుచుండెను. ముత్తయిదువులతో సమముగ రాలేదుకదా యను బాలికా బాలకులును, బాలికా

జూచుచుండెను. పెట్టెలకు బీగములున్నవో లేవో చూచుచుండెను. వానిలో నొక్కటి మిగుల బరువయి తన శక్తికి మించియుండుటచూచి తనకడనున్న తాళములన్నిటితోడను త్రిప్పిచూచెను. లాభము లేకపోవుటచే మంచముమీద తాళములుండునేమోయని మంచము నుచేరి మెలమెల్లన నాశాలువను దొలఁగింప పాప మాసిండుమునుఁగుననున్న క్రూరుఁడు నిశ్చేష్టుఁడు కాఁగనలు నొక దిండుమాత్రము చూచెను "ఓహో! ఇది మరీ గడుసుదానిలాగుందే" అని యనుకొని వడివడిగ నచ్చటి వస్తువులనెల్ల చక్కఁబెట్టఁబోయెను—

ఇంతలో ముసలిది మెల్లమెల్లన నచ్చటికి వచ్చి "ఏమి నాయనా, యేఁవిటి వెదుక్కుంటున్నావు?" అని మెల్లగా ననెను. తోడనే వాఁడు తన మొలలో చేయిపెట్టి తీయ చూచునంతి యీముసలిది తనచే తుపాకిని గురిపెట్టి "బస్! బస్— అంతే—చెయ్యి కదిపావా చచ్చావు. జాగ్రత్త." అని గంభీరముగాఁ బలికెను. అట్లు పలుకుచునే యెడమచేతితో దానే వానిచేతినున్న చేతుపాకి నంకించుకొని 'ఇంకేఁవైనా ఆయుధాలున్నాయా? నిజం చెప్పు—ప్రాణాల మీదానుంటే. దగుల్బాజీతనం చేశావా ఫైనలా, చెప్పు' అని యడిగెను. పాపమా *సంతాలుఁ డెప్పుడునిట్టి యెదిరిపాటు సంభవించు

---

* సంతాలులు— బంగాళాదేశమునసుండు ఒక అడవితెగవారు (Santals)

నని యనుకొనలేదు. ఊరక పిచ్చిపట్టినట్లు చూచుచుండెను. సమయమునకుఁ దగినయాలోచన స్పృహకురాలేదు. లేదా ధైర్యమైనను కలుగలేదు. పాపము చేతిలోని తాళములగుత్తి నేలపైఁబడెను. తోడనే వానికిఁ దెలివివచ్చి నీముసలి దానిని యెఱ్ఱనిచూపుల చూడసాగెను.

'చూస్తావేం?' అనేసరికి 'ఉంటే ఉంటాయి' అని సంతాలుఁడుబింకమున ననుచు, మఱియేదో తీయఁజూచు చుండ వెనుకనుండి యొక్కదాసీదివచ్చి, వాని రెండుచేతులను విఱిచికట్టి భద్రపరచెను.

'ఇహనైనా నీగర్వంఅణిగిపోయిందా? చెప్పు—లేకపోతే ఈరివాల్వరుకే నువ్వుబలి—ఊఁ'

'మరేఁవీ లేవన్నా'—ఇంకా బింకంపోలేదు.

'లేవుకదూ; సచ్ బోలో—తరువాత ఒక్కటైనా కన పడ్డాదంటే ఈచోరీకి కాదుగాని, నీఅబద్ధాలకి నీప్రాణాలు పోతాయి'

'నేను చెప్పను'—ఇంకను అబింకమే!

'వాడు చెప్పడట. మరి నువ్వే చూడు.'

వెంటనే రెండవదాసీది వాని శరీర మంతయు తడిమి నాలుఁగురకముల ఘోరాయుధములను, ఒక పొట్లముకూడ పైకిఁదీసెను. 'ఆఁ—ఆఁ—ఆపొట్లంవిప్పేవు సుమా. దానిసంగతి నేనెరుగుదును. ఆతలమీద టోపీలాంటిది కూడా తియ్యి'

'అబ్బే-ఏమీలేక కళ్లుటోపీ' అని పారవైచెను కాని ముసలిది మాత్రము. 'పళ్లైతే పారెయ్యాలా; పిల్లడికైనా పనికొస్తుంది. నువ్వది దాచు. అరే కూలీవాలా, నీకు ప్రాణాల మీద ఆశుందా?'

'ఉంటే మాత్రం వొదిలేస్తారా?'

'దక్కించుకోవాలంటే, దక్కించుకోగలవు.'

'ఎలాగ?'

'నే నడిగేవాటికి సమాధానాలు చెప్పావంటే నీఒంటి మీద చెయ్యికూడా వెయ్యం. చక్కగా నీయింటికి నువ్వు పోవచ్చును.'

'జబాబు చెప్పడానికి వీలుంటే సరే— అడగండి— చూదాం—' —అబ్బా! ఏమిగ్రా!!

'అలాగని కోచాలు కొట్టగలవుసుమా. జాగర్త దగా చేశావో నీప్రాణం పోయిందన్న మాటే, నీప్రాణాలు ఎప్పుడు కావలిస్తే అప్పుడే తీసుకోగలం. అది తెలుసుకొని మరీచెప్పు.'

'మీరే దగాచేస్తేనో?' ఏమిమాటలతీరు !

'ఓ అక్కల్ కా బాత్ నహీ హాయ్(తెలివితక్కువమాట) ఏం చెయ్యగలవు? నమ్మాల్సినప్పుడు నమ్మాలి. అంతే—'

'అచ్ఛా పూఛో (అడగండి).'

'నువ్వొక్కడవే వచ్చావా, మరెవ్వరైనా నీకుతోడు న్నారా?'

'ఇద్దరం వొచ్చాం'

ముసలిది కిటికీదగ్గరనిలిచి చిన్న యీలవేసెను. దానికి బదులా యనునట్లు రోడ్డుమీదనుండి జిగాల్ మని యొక్క వెలుఁగు కానవచ్చెను. అందువలన పెద్ద చిన్న దాసీలకు రోడ్డు మీద నొకఁడున్నా డనుమాట తెలిసెను.

'అచ్ఛా, వాడుకూడా యిక్కడికి వస్తాడా—రాజా?'

'ఈపాటికి రావలసిందే. ఏమోయింకారాలేదు. క్రింద నెవరైనా మేలుకో నున్నారు గాబోలు.'

'నిన్నెవరు పంపారు?

'అదంతా మీ కెందుకు?'

'ఇదంతా నీకెందుకు—? అడిగినదానికి జబాబు చెప్పకుండా?' అని చేతుపాకి గురిపెట్టెను.

'నామానాన్ని నేనే వచ్చాను.'

'అచ్ఛా! సరే. కానీ-ఇదెవ రిల్లని వచ్చావు.'

'పద్మాబాయి యిల్లని.'

తోడనే యీముసలి కేమి తోచెనో గాని మోమున చిర్నగవు గలిగెను. పాఠకా, ఆచిర్నగవేల? యోచింపుము.

'అయితే ప్రాణాలు తియ్యడానికి వచ్చావా? వస్తువులు తియ్యడానికా?'

'వీలెలాగైతే అలాగ చెయ్యడానికే.'

'అయితే మొట్టమొదట చంపడానికి ప్రయత్నం మెందుకు చేశావుకావు?'

'చంపుతే కాగితా లెలాగ దొరుకుతాయి? ఆ తర్వాత దొరక్కపోతేనో?'

'మీ దేవూరు?'

'పల్లె కాదు-ఇలాటివన్నీ అడిగితే ఎలాగ?'

అబ్బా! ఎంతకోపము!!

'అచ్ఛా గుసా మత్కరో; గుసామత్కరో (కోప పడ వద్దు)—నీకు జీతం ఎంత?'

'నాకు జీతం వేంటి?'

'ఆ-ఆ పొరపాటు-నీ కేపాటి భూములిచ్చారు?'

'నేను చెప్పకూడదు. మీ రడక్కూడదు—ఇలాగే తెల్లవారిం చెయ్యాడంవే?'

'సరి-ఆఖర్-మీ బడాయజమాని ఇక్కడున్నాడా?'

'అదేంవో?'—ఎంతటెక్కు! దెబ్బలు తినిపోవడానికి.

'ఛఫ్! మాదర్ ఛోద్, జరూర్ జబాబ్ దేనా హై! బోలో సచ్ బాత్ బోలో, చంపేస్తాను తర్వాత నీతాతెవడు దిక్కో చూస్తాను—ఊం'

'పై వాళ్ళసంగతి నా కెలాగ తెలుస్తుంది?'

'బోలో బే హారామ్' అని రెండవదాని తన చేతిలో నున్న బాకు మొనతో గుండెమీద నానినంత నావంతాలుంచు, 'ఆం—ఆం—గంటు పెట్టగలవు సుమా!' అనెను.

'మ రీమొద్దుబా టెందుకురా, దద్దమ్మా? తిన్నగా చెప్పలేవేం?'

'వస్తూపోతూ వుంటాడు-మరచకండి.'

'సరే-ఏ-మీా యజమానులతో ఏమనిచెప్తావు?'

'ఏదో చెప్తాను.'

'అలాకాదు—ఆయింటిలో ఇద్దరు దాసీలు—అందులో ఒకర్తె ముసల్దికూడా అనిచెప్పేం—నన్నిలా గాడించారని చెప్పు—మరచిపోకేం—మరచిపోతావా?'

పాపము వాడు నవ్వెను.

'నవ్వుతాలు కాదు. నిజంగా అలా చెప్పాలి—చెప్పుతావా? తప్పుతావా?'

'చెప్పమంటే చెప్పుతాను. కాని—'

'కానీబద్దు— ఏగానీబద్దు— చెప్పమూ. విడిచిపెట్టిన తరువాత యేమైనా చేస్తావా?'

'వాడిబుద్ధి-పోనిస్తూ—వాడు చెయ్యడంవేవిటి? నువ్వు అనుమానించడం అన్నిటికన్నా బాగుంది, చాల్లే ఇలారా అని రెండవదాసిని క్రిందికి తీసుకొనిపోయి, ఆ సంతాలీవాని నొకకొట్టులోపడవైచి బీగమువేసెను. తరువాత రోడ్డుపైన పట్టుకొనబడిన రెండవవానితో మరికొంతసేపు ముచ్చటలాడి వానినిగూడ మఱియొకకొట్టున బడవైచి, యీదాసీలిరువురును నిద్రకొఱకు కొక గదిలోఁ జేరిరి.

ముసలిది, 'ఆటోపీ సంగతేం తెలిసిందా?' అనెను.

'ఆఁ-తెలిసింది. 15 సంవత్సరాలీముక్కను చాకలిదానింటికి వెళ్లలేదు.'

'చాల్లే తెలివి ! అదే ప్రాణం.'

'ఔనౌను ఉత్తమాంగానికి కాప్పుకదూ ?'

'నల్లేనీపాండిత్యం ! అంతకంతకి మించిపోతూంది— తుపాకులు, బాకులు వాడిదగ్గరనుండి మనం తీసుకొన్నప్పు డేమీ చెయ్యలేముకదా. టోపీ తీసినప్పుడంత గింజుకోవడం మెందుకొచ్చిందో తెలుసునా?'

'అయితే మీరేంపంటారుకదా ?'

'సరే; అలా అడిగియ్యడమే ? ఈపొట్లంలో గుండ విషంగుండ కదా !'

'అవును.'

'ఐతే ఆవిషంవాసన వీడికి తగల్దూ?'

'ఔను తగలాలి'

'మరి తగలదేమి ? కాబట్టి వీడిదగ్గర ఉన్నవాటిలో ఏదో విరుగుడు ఉండాలి అన్నమాటేకదూ.'

'ఔను ఉండకపోతే ఎలాగ ? కాని అది మరేదో?'

'అలాగేతోస్తుంది. తరువాత నువ్వు బాకు గుండెమీద పెట్టినప్పుడు ఏమన్నాడో జ్ఞాపకముందా?'

'ఔను-గంటు పెట్టగలవునుమా అని.'

'దానినిబట్టి ఏంవిటి పోల్చుకుంటావు?'

'బాకుకి విషం వుందని—'

'ఆఁ ఇప్పుడు ఆవిరుగుడేది? ఏమైపోయింది?'

'అదేఁవిటి ? ఆవిషమే యిదని మీకేలాగ తెలుసును ? అ దొక రకము-ఇ దొక రకము-కాకూడదా ఏఁవిటి?'

'అలా తోవకి రా. కాని-అట్టుకాదు ఎందుకంటే నా శ్యంలో మొత్తం చూడాలిగాని దాని కొక విరుగుడు, దీని కొక విరుగుడు, మరొకదానికి మరొకటి ఎక్కడుంచుకోవడం? ఎక్కడ సంపాదించడం? ఇన్నిరకాల ఘోరవిషాలు? కాదు-అంతా ఒక్కవిషమేఅవాలి. కాబట్టి ఆవిరుగుడు మనము తీసి కామన్న మాటేనా ?'

'మీ రన్నట్టయితే ఆలాగే కావాలి.'

'మనముతీసినవన్నీ ఆయుధాలు. అందులో విషముం డాలిగాని విరుగు డుండదుగదా ?'

'అవును వాట్లో విరుగు డేలాగుంటుంది ?'

'కాబట్టి అవి కానిదిన్నీ, మనముతీసినదిన్నీ, వాడు గింజుకున్నదిన్నీ, ఏవీ? ఈటోపీ ఒక్కటే. ఏం—ఏఁవంటావు?'

'ఏఁవి టంటాను — మీనిరూపణ అద్భుత మంటాను. మరేఁవి టంటాను.'

'సరేగాని; అంతేకాదు — చూడు. ఈ — టోపీ లోపల అంతా ఏదోపెట్టి భద్రంగాకుట్టినట్టుకూడా కనిపిస్తూంది, ఏదీ చూదాము' అని దానికి చిన్న బెజ్జముచేసి చూడ, నందుండి సన్నని పొడివంటిది కొంచెము క్రిందికి రాలెను.

'చూశావా ! టోపీలో పొడిపెట్టి ఎప్పుడో కుట్టారు!'

'మీరన్నట్టు ఇదే విరుగుడు. ఉండండి చూస్తాను' అని కొండవదాసీ ఆటోపీతలపై పెట్టుకొని మంచము మీఁద జల్లియున్న పొడిని వాసనచూచెను. ఏమియు లేదు. టోపీతీసి వాసన చూచెను. ఒక యరనిముషములో సొమ్మసిలి క్రిందఁ

బడెను. వెంటనే ముసలిది టోపీతలపై బెట్టి నీళ్ళతో ముఖము కడిగెను. చిన్నదాసి లెప్పరిల్లెను.

'ఇదొక ఆస్తి మనకు. ఇదేఒకనిక్షేపము. ఏమంటావు?'

'కాదూ—సరేకాని—ఆమాదరోఛ్ఛదుల్ని వాడితేస్తా రా ఏఁవిటి?'

'ఆహా! అదే మంచిది. తెల్లవారినతరువాత—దానిలో మంచి చాలా ఉంది. నీకేం తెలుసును? కాని ఒక్క మాట— రేపటినుంచి మరీజాగ్రత్తగా ఉండాలిసుమా, వీళ్ళదుండగా లెక్కువై పోతాయి. హుషార్' అనుచు 'జేయ్‌శంకరా! ఇక పడుకో' అని యనెను.

'మూడుగంటలై పోయింది — మరేం నిద్ర. మన కేమయిందో అని పాపం పద్మాభాయి చాలా గాభరాపడుతూ ఉంటుంది గాబోలు?' అని చిన్నదాసియనెను.

'ఆ చింతేమీ లేదు కులాసాగా దూరంగా ఉన్నాది ఇవ్వాళ డీయింట్లో లేదులే.'

'అదెవ్వా డేఁవిటి?'

'మరాఠఉత్సవం అంతా ఎందు కనుకున్నావు? దాని పర్యవసానమే ఇది.'

నిజంగా?—అబ్బా! ఏమియెత్తు — ఏమి ఊహ! ఎవడైనా ఏదైనా పనిచేశాడంటే ఇలావుండాలి.'

# ఏడవ ప్రకరణము

---

## చెప్పవద్దు; తప్పవద్దు

తెల్లవాఱుచుండెను. ఖైదీల నుంచినకొట్లమధ్యతలుపు తెఱువఁబడియుండెను. ఇద్దరునొకరినొకరు చూచుకొని చిన్న బోయిరి. కాని ఒకఁడు మాటలాడఁడు. కొంతసేపటికి మఱి యొకతలుపు తెఱచుకొనెను. వెలుపఁకుదారి. బ్రతుకు జీవుఁ డాయని యిద్దరును పైకిపోవుచున్నారు. పోయిన నేమివచ్చునో తెలియదు. చేతులకింకను కట్లున్నవి. పదినిముసములట్టుల నవ్వోళులూరుచుండిరి. పోఁగలరు. పోఁజాలరు— పోయెదరు. పోరు. ఇంతలో వారిపాలిఁట దైవమున్నాఁడన 'ఔర్ డేర్ కైకు! చలోజావ్' అను నొకసవ్వడి విని ఒకరిత్రాళ్ళు నింకొకరు విప్పుకొని మెల మెల్లఁగ జాఱిపోయిరి. పాపము, చావుతప్పించు కొని వచ్చి ఖైదునపడియున్న యాయిరుగురును వెనుక వెనుక వలుసారులుచూచుకొనుచునే పోవుచుండిరి.

ఇచ్చటనొక సేవకుఁడు వారుపోయినది కని పెట్టి తలు పులుమూసుకొని లోపలివారితో చెప్పి వెలుపలకువచ్చెను. సవ్వడియేమియు లేకుండెను. సేవకుఁడు పలుదిక్కులఁజూచి మార్గముఁబట్టి తనదారిని బోవుచుండెను. అట్టుల రాదా పొక పది నిముసములు నడచిన యనంతరము యేడేండ్ల బాలకుఁ డొకఁడు

వడివడిగఁ బరుగిడుచువచ్చి, యీసేవకుని దగ్గర 'ఓయ్! ఓయ్! మనిషీ- నీ పే రేవిటోయి?' అని యడిగెను.

'అదే నాపేరు' అని దిక్కులు చూచుచుండెను.

'ఏది?'

'ఇప్పుడు నువ్వుపిలచింది. నీ కేంకావాలో అదిచెప్పు'

'ఇదిగో నీకోసంఒక ప్రత్తరం' అని యొకచీటీని వాని చేతి కందించి తూరీగవలె నాబాలుఁ డెగిరిపోయెను.

సేవకుఁ డాచీటిని చూచుకొని యిది యేమియో విపరీత ముగానున్నదే యని యాచీటిని విప్పిచూచెను.

నీమేలుకొఱకు

సాయంకాలము 6½ గంటలకు

చంద్పల్ ఘాటు

ఒక నల్లనిమనుష్య కనిపెట్టుకొని యుండును

చెప్పవద్దు తప్పవద్దు

ఆ యుత్తరము జూడఁగనే యీసేవకు డాలోచనలో మునిగిపోయి 'ఏబీ అచ్చాహోయ్' అని యనుకొనుచు నడచు కొని పోయిపోయి కిడర్పూరు దిక్కుపట్టెను.

ఇక్కడ చీటీని సేవకునికిచ్చి పరుగిడిపోయిన బాలుఁడు మఱికొంతసేపటి కొక హాంటేలు దగ్గరకుఁబోయెను లోపల నొక కుర్చీమీఁదఁ గూర్చుండిన బుగ్గమీసముల వాఁడొకఁడాబా

లుని తనచేరువకు రమ్మ్మని సంజ్ఞ చేసి మఱియొక యర్ధణావురీల కాజ్ఞయిచ్చెను. ఇద్దరును తినుచు నీతీరున సంభాషించిరి.

వారి ఉర్దూమాటల సంభాషణ మిది.

‘ఇచ్చేశావా?’

‘ఆఁ—నాతో గమ్మత్తుచెయ్య బొయ్యాడుగదా?’

అనునరికి బుగ్గమీసములవాఁడా బాలుని తొడగోకెను తోడనే ఆబాలుఁడు ‘చెయ్యబోయింది’ అని దిద్దుకొనెను.

‘తొత్తుకూతురు! మా చెడ్డదానిలాగుంటాది కదూ!!’

‘నాదగ్గి రీ పెంకితనాలు సాగిరావన్న మా కెరికిలేదు గావాల.’

‘పోనీగాని వేరైనా అడిగావా?’

‘అడగనూ మరీ?’

‘ఏమన్నాది?’

‘అదే అన్నాది?’

‘అంటే?’

‘అంటే నీకు తెలుస్తా దనుకొన్నాను. నీకుకూడా ఎరిక లేదేటి?’

‘నాకు తెలుసునుగాని అదేమన్నాదో చూదా మనే అడిగాను.’

‘అలాగా? చూశావా—ఏమన్నాదో? ఏటి కావాలో చెప్పుమన్నాది. తక్షణం ఆచీటిచ్చేశాను.’

'సాయంత్రం వస్తానన్నాడా ?'

ఆ బాలుని ముఖమున నొక క్రూరదృష్టి కానవచ్చెను. పాపమా బుగ్గమీసముల వాఁ డది కానకుండెను. వాని ధ్యాన మంతయు నెదుటనున్న వేడివేడి తేయాకుమీఁదనే యుండెను. కాని యో పాఠకా, ఈకథనే గమనించుచు, రసమును, ధ్వనిని గ్రహించుచున్న నీవెందుకందువో యాబాలున కీక్రూరదృష్టి ?

'వస్తానన్నాడు కాని, ఏమయినా అల్లర జరిగిందంటే నా ప్రాణాలు తీశేస్తానన్నాడు.'

'సరేలే. మళ్ళీ తిరిగొస్తే నీప్రాణాలు తీసినట్టేలే——'

ఈ బుగ్గమీసములవాడు, చీటిలోనున్నటుల యీ సాయంత్రము చంద్పాల్ ఘాటున కాచీటీ నందుకొనినవాఁడు వెళ్లుటయు, మరల వచ్చుటయునా, ఆ బాలుని ప్రాణములు తీయుటకు అని తన మనమున ననుకొనుచు——'మళ్ళీ తిరిగొస్తే నీ ప్రాణాలు తీసినట్టేలే' అని యనిన మాటకు భావము నా బాలుఁడు గ్రహించలేదు గాబోలు !

ఇంతలో హోటేలువాఁడు 'మరేంకావాలి ?' అని యడుగుచు 'ఇకనైన వీరుపోయిన బాగుండు'నను ధ్వనిని సూచించెను.

'ఎంతయింది ?' బుగ్గమీసములవాని ప్రశ్నయిది.

'సాడే సాతణా ?'

'ఇదిగో——తక్కిందిచ్చేయ్' అని యొక రూపాయి వానికి విసరి చిల్లర తీసుకొనిపోయెను.

తోడనే దూరముగనొక కుర్చీమీద నున్న వాడొకఁడు గూడ లేచి తాను చెల్లించవలసినదానిని చెల్లించి వాకిలు వెలువడెను. కిడర్ప్యూరు త్రోవనేగి యిప్పుడు మనము విడచి పెట్టిన సేవకుని దగ్గరకుపోయి 'విశేషాలా?' అని యడిగెను.

'సాయంత్రాలకే—ఈలోగా ఏమిలేవు.'

'సాయంత్రం ఐనా ఎక్కడ?'

'చంద్పాల్ ఘాటు.'

'బోటుమీఁదా?'

'అనే అనుకుంటాను'

'చీటీని బట్టేనా?'.

'మరేం' అని యనుచు మొదటిసేవకుఁడు 'నీకీసంగతి యెటులఁ దెలిసె' నను నర్థముతోఁ జూచెను. కావుననే కాక యున్న నా రెండవవాఁడు 'మీరు పైకొస్తారని తెలుసుకొని, నాజాగార్తలో నేనున్నాను. పాపమా సంతాలుగాడు వీఁడు మఱియొకఁడు వాళ్ళిద్దరకేమైందో చూడడానికే వచ్చుంటాడు నన్ను చూడలేక పోయాడు చూచుంటే ఆచీటీ నాకియ్యవలసిందే.' అని యేల ననును?

'అదేఁవిటి? నే నెవడ్నో తెలియదంటావేఁవిటి?'

'అబ్బే! అదివెట్టివాడిచేతిజాయి తగుల్తే తగుల్తుంది; లేకపోతే లేదనే వాదిలాడు.'

'అలా అంటావా; నిజంగా ఇదే ఒక బంట్రోతు చేతులో పడ్డాదనుకో—అప్పుడేమవుతుంది?'

'ఏమీకాదు. వాడు గాభరాపడి ఏమీ తెలియక ఈ ఘోషెందుకురా అని ఊరుకుంటాడు మీలాంటివారయితే అదేమిటో ఆతమాషా ఏదో చూశిదామని కచ్చబిగిస్తారు.'

'అయితే, ఇప్పుడు నేనే వెళ్ళా ననుకో; తప్పకుండా నేనే ఈ కేసులో పనిచేస్తూ మారువేషంతో నున్నవాడ్నని నిశ్చయం అవుతుందని అంటావా ఏఁవిటి ?'

'ఆహా ! అందు కభ్యంతరం ఏఁవిటి ?'

'అదితప్పు. ఏమీ ? ఒక బంట్రోతువాడు మాత్రం తెగించి వెళ్ళకూడదా ఏఁవిటి ?'

'ఔను—నిజమే' యని నీళ్లు నములుచుండెను.

అప్పుడు మొదటివాడు — గోపాలచంద్ 'మరేమీ ఫర్వాలేదు. నీవు ఆలోచించిం దంతా నిజమే. ఈ కేసులో పనిచేస్తూన్నవాఁ డెవడో, ఆడిటెక్టివ్ సత్తా యేమాత్రమో, చూదాం అని వాళ్ళు సంశయాలు తీర్చుకుని నిశ్చయంగా కొన్ని పనులు చెయ్యడానికి వీలు వుంటుందని మరేదో యెత్తు యెత్తి తరువాత వాళ్ళపని వాళ్ళు చేస్తారు. నీవుమాత్రం జాగ్రత్తగా వుండు. నేనొక్కడ్నే వెళ్తాను. నీవుకూడా బహు హుషారీగా ఉండు. అయితే అన్నట్టు ఆంగుంటడెవడు ?' అని యడిగెను.

'అవసర నై వేద్యానికి అక్కడెక్కడో, అప్పటికప్పుడు దొరికినవాడు. వాడి పనంతా నాలుగు పూరీలతోనే తీరి పోయింది. ఇంకా వాడెందుకు వాళ్ళకి ?'

'అలాగ! ఇప్పుడు మనచపాగామీ దున్నారంటావా?'

'లేదు—మీ రేమిచెయ్యడానికి నిశ్చయించినారు ?'

'నిశ్చయించడాని కేముంది. వాళ్ళ ఆజ్ఞ దాటడమొకటా, శిరసావహించవలసిందే గాని ? ఇంకా ఇంతకన్న మంచి సమయం దొరుకుతుందా ?'

'అయితే నాకు శెలవా ?'

'సరే—పో—నువ్వంతా సిద్ధంచెయ్యి.'

'తెలివిగల ఘటాలుండాలిసుమా అదిమాత్రంజాగ్రత్త.'

ఇద్దఱును యెవరి త్రోవను వారుపోయిరి.

గోపాలచంద్ పోయి పోయి ఒకమేడలో ప్రవేశించి లోపలికి వెళ్ళినంత 'అబ్బా, యింతసేపిలాగాలస్యం చేస్తారా?' అని లక్ష్మీభాయి — మరి మారురూపులేదు. బొట్టొక్కటి లేదుగాని పరిపూర్ణ చంద్రవదన — భావాలంకారము తప్ప భాషాలంకారము లక్కరలేదు; కవిత్వము లక్కరలేదు. పాండిత్య మక్కరలేదు' ప్రశ్నపూర్వకముగ నిందించెను.

'అన్నా, ఈ యింటికివచ్చినా నీ కింకా ఆ బెంగేనా? మళ్ళీ ఒకసారి చెప్తానువిను. ఇక్కడ నీకేం భయంలేదు సరా.'

'నాకు భయం లేకపోతే సరా ? మరి బెంగవుండదా?'

'నీకూ ఈబాలునికీ కూడా భయం లేదు. సరా ?'

'సరా అంటే సరిపోతుందా ? పోనియ్యండి అక్కడేమిటి జరిగిందో చెప్పుతారా ?'

'చెప్పరా మరి' అని లక్ష్మీబాయి నిన్నటి మధ్యాహ్నము ఉత్సవమయమైన నాదో మ్మీలో బాలకునసహితము మాణవేషమున నీల్రొత్తయింటికి వచ్చినది మొదలిప్పటివరకును జరిగినచర్యనంతయుఁ బూసగ్రుచ్చినటుల చెప్పి, తానీసాయంకాలము చేయవలసిన పనినిగూడ నిరూపించెను.

'అయితే అక్కడికి వెళ్లానంటారా ఏఁవిటి ?'

'అయ్యో ! వెళ్ళకపోతే వాళ్ళేమనుకుంటారో ?'

'ఏమిటనుకుంటే నేమిటి ? అదీ మనకేబాధా ? ఏమీ వాళ్ళపిల్లను మీరుచేసుకోవాలా; లేక, మీపిల్లను వాళ్ళుచేసుకోవాలా ? '

'అదేం మాట? స్నేహమంటూ ఒకటిలేదంటావేఁవిటి?'

'ఏడిసినట్టేఉంది స్నేహం.'

'అదేఁవిటలాఅంటావు ? నాకు వాళ్ళే పరమస్నేహితులు. వాళ్ళనుంచే నాజీవనంఅంతా గడుపుకుంటున్నాను. వాళ్ళు లేకుంటే నన్ను పిల్చేవాడెవడు ? ఇంతెందుకూ - నువ్వైనా నన్ను పిల్చివుందువటమ్మా ? చెప్పు.'

'బాగాఅన్నారు——మీతో వాదించగలనా? పోనీగాని నామాటవిని మీరుమాత్రం అక్కడకు వెళ్ళడంమానండి?'

'మానేసి——?'

'మానేస్తేనా; వాళ్ళే మీదగ్గిర కొస్తారు. అప్పుడే చెయ్యండి మీరు చేసే పని.'

'అలాకాదు. ఇప్పుడు నేను వెళ్ళేకార్యం మహావేగంగా సిద్ధిస్తుంది.'

'మంచి సిద్ధించడమే-అక్కడకు వెళ్తే ఒక్కటే సిద్ధి'

'ఏమిటి నన్ను చంపేస్తారనే—'

'ఇంకా సందేహమే! అబ్బే—నమ్మండి'

'వాళ్ళతరంకాదు సరేకదా, వాళ్ళ తాతల తరంకూడా కాదు. నువ్వొత్తనే అలాగ గాభరాపడుతున్నావన్నా'

'పోనీండి-మీచిత్తమే కానీయండి.'

అని యనుచుండ జగత్‌సింగు (కుమారసింగు) ను వెంటఁబెట్టుకొని సీతి వచ్చెను. ఇద్దఱును కుమారసింగు మాటలతో కాలము బుచ్చుచుండిరి.

గోపాల్ చందచటనుండి వెడలెను.

సాయంకాల మైదు గంటలైనవి. కలకత్తాలో నొందఱో యెన్నివృత్తులనో వ్యాపారములు చేయుచుండ వృత్తియనఁదగినది లేనివారు విహారమే వృత్తిగాఁ జేసికొని తిరుగుచుండిరి. వర్తకవీధుల జనులు గ్రిక్కిరిసి యాత్ర యాత్ర యను శంకం గలుగఁజేయుచుండిరి. చక్కగ నీటఁదడుపఁబడి బాటలన్నియు వచ్చుచుఁబోవుచుండు శకటములకు నుత్సాహమును కలుగఁజేయుచు, పాదచారులపాదముల జోడులకును బట్టలకు నలంకారము నొసంగుచుండెను అంగడు లన్నియు శృంగారముల తోడను పూవులతోడను, రంగురంగులుగ గానవచ్చుచుఁ గ్రింది యంతస్థుల బీడీలును, దమలపాకులును, విక్రయించు

చుండ, పైయంతస్థుల నారీజనంబుల తమ మేలిదుస్తుల మార్గస్థుల చూపుల నాకర్షించుచు తను విహారముల జేయుచుందురు.

ఇటులనుండు నాకలకత్తా మహానగరములో రెండు గృహంబులమాత్రము చిత్రచర్యలు జరుగుచుండెను. ఒకటి మన గోపాల్‌చందున్నది. రెండవది కిదర్పూరులో ముసలి పనివాఁడున్నది.

గరిమీనముల గులాబ్‌సింగు నల్లని యంగరఖాను ధరించి నలువునకుఁ దగిన సామగ్రులన్నియు నిబుడించుకొని యేదియో పెద్దకార్యమును బూనినట్టుల యాత్రముతో వీధి లోబడి యితరులు చూచుచున్న శృంగారములఁజూడఁ నాగఁజాలక వడివడి చంద్పాల్ ఘాటుదిక్కున పోవుచుండెను. అట్టులనే గోపాల్‌చంద్ కూడ తనసేవకి వేషము ధరించి, యేమియు నెఱుఁగని యట్టుల తలవంచుకొనుచునే చుట్టుంగల విషయంబులెల్లఁజూచుచు నాచంద్పాల్ ఘాటువైపు పోవుచుండెను.

చంద్పాల్‌ఘాటు హుగ్లీనదిపై రాదారిగ వచ్చుచుఁ బోవుచుండు పడవలకు రేవువంటిది. పొగయోడల నెక్కుటకు నచ్చోట ననువగునట్లు బల్లకట్టు లుండును. వాని చేరువకువచ్చి యీపడవ లాగుటచేయుటకాలైనను దడియకుండ బాటసారులు స్వేచ్ఛగా నాపొగపడవల నెక్కఁగలుగుదురు అట్టి యీబల్లకట్టుల నా సాయంసమయమునఁ గూడినజనులసంఖ్య విశేషము. ప్రయాణముకొఱకు చీట్లు కొనువారును, సంతదనుక యాడు

గొనినమాటలు చాలనియట్టుల నింకను అటనట విడిసి సల్లా పంబుల జరుపువారును, క్రొత్త క్రొత్త స్నేహితులచుఁ గూర్చు కొనుచుండువారును, పడవయింకను రాదేమిరాయనుకొనువారు ను, పాలకాయలను, బీడీలను బీల్చుచుండినవారును నయి ఆచో టెంతయో నయనానందకరముగ నుండెను——అట్టియాచోటున కనతిదూరంబున గులాబ్ సింగు మెలమెల్లన అటునిటు దిరుగు చు, పరులనమానింతురేమోయను భయంబున నేదియో పని యున్నయట్టుల నటించుచు నప్పుడప్పుడు తనతో మాటలాడ నుద్యమించు స్వల్పజనులకుఁ దగినట్టుల ప్రత్యుత్తరములిచ్చుచు 'ఏమిది? ఇంకా ఆరుగంటలే కాలేదు! నేను నిష్కారణంగా ఇంత తొందరపడ్డాను.' అని యనుకొనుచుండెను.

చీకటి యిచ్చవచ్చినటుల హెచ్చుచుండెను. అప్పుడొక పడవవచ్చుటచే నచ్చట నింతవఱకును గుమిగూడి యున్న జను లందరును బోవఁ గలిగి మఱికొంతవఱకును సద్దులేకుండ జేసిరి.

గులాబ్ సింగు తనలో మంచి 'సమయంలో నీదుర్మా ర్గుడొకడు తటస్థపడ్డాడు. వీడేలేకపోతే యీపాటికి నాకార్యం సఫలమయ్యుండును కదా! ఎలాగో ఒకలాగ ఆనాలుగు కాగి తాలు దొరికినట్టాయెనా యింక నాసౌఖ్యానికి అడ్డేమిటి? వీ డెవడోగాని చాలా నేర్పరిలా గున్నాడు—— ఏమిటో- ఇక్కడి కొచ్చింది మొదలూఅన్నీవిఘ్నాలే కనిపిస్తున్నాయి-వీడో, మరి యెవడోగాని సరే మించిపోయిందేమిటి? ఈవేళతో సరికదా

వీడిపని. తరువాత దాసిపనెంత-ఒక్కనిముషములో సాఫ్‌సీదా. ఖులాసాగా యిద్దరమున్నూ దేవీపూర్‌లో ఉంటాము! ఉంటామా? అదేమిటోగాని, అనుమానానికి కారణమంటూ ఒకటున్నట్టే కనిపించదు. అంతా నవ్యంగానే జరుగుతున్నట్టున్నా, నాకేమో అనుమానమే ఇంతమంది ప్రాణాలు అనాయాసంగా తీసేసినదానికి ఒక్కనాలాంటి వాడిని.హటావ్ బే-అని చేతికి రొట్టిచ్చి పంపెయ్యడం ఒకగొప్ప సంగతా అనే మనస్సులో కొట్లాడుతూనే ఉంటుంది నేను చూచినంతమట్టుకు మరేమీ లోపుఆలోచనవున్నట్టు కనిపించదునరేకదా నామీద మహా అభిమానం వున్నట్టేతోస్తుంది. చూదాం. ఎలాగయినా వీడ్ని తుదముట్టించే మార్గమేచూడాలి. అంతవరకూ లాభం అన్నమాట కలలోదే. అయ్యో, వీడెక్కడ దాపరించాడు మాకు సైంధవుడులాగ. కానీ—' అని యనుకొనుచుండ దూరమున మనసేవకుఁడు కానవచ్చెను. గులాబ్ సింగ్ చిన్నయూల వేసికొనుచుఁ బ్రచారము చేయుచుండెను.

తోడనే యాచేరువనుండి మెల మెల్లన వచ్చి యొక నిండుముసుఁగు విగ్రహము బాటకు కొంచెము ప్రక్కగ నిలచి యుండెను—నిలిచియుండుటేమి—వచ్చుచున్న సేవకునికొఱకుఁగనిపెట్టుకొని చూచుచుండెను. *ఆక్షణముననే బల్లకట్టుదగ్గరనుండి కాక మఱియొకచోటునుండి యొకపడవబయలుదేరెను.

# ఏడవ ప్రకరణము

---

## బోటు షికారు; ప్రథమ సమావేశము

గోపాలచంద్ పాప మానసంగతు లన్నియు చూడకనో, యెటుగాక బల్లకట్టుదగ్గరకు మరియొక త్రోవనెఱుంగుటనో కాని రాదారిని విడచిపెట్టి మఱియొక ప్రక్కతోవనుబడెను. ఇది యేమిరా యని యనుకొని మన గులాబ్‌సింగు నాదిక్కునకే పోఁబోవుచుండెను. ఇంతలో బాటప్రక్క వేచియున్న ముసుగు పరుగు పరుగున గోపాల్‌చంద్ దిక్కువచ్చి, 'నాయినో! నువ్వు మాత్రం అక్కడికి వెళ్ళకు బాబో వెళ్ళకుమా; వాళ్లు ప్రాణాలు తీస్తారు. వెళ్ళొద్దు—నాయనా వెళ్ళొద్దు' అని బిగ్గరగానఱచుచు వానిచేతిని పట్టుకొనెను. తోడనే గోపాల్‌చందు రెండవ చేయి మొలవరకును వెళ్ళెను. అంత నీమేలి ముసుఁగున నున్న స్త్రీ—స్త్రీయని కంఠస్వరమువలన తెలియుచున్నది—కావలిస్తే నన్ను చంపెయ్యిగాని, నువ్వుమాత్రం అక్కడికి వెళ్ళవద్దు వాళ్ళు పచ్చిఖూనీదార్లు. ఈవేళ నువ్వీనదికి బలే ఇదేనిజం. వొద్దు-వొద్దు నామాటవిను, నామాటవిను.' అని యనెను.

'ఏమి టీ అల్లరి? నీ ఉద్దేశ మేమిటి? నీ పేరేమిటి?

'నువ్వెక్కడి కెళ్ళకుండా ఉంచీడమే నాఉద్దేశం. నాపేరు చెప్పినా నువ్వెరగవు.'

'సరేలే-నాకు పనుంది.'

'నీ కేమీా పనిలేదు. వెళ్ళొద్దు—వాళ్ళు చంపేస్తారు.'

'అమ్మో, ఇదిగో నామాట విని నువ్వెళ్ళిపో.'

'నామాట వినవుకదూ!'

'వినను.'

'అనుభవిస్తావు సుమా.'

'సరేలే అప్పుడునీవు సంతోషించొచ్చును.'

'అయితే పో-పాడుపడేవాడ్ని బాగుచేయడమెలాగ?'

అని యాముసుంగు తొలగిపోవుచు, 'వాడే! వాడే!' అని యఱచుచుబోయెను. ఇంతలో నీగులాబ్ సింగు వానిని దగ్గరి 'ఎవరోయ్ అది' అని యడిగెను.

'అదేమో నాకే తెలీదు'

'అదేంవిటలా అంటున్నావు! నువ్వు యెనడవో నీకే తెలియదేం?'

'నేనా-అది అంటే ఇప్పుడు నాతో మాట్లాడిన దాన్ని గురించి అని తెలిదన్నాను.'

'సరే నువ్వెవరు?'

'అన్నీ నన్నే నువ్వడుగుతే నేను నిన్నడగడ మెలాగ?'

'అన్నా నీకు మాచెడ్డ పట్టుదలలాగ, కనిపిస్తున్నాది.'

'నాయనా, నువ్వుచాలా తెలివైనోడులా గున్నావు బాబూ, ఒక్క మాటలోనే పోల్చేశావు నాగుణమంతా నిజమే, నాకు ఇలాటివాట్లో మాచెడ్డపట్టుదలయ్యా. అందుకే చాలా మందికి నామీాద కోపం!'

'అలాగా. నువ్విప్పు డెక్కడికి వెళ్తావ్' అని గులాబ్ సింగు ప్రశ్నించెను.

'అదేమో అదీ నాకే తెల్దూ.'

'అదేవిటి-అంతా పరాస్కాలు చేస్తున్నావ్.'

'నేనా, నువ్వా—పరాస్కాలు చెయ్యాండ?'

'లేకపోతే యేదడిగినా ఆవిగటాలేవిటి? నువ్వెక్కడికి వెళ్తున్నావో నీకే తెలియదేం ?'

'తెలుస్తే సెప్పడానికేం నాసామ్మి పోతాదా సోకం పోతాదా ?'

'అదేవిటో నీకే తెలియాలి.'

'పోనీగాని, నే నడిగేదానికి జవాబు చెప్తావా ?' అని గోపాల్‌చంద్ (సేవకునివలె నున్నవాడు) ప్రశ్నించెను.

'చెప్పకపోవడమేం—నీలాగనుకున్నావా యేవిటి ?' అని సింగు ప్రత్యుత్తర మొసఁగెను.

'అయితేచెప్పు; చూదాం. నువ్వెందుకిక్కడున్నావు ?' అని చందు ప్రశ్నించెను.

'మావా డొకడు రావాలి అందు కున్నాను—'

'బాగందుకున్నావు! మీవోడంటే ?'

'మావాడంటేనా ?—మావాడు.'

'అంటే యేటనే నే నడిగాను.'

'అంటేనా—ఇదే తెలియకపోతే ఎలాగు చెప్పడం.'

'ఎలాగా? మాబావో, మాతమ్ముడో, మానేస్తంవో అని.'

'ఇందులో ఏదీకాదు మరెలాగ—'

'పోనీ ఆడిపేరో?' అని చందడిగెను.

'అదీ నే నెరగను.'

'ఎలాగుంటాడు? అదైనా ఎరుగుదువా?'

'అదిగూడా బాగా తెలియదు.'

'మరెలాగ మీవోడంటావు నువ్వు?'

'అంటే ఒకడ్నిక్కడికి రమ్మన్నాము. వాడని.'

'రమ్మన్నామూ అంటున్నావు—ఎంతమందేటి?'

'రమ్మండానికెంతోమంది కావాలా?'

'ఒక్కడు పిలుస్తేరమ్మన్నా నంటాడా రమ్మన్నా మంటాడా నువ్వే చెప్పు'

'*ప్రభువులు రమ్మనుమంటే రమ్మాన్నాను.'

'నువ్వే మాట్లడతావేటి ఒకవేళ ఆడొస్తే?'

'నాకేంవని? బాబుగారిదగ్గరకు తీసుకొనివెళ్తాను.'

'తీసుకెల్లడానికా? నువ్వాడ్ని పోల్చగలవా?'

'కొంచెం పోల్చగలను.'

'నేనే అంటాననుకో నన్నుపోల్చగలవా?'

'కొంచెం పోల్చాను గాని, నువ్వన్నంతమాత్రంచేత తీసుకొనిపోతానా? నువ్వేఅయితే ఆచీటీ చూపించవూ?'

'అలాగా ? అయితే యిదుగో చీటి. సరా ? ఎక్కడికి ?'

'అట్టే అట్టే దూరం లేదు. ఆ హార్బరు దగ్గిరికే'

'ఏంటీ ? ఈ చీకట్లో ఏటిమీదేనా యేటి పయానం ?'

'అదిగో మనకోసం పడవ సిద్ధంగావుంది. బయల్దేర్దా మా మరెందుకాలస్యం ?'

'ఓరి నాయనా, నాకు బయమేస్తున్నాది బాబూ పోనీ నీభరాసామీద వొస్తానంటే మా పెటువులు తన్నరూ, ఇంతనే పెక్కడి కెల్లావురా అని !'

'ఓసీ ఇంత మాత్రానికే ఒకగంటలో తిరిగి రావొచ్చు'

'పోనీ బాబూ బాబూ, నిన్ను బతిమిలాడతాను. అదేమి మేలో కొంచెము నువ్వే చెప్పేదు. నేను చచ్చి నీ కడుపున పుడతాను.'

'నీమేలుకోసం చేసినవనికే నువ్వింత తటపటాయిస్తే మరేంలాభం. పోనీవెళ్ళిపో. 'రాలేదు బాబూ' అని చెప్పేస్తాను'

'అదెంతమేలో అనే నేనూ చూస్తున్నాను పోనీ ఒక గంటలోతిరిగి రావొచ్చునంటూ ? నిజమేనా ?' అని సేవకు డనెను.

'నిజమే—నేనుగూడా తోడొస్తాను. పదపద.'

అంత గోపాల్‌చంద్‌ను తోడ్కొని గులాబ్‌సింగు ఒడ్డు నకుఁబోయి పడవ నెక్కెను. పడవయుఁ దక్షణమే శీఘ్రముగ యానము సాగింపఁజొచ్చెను. మూఁడుగంటల ప్రయాణ

మయిన వెనుక వీరి కొకవెలుఁగు దూరమున గానవచ్చెను. ఇంతవఱకును పల్లెత్తుమాట మాడకుండ యెవని జాగ్రత్తనువా డుండి యూహాలపై నూహాల నిలుపుచుండిన యీయిరువురు నొక్కసారిగ 'అదిగో వెలుతురు' అని యనిరి.

'అప్పు నదే మనము పోవలసిన జాగా' అని గులాబ్ సిం గనెను.

'అదేటి ! నీటిమీద మన్నట్టు కనిపిస్తున్నాది—దీపము!'

'అవును; అది ఒకబోటు హావును (పడవలయిల్లు) అందులోనే మాపెద్ద వున్నాడు.'

'అలాగా ఇంతూరూ మీపెద్దకి చాలింది కాదేంటి ? నీటిమీదకూడా యిల్లు కట్టుకొన్నాడు ?'

'ప్రభువులకు తక్కువేమిటి ? వాళ్ళచిత్తం వచ్చినట్లు చేస్తారు. ఇక్కడున్న ఆనందం అక్కడ (ఊరియందు) ఉంటుం దా ? ఇదో కులాసా.'

'ఆహా ! మంచి కులాసాగానే ఉంది. ఇలాంటి మనుష్యు లకి నాతో ఏం పని ఉంటాదేటి చెప్మా ?'

'అది నన్నడిగితే నే నెలాగ చెప్పగలను ? అయినా కూడా తినబోతూరుచి అడగడ మెందుకు మరి పది మినిట్లలో నీకే తెలుస్తుంది కదూ అందాకా ఊరుకో.'

'ఊరుకోక మాత్రం నే నేంచేస్తానేటి ?'

మరల నిరువురును కిక్కురు మనకుండ ప్రయాణము చేసి చేసి ఆ బోటుహావును దగ్గరకు వచ్చిరి.

'అబ్బా! యెంతసే పయింది? ఇంతసే పేమిటి చేస్తు న్నావు సింగూ? బాబుగారు అప్పుడే పదిమార్లు అడిగారు. వేగం రా.' అని యొకడు పడవమీాదనుండి కేకలు వైచెను. తోడనే పడవలో నెంతయో యలుకుడయి దాదా పొక వది మంది యం దున్నట్టి సందడి కలిగెను.

గులాబ్ సింగును తనతో వచ్చిన యా నౌఖరునంటి వాడును ఆ బోటుహావునున కాలు పెట్టినతోడనే యొక గంభీర స్వరము 'క్యాం' సింగ్! వా ఛొచ్చాడా?' అని వినవచ్చెను.

గులాబ్ సింగు ముందుకువచ్చి అందుకు 'జీ హుజూర్, హాజర్, ఓయ్ వెళ్ళి యెదుట నిలబడు' అని యా సేవకుని ముందుకు ద్రోసెను.

ప్ర థ మ న మా వే శ ము

'ఏం అబ్బీ నువ్వెవరు? నీ వృత్తియేఁవిటి?'
'నేను సేవకుణ్ని నావృత్తి సేవకావృత్తి.'
'నువ్వెక్కడున్నావు యిప్పుడు?'
'చిత్తం ఏలినవా రెదుట ఈ బోటుహావునులో—'
'అదేఁవిటి. మానంగ తేమాట చెప్పుతున్నట్టుందే, ఆఁ?'

'చిత్తం. ఏలోన్నరితో నేనెలాగ మాట్లాడ్డమో నాకు తెలియకుండుంది. ఏలోన్నరు అడిగిం దానికి బదులు సెప్పనే కుంటున్నాను—ఛమించాల.'

'సరే లే—నువ్విప్పు డెవరిదగ్గర పని చేస్తున్నావ్?'

'ఇప్పు డెక్కడా పనిలేదు బాబూ. ఉత్తినిలా గున్నాను- సెలవయితే ఏదయినా సేస్తాను.'

'నువ్వేంపని చెయ్యగలవు?'

'ఏలో్నరి పనేదయినా, చేతులుకట్టి మరీ చేస్తాను.'

'అలాగయితే నే నొకమాట చెప్తాను వింటావా?' అని యేలినవారు, (ప్రభువు) అనిరి.

ఇన్దానికేం కొదవా బాబూ? ఏలో్నరు, ప్రభువులు, తమలాటోళ్ళుసుంచే కదా మాకెంత బతుకు తెరువు'

'సరే నువ్విప్పుడు భవానీపురంలో ఎవరిపని చేస్తున్నావో నీకు తెలుసునా?'

నే నిప్పుడు భవానీ పురంలో ఎవళ్ళపనీ చెయ్యలేదు. నాకు తెలుసునా అంటారేటి బాబూ!'

'చాల్లే; యీ వికటాలు.'

'అమ్మమ్మ—ఎంతమాట సెలవిచ్చారు! ఏలో్నరుతో ఒక్కనాడైనా యికటా లాడగలమా?—ఏం మాటబాబూ అది. మా జాగర్త మా కొద్దా? అలాగ సెలవియ్యకండీ నాయనా' (అనుచు నీ సేవకుండు లెంపలు కొట్టుకొనెను.)

'ఏమిటది జాగర్తా, గీగర్తా—అంటున్నావు?'

'అనాక్కాదు బాబయ్యా, తమరు సనువిచ్చి మాట్లాడగానే మాకు సంబరమా—మా అద్దు బద్దులో మే ముండాలి గదా అని అంటాను బాబయ్యా.'

'అదిగో అంతా పెంకె జవాబులే యిస్తున్నట్టు కని పిస్తున్నావు. నీ మేలుకోసమే యిక్కడకు పిలిపించా నన్నమాట తెలుసునా?'

'చిత్తం బాబయ్యా. తొరు పంపిన సీటి సూసి అనాగే అన్నాడు పంతులయ్య' పాపము చదువురాదు మూర్ఖుడు!

'సరే—అయితే నేను చెప్పేమాట సరిగావిను.' అనెను ప్రభువు.

'సరిగ కాకపోతే—బే సరిగ యిన్నాసకి నే నేమి మూరుకుడ్నా యేటి? అందులోనూ నామేలుకోసమే అన్నప్పుడు?'

'నువ్విప్పుడు ఆ యింటిలో—భవానీపురంలో—ఏం పని చేస్తున్నావో చెప్పుతావా?'

'కూలిపని నేనుకుంటున్నాను బాబు.'

'అంటే?'

'అంటే ను కెలాగ సెప్పడం?—'

'నీకు వా ళ్ళిచ్చిన పనేమిటి?'

'ఒక పనేంటి బాబూ—అంతా పనే ఇల్లంతా రోజం తా కనిపెట్టుకో నుంటాను బాబయ్యా?'

'నిన్న నేదో పండుగ చేసుకున్నారట?'.

'చిత్తం—వల్లో్నరికి తెలిసిందీ అప్పుడే! ఏటి బాబూ-యింత వాకబూ!'

'ఏమి టా పండుగ?'

'ఎవళ్ళకో రోగం కుదరడానికి శనికి చాంతి—చాంతి చేశారట బాబూ.

'ఛీ-ఛీ—నువ్వు దాచకుండా చెప్పకుండా వున్నావు.'

'ఏటి బాయాలో బాబూ—రూపాయలనా, లోట్లనా దాయడం?'

'లేదులే—నువ్వు కొంత మభ్యపరుస్తున్నావు. ఒరే ఎవఁడ్రా అక్కడ! మీరంతా లోపలికి పోండి — ఇదిగో చక్కగా చెప్పు నీ కెంత మేలుచేస్తానో చూడు.'

'ఏలోన్రు—పభువులు అనగంటే సాలగలనా? అదేదో రోగం. అనాగ చేస్తే బేగి కుదురుతా దని సంబరం శేశాడు బాబయ్యా. ఇందులో రవ్వం తబద్ధము లేదు. బంట్రోతోడ్ని తౌరు యిన్నినాగాలు అడగడమా బాబయ్యా. మ రౌళ్ళకైనా అడగండి బాబూ—నామాట దబ్బరౌతుంది గావలా సూడండి.'

'నువ్వలాంటి బంట్రోతువాడవో మా కప్పుడే తెలిసింది గాని, నేనట్టే మాట్లాడను. ఒక్కమాట చెప్తాను విను.'

'చిత్తం బాబయ్యా, ఇంటున్నాను.'

'నువ్వు మహా అపాయకరమైన జాగాలో కాలుపెట్టావు తెలుసునా?'

'అమాట నే నెరగను బాబో—(అని యాతడు అక్కడ నుండి కదలి వాని యెడమచేతివైపు వచ్చి, ఇక్కడలాంటి

బాధ లేదుకదా నాయనా ? మీరు దయుండి శెప్పారే. లేకుంటే నచ్చిపోదునేమో—మీకు దేవుడు మేలుచేస్తాడు బాబు '

'ఇక్కడ ఈ బోటులో నువ్వున్న జాగాని గురించి కాదు. ఇక్కడ నీకిలాటి బాధలేం లేవులే. నే ననడం మీ భవానీపురంలో జాగా.'

'అక్కడలాటిబాధ మరీలేదు బాబయ్యా. ఎన్నాళ్ళనుంచో వున్నాము. నేను బా గెరుగుదును.'

'మరీ గడుసుమాటలకేం గాని చెప్పుతున్నాను విను. చాలా అపాయకరం. ప్రాణాలమీదికి తెచ్చుకుంటున్నావు. నువ్వింకా ఆజాగాతోగాని, ఆయింటితోగాని, జోక్యంలేకుండా ఉంటే చాలామంచిది లేదా తగినశిక్ష ననుభవిస్తావునుమా.'

'అదేటి బాబయ్యా, అనా గంతున్నారు. సెప్పండి బాబూ అదేటో.'

'మరేమీ లేదు ఆ యింటిమీద కొందరు నిఘా ఉంచారు. నువ్వక్క డుండకూడదు. తెలిసిందా ?'

'తెలిసిందిగాని, నిఘాఉంచినోళ్లు ఏదో ఆ అమ్మాయిని పెళ్ళిసేసుకుంటారూ. ఇంతేకదా నానుండడానికి కేం బాధబాబూ ?'

'పెళ్ళికాదోయ్, దద్దమ్మా — పెద్దపెళ్ళే. నువ్వక్కడుండకూడదు, ఏమంటావ్.'

'అయితేబాబూ, మరినాకు బతుకో ?'

'నాదగ్గర పనిచేసుకో — లేదా ఎక్కడా పనిచేయకు. నీకెంతసొమ్ము కావాలిస్తే అంతసొమ్ము నేనేయిస్తాను. చక్కగా యింట్లోకూర్చో అంతేగాని సర్వేమయినా యీకార్యాల్లో జోక్యం కలుగజేసుకున్నావా, నీప్రాణాలు పోయా యనే నమ్ముకో—ఏమంటావు; బోధపడ్డాదా ?'

'ప్రాణాలు పోతే పోయాయిగాని ఆ యిల్లుమాత్రం యిడిచిపెట్టను బాబూ. అలా గిడిచిపెడ్తే నాకు దేవుడు కాస్తాడా ? మీరే చెప్పండి ?'

'ఏమిటీ ? ఆయిల్లొదలవూ ? ఆలాగయితే నువ్వు ప్రాణాలుతోనే యిక్కడనుంచి కదలివెళ్ళలేవని నమ్ముకో— ఖబడ్దార్.'

'భన్, ఏంమాటసెలవిచ్చారూ. ఎల్లోనరు; ఏటీ నన్ను చంపేస్తారేటి ?'

'అదెంతలోమాట. మెల్లిగాచెప్తే నీతల కెక్కకపోతే చెప్పినట్టే చెప్పిస్తాను. జాగ్రత్తసుమా. నామాటవిను. బతికేదారి చూచుకో. చూస్తూచూస్తూ నిప్పుగుండంలో పడ్డం మంచిదికాదు సుమా.'

'నిప్పుగుండంఅంటే అయిపోతాదా? ఒకడుచంపాలంటే చచ్చిపోతానా బాబయ్యా; దేవుడి ఆజ్ఞఒకటి కావలికదా అన్నిటికన్నీ ?'

'అయితే, నువ్వీపనిలో జోక్యం వుంచుకోకమానవు కదూ?'

'అలాగ సెప్పగలనా? వొదలడం అంటే ప్రాణాలు పోయాయన్న మాటే.'

'అచ్ఛా! జాగ్రతె- ఆప్రాణాలుపోవడమేదో యిప్పుడే చూపిస్తాను'

'ఏలోన్నరు అంత పనెందుకు చేస్తారు తమకి మాత్రం తెలీదా'

'ఛాప్-బద్మాష్ ఏఁవ్ రో మాటలు జోరవుతున్నాయి' అని తన మొలలో చేయిపెట్టుచుండెను.

వెంటనే యీసేవకుని చేతిక్రొత్త చేతుపాకివచ్చి పేల్చుటకు సిద్ధముగా నుండెను దానితో గుఱిపట్టి 'బస్! బస్! నబార్ కరో. చెయ్యి కదిపావా నువ్వన్నమాటే. చక్కగా మాట్లాడు- చక్కగామాట్లాడు- చూడు నీసంగతి నాకంతా తెలుసును నేనే నీకొత్తమాట చెప్తానువిను నీప్రయత్నం అంతా నాకు తెలుసును నీపేరేఁవిటో కూడా—అనగా— నీ నిజమయినపేరు నేనెరుగుదును. ఈభానోజి ఆటలు సాగడానికి భగవాన్ సింగ్ లేడు. తెలిసిందా ఎటుచూచినా నీకు అపాయమే ఇంక జాల్వారుమహారాజాగారి దగ్గర తెలియచేయడమే పని. కాబట్టి ఈప్రయత్నంఅంతా వదులుకో. ఉత్తనే చావడంవల్ల లాభమేమిటి?' అని గద్దించుచుండెను పాపము 'ఏలినవారు' నోటమాటరాక గ్రుక్కిళ్ళుమింగుచు నిరూపకాధ్యక్షుని మేఘగర్జనల వినుచు తన్నుతానే మఱచిపోయెను. కాని గోపాల్

చందు తనప్రాత పురాణము సృష్టింప మొదలుపెట్టినది మొదలు వానికిఁ దెలివి మరలి వచ్చుచుండెను. అట్లగుట వాని యుపన్యాస మంతయునంత 'వీడెక్కడ! మేమనుకొన్న వాడికన్న ఎక్కువ తెలిసియున్నవాడే!' అని యనుకొని దొంగ లయిన వాని నక్కడనుండి కదలనీయరా దనుకొనెను. కాని పరిజన మనువారందరును లోపలనున్నారు కేకవైచినగుండు ప్రేలునను భయమున్నది. కావున కాలితో నేమీాట నొక్కనో గాని యొక్కక్షణమున గోపాలచందు నిలచినచోట బల్లలు కదులఁజొచ్చెను.

'ఆఁ; ఆఁ; దగాఖోర్.' అని మఱియొకచోటికి గంతెనే కాని యక్కడి పలకె లప్పుడే, విడిపోవుటచే కాలున కూఁత దొరకలేదు. ఏయధః పాతాళమున పడబోవుచున్నాడో తానెఱుఁగడు. 'ఫయిర్—సాలేకు—' అనిమాత్ర మొక్క పెట్టున ధ్వనిచేసి గుండు ప్రేల్చెను సరి మరల యెప్పటియట్ల పలకలు లేచిపోయెను

సేవకుడు-గోపాల్ చంద్-పడవమీాద లేనేలేఁడు.

ఈచప్పుడు వినినతక్షణమున లోపల నింత దనుక నున్న పరిచారకులు వడి వడి వెలుపలకువచ్చి 'క్యాహాయ్ గడ్ బడ్ (ఏమిటీ యల్లరి?) అని తమవారలకు బాధలేదని తెలిసికొని సంతోషించు నంతలో నొకపెద్ద వెలుఁగు కొంతదూరము నుండి పడవమీాదపడి ప్రకాశించెను. ఏమిది యను నివ్వెరపాటు

తగ్గుటకు ముందే—ధన్ ధన్—అని యొక్కసారిగ పది—పదు నైదు గుళ్ళు ప్రేలెను. ఇద్దరు ముగ్గురు దబ్బు దబ్బున నేలం బడిరి.

మిగిలినవారలు, 'కహాఁసే ఆతాహాయ్' (ఎక్కడనుండి వచ్చుచున్నవి—ఈగుళ్ళు—) అని చూచుచు, గురిలేని గుండ్లను పేల్చుచుండ కొండలు పడవ ప్రక్కలకు నెగ బ్రాకుకొని మీఁది కెక్కి చేతికి దొరికిన వాని నెల్లపట్టి కట్టివైచుచుండిరి. పాప మాహంతకు లందఱును గాయములు పడియో, కట్టఁబడియో, యేమియుఁజేయ వీలులేక 'ఇదేమిరా మేఘంలేని వర్షం' అని యచ్చెరువు నందుచుండిరి. ఇంకను లోపలనుండు గదిలో గొంత కలకలమును అచటి వార లీసందడిచే వినఁజాల కున్నను, గలదనియే చెప్పవలయును కాని హంతకుల పాలిటి యానన్న మరణమువలె వచ్చిన వీరుమాత్రము మొదట బల్లకట్టుపై నున్న వారినందఱిని జాగ్రత్తపఱచికదా లోపలకు వెళ్ళవల యును. ఆ బోటుహావునంతయు శత్రువుల తర్జన భర్జనల తోడను, క్రిందఁబడువారల మొఱలతోడను, వీరి తిట్టుల తోడను, నల్ల కల్లోలముగ నుండెను.

అట్టిసమయంబున 'తండ్రులారా! తండ్రులారా! రక్షించుడు! రక్షించుడు! నాపాలిటి యదృష్టదేవతలవలె వచ్చినారు ఈదుర్మార్గుడు—' అని యఱచుకొనుచు లోపలి గదినుండి యొక్క స్త్రీ భయాకులయయి యత్యంతవేగమున వెలుపలికి

వచ్చి 'ఓపుణ్యులారా! యొక్క అనాథమానవుని తీయ
నింతదూరము మీ యరణ్యమునకు దెచ్చి బాధించుచున్న ఆ
దుర్మార్గుని ప్రాణము తీయుడు పుణ్యమునబొందుడు. మీ యందర
కును నమస్కారము—అయ్యో! ఒక్క గుండుకూడ ప్రేలదేమి?
పాపీ చిరాయు వనునట్లు మీకుగూడ నన్ను బాధించుచున్న
వానియందు దయ కలుగుచున్నదా? హా యీశ్వరా! ఇంక
నాకు దిక్కెవ్వరు? పరువు మర్యాదలతో బ్రతుకుచుండు వీరు
గూడ నామానహాని గోరుచున్నారు! నాకింక నీవేదిక్కు;
గంగామాతా! ఇదిగో నీలోనికి నన్ను తీసికొనుము' అని
గుభాలున నానదిలో దుమికెను 'ఆఁ! ఆఁ! మించిపోయింది'
అని యొకఁడు వెంటనే నీటిలోఁ బడెను.

---

## తొమ్మిదవ ప్రకరణము

---

ఛత్రీబాబు వరసఁపు జట్టీ—(వరసఁపు మానము)

హుగ్లీనదిలో పై ప్రకరణమున జరుగుచుండు చర్యగల
పడవకుఁ గొంతదూరమున నొక వ్యక్తి యత్యంత తాయాసముతో
నీదుకొనుచు నావంత యయినఁ జప్పుడు కానీయక మఱియొక
పడవను సమీపించుచున్నది. ఈఁత నేర్పరితన మత్యద్భుతము.
భయంకర జలచర సముదాయముం గలిగి ప్రాణభీతినిచ్చు

నానీట వాచోట నింతియైన పవ్వడి కానీయఘుండ నెదురీదు టెంతకాదు !

అటుల నీదుకొనివచ్చి *పడవను మెల్లగ చేరి పై కెక్కు నరికి మిక్కిలిగ నలసిపోయి నిశ్వాసముల నోట మాట సరిగ రాకుండు నొక్క కాంత, యాపడవను గాచుకొనియున్న వానికి గానవచ్చెను. దేహంబున నంటుకొనియున్న యొక నల్లని దుస్తు తప్ప చీరయు లోనుగాఁ గల వస్త్రము లేవియు నాకాంతకు లేవు జుట్టంతయు ముఖమునగూడి తద్వికాన మిట్టిదని నిర్ణయింప వీలు నీయకుండెను. ఆ నల్లని రంగుగల దుస్తు మిక్కిలి పలుచనిది, శరీరమునంతటను నంటిపెట్టుకొనియే యున్నది. ఆదుస్తుయొక్క నలుపురంగునుండి బలీయముగ బంగారు పసిమిరంగు వెలికి గ్రక్కుచు వింతకాంతి నొసంగుచుండెను. తడిసిన శిరోజము లురోజములపై చిందులాడుచుండ తత్కాంతి చూపరుల కనులు మిరుమిట్లు గొలుపుచుండఁ బశ్చిమదేశీయుల నీటి దేవత యట్లు లున్నది. ఆమెయు తన ముంగురుల సరిచేసుకొనక యించుక యాఁగి 'పద పద, ఒక్క నిముష మాలస్యమైనదా, పద్మాబాయి పోతుంది. పోయిందా మళ్ళీ దొరకడం చాలా కష్టం. ఇక్క డుండుట కవసరంలేదు. మనవాళ్ళంతా ఆపని చక్కబెట్టుకుంటారు. అని నీతో చెప్పి నిన్న యింటిలో పద్మాబాయి ఉందో లేదో చూచి రమ్మను

మని అన్నారు నడుపు-వేగం పడవ' అని యనురాగ దృష్టులతో ననెను.

'ఇదేమిటి ! నువ్వెవరు ?' ఎవరున్నారు ?

'నేనా, ఈ దుర్మార్గులు నన్ను ఊరిలోనుండి బలవంతా న్ని-చెప్పుతాను నడుపుతూవుండు పడవ. వారి తొందరకూ నీ ను స్త్రీకీ సరిపోయింది. ఒక్క నిమిష టాలస్యమంటే, ప్రాణాలు పోయా యన్న మాటే.'

తోడనే వానికి నమ్మకము కుదిరినది. పడవ నడుపుచు 'ఏమిటీ-బలవంతాన్ని నిన్ను తెచ్చారూ?' అత డనెను.

'మరేమిటి ? న న్నల్లరపెట్టబోతూఉంటే నేను నా నా సాధ్యమైనట్టు గాకొట్టుకుంటున్నాను. ఇంతలో మనవాళ్లంతా వచ్చి మీదపడ్డారు. ఆ తొందరలో ఆ గరిమీసాలవాడు న న్నొదిలీశాడు వాళ్ళు చాలామంది ఉన్నారు, కాబట్టే మరెవ రినైనా పంపుదా మనే చూచారు మరి వీలులేకపోయింది. అప్పుడు నా ప్రాణాలూ, నా మానమూ, కాచినందుకు నేనేమి చెయ్యాలి అని అడిగినాను, ఇలాగ నీతో చెప్పి, పోయి, చూచి మళ్ళీ వార్త తెచ్చిపెట్టుమని బ్రతిమాలినారు. ఇదెంతపని అని యిలాగ యీదుకుని వచ్చినాను. వెళ్ళనీయి-వెళ్ళనీయి పడవ.'

'అలాగా పాపం నువ్వింతరాత్రి ఎంత గొప్పకార్యం చేశావు. చాల సాహసమైనపని. నీ పుట్టుపూర్వాలు కొంచెం చెప్పకూడదూ ? పాపం నిన్ను ఆదుర్మార్గులు పట్టుకున్నారేం!'

'ఏమడిగారు ? మీలాంటి కనికరస్తులకు అంత అలాగ వుంటుంది కాని ఆ బుగ్గమీసాల వెధవల కలా వుంటుందా చెప్పండి !

'పోనీగాని నీ పుట్టుపూర్వా లేఁవిటి ?' అని యా పడవను గాచుకొని యున్నవాఁడు అడిగెను. పడవ పోవుచుండెను.

'నా పుట్టుపూర్వాలా ?' అని యేదో కొంత గాథ చెప్పి తుదకు, 'ఏ మడుగుతారు మహా కష్టాలుపడి ఆఖరికి ఆ మహానుభావుఁడు అరీందమ్ బాబుగారి దయవల్ల సుఖంగా కాపరం చేసుకుంటూ ఈవూళ్ళోనే ఉన్నాను.' అనేవరికి 'ఏమేమి, మా బాబుగారివల్లనే ?' అని యాపడవమీఁదివాఁడనెను.

ఆశ్చర్యముతో నను నట్లు 'ఇప్పు డాబోటువారు నుమీదికి మొదట వచ్చినాయన అరీందమ్ బాబుగారేనా ? అదెవరో అనుకున్నాను ! మాటలు, ఆకారం పట్టి అలాగే అనుకున్నాను; గాని వేషం పోల్చుకో లేకపోయాను, ఎంత గమ్మత్తుగా మారిపోయారు. అమ్మా నాయనా ! నన్ను ఆబాబు పోల్చుకునే ఉంటారు అనుకుంటాను.' అని యనుచు నిపుడు తాను పడవ వలకలి నందునుండి క్రిందికి త్రోసివేసిన యాతఁడు అరీందమ్ యే యని తన వాక్చాతుర్యశక్తివలన యెదుటివానిచే స్థిరపరచుకొని, యానందంబుననో యనునటుల నాతని చేతులు పట్టుకొని ముఖమున నద్దుకొని ముద్దిడి సంతోష సూచన లనేకముల

మోహావేశమునసో యన చూచుచు, మీ పేరేమిటండీ? ' అని యా నారీ శిరోమణి యడిగెను.

'నాపేరా-జతీందర్ (జతీంద్రబాబు) అంటారు. జత్తీ యని కూడ వాడుక.'

అంత నామె చిర్నగవుతో తనలో నన్ను పట్టుటకు శపథముచేసిన దేవేంద్రనాద్ పోయి ఈ జడ్జి (జత్తీ) బాబు వచ్చాడా అని యనుకొని ప్రకాశముగా, "హమ్మా, నాయనా, మీరా? అదెవడో యనుకొనే మాట్లాడేస్తున్నాను. ఎంత బాగా మారిపోగలరండీ మీరున్నూ-ఏదీ ముఖము" అని దగ్గరకుబోయి, తన దేహమున వాని నంటుచున్నది.

ఓ జత్తీ—ఓ జడ్జీ—సిన్నిప్పుడు స్పృశించుచున్నది. నిన్ను మోహింపజేయుచున్నది. ఆ వ్యామోహంబున బడుచున్నావు. స్వామికార్యంబును మరచుచున్నావు. తెలియకనే ద్రోహి వగుచున్నావు. నీకును దేవేంద్రునకును భేదము లేదు. (1) నౌకాయాత్రలో, తన భర్తకు (2) రోగము గుదుర్చుటకే యనుమినతో జామీరాలియా యను నా మోహానాకార కృతింబగు వ్యామోహంబను కారాగారంబున బడలేదు గాని సంపూర్ణంబుగ నోడిపోయినాడు- అట్టియాతడు యిప్పుడీయూర లేకున్నను వానికి బదులుగవచ్చిన నీవు నిజముగ జడ్జివాడవే. వలదునుమా! వలదు — దేహస్పర్శమట —

మోహమట—కాదు కాదు—మోసము సుమా! పరస్పర కర స్పర్శ నానందము నొందుచున్నావు—ఔరౌరా! మోహాన దేవత మోసపు దేవతయై, నీ నెత్తినెక్కి తాండవ మాడుచుండ నీవణ్మాత్రమును సంశయము లేకయే లోనగు చున్నావు—అనుభవింపగలవు-అయ్యో! పాపము! స్త్రీలోలత!! సిగ్గు!!!

ఆమె వాని దేహము స్పృశించి వానిముఖ మట్టె చూచుచు ఆలోచనములలో నేమియున్నదో గాని, తన ముఖచంద్ర కాంతులచే, నాతని మానస శశికాంతమును నాకాంత యాకర్షించి సంపూర్ణముగఁ దనకు వశంవదునిగ నొనర్చెను

ఏలాగునైన నేమి-ఈలాగున లోకాభి రామాయణము కొంత, కొంతమంచి, చెడ్డకొంత, మాటలాడుకొనుచు, మెల్లన నొడ్డుచేరి పడవ నట నుంచివేసి యిర్వురును మార్గముపట్టిరి. పోయిపోయి జతీంద్రు డొక్క-సారి నిలబడిపోయి ' మీ యి ల్లెక్కడ? ' అని యామె నడిగెను.

' అదేమిటవి, ఆలాగున నడుగుచున్నారు! మీయింటికి నాల్గవ గుమ్మమే మాది.'

'ఎటుప్రక్క ?'

'కుడిచేతివైపు.'

'అంటే బానూగారి యిల్లా ?'

'మరేం బానూగారు మా మేనమామగారు.'

'నీ పేరో ?'

'ఈపాటి పోల్చుకోలేకపోయారూ? నావొళ్లేనావేరు.'

'అంటే నాకు బోధపడలేదు.'

'వర్ణా-ఇంతభోగట్టా చేస్తున్నారేమిటి?' అని ముసి ముసి నగవుల నాతని మాననము నాకర్షించి వర్ణ తన భుజము నాతని భుజమున సోకఁజేసి నాతని బుద్ధికి మాంద్యము నొనగూర్చి, తన యాజ్ఞల మెలఁగఁజేసికొని, యిరువురును గలిసి పోవుచున్నారు. ఆ జత్తీబాబు జడ్డీ యానందమునకు పారము లేక పొంగి పొర్లి యుబికి వచ్చుచున్నది.

ఇక్కడ పడవలో నున్న వారందఱును జిక్కిరి. ఎదిరించుటకు ప్రయత్నములుగూడ లేవు. కాని వీరెంత వెదకినను గోపాల్‌చందు కానరాలేదు. ఎంతపిలచినను నాతఁడు వినిపించుకొనఁజాలకుండెను.

ఇంతలో నా సుందరి వెనుక, సీట దుమికిన వాఁడు, బహు ప్రయాసముతో నీదుకొని మరలివచ్చి పడవనెక్కి 'అబ్బా! ఏఁమైందో మరి తెలిసిందికాదు. ఇదిమాత్రం దొరికిందినాకు.' అని యొక చీరను వారిముందర పడవైచి తానొకచోట నొరగిపడిపోయెను. అందఱును పరిపరివిధముల నాలోచించుచు దగిన నిశ్చయము నందఁజాలక తుద కచ్చట కట్టులతో పడియున్న వారలనడిగిరి వారందఱును మాకు తెలియదనియే చెప్పిరిగాని యొక్కఁడును ఇదమిత్థమనరైరి. నిరూపక పక్షమువారలకు కోపము మెండుగాఁ 'ఉండర్రా! ఉండర్రా!!

యిప్పుడు మీకిలాగ తెలుస్తుంది—రేవు నాలుగు కుండా పోట్లు తగిల్తేనేగాని ఏదీ చెప్పరు—అప్పుడే అన్నీ బయలు పడతాయి.'

'అలాగయితేనేగాని నిజమిప్పుడు చెప్తారనుకున్నావోయ్!' 'ఈళ్ళు చెప్పకపోతేమాత్రం తెల్దనుకున్నారుగావాల!' అని యనేకరీతుల వారలలో వా రుపన్యసింపఁజొచ్చిరి. ఇంతలో బడవ లోపలిభాగమునుండి ధన్ ధన్ అని నాలుఁగు గుండు చప్పుడులు వినవచ్చెను. ఇదేమని నివ్వెరపాటుతో నచటి నిరూపకపక్షమువా రందఱును పరుగిడి యెన్నిదిక్కుల జూచినను లోనికేగుటకు మార్గము కానరాలేదు. పరికించి చూడఁగా నాచప్పుడు భూగర్భములోనుండి వెలువడినదా యని తోచుచుండెను. ఎవ్వరినడిగినను నేరు నెఱుంగమనియే చెప్పిరి.

ఇంక మించిపోయెనని కొందరు బలవంతముగ నొకచోటి పలకల రెంటిని నూడదీసి 'కోన్హాయ్—ఉదర్' (ఎవరక్కడ) అని యఱచిరి. 'నేనోయ్—కింకర్!' అని ప్రతిధ్వని బలహీనముగ నైనను వినవచ్చెను.

'మాష్టరుగా రిందులోనే ఉన్నారు! ఇప్పుడు మేము విన్న సంగీతం ఎవరిది?'

'ఇదిగో ఎవడోనాలాగే ఇందులో పడీగూడా నామీదకే కత్తిగట్టాడు—వాడొక రెండుముచ్చటలు నేనొక రెండు ముద్దులు—అంతే.'

'ఈపాటి పోల్చుకోలేకపోయారూ ? నావాళ్లేహావేరు.'

'అంటే నాకు బోధపడలేదు '

'స్వర్ణా-ఇంతభోగట్టా చేస్తున్నారేమిటి ?' అని ముసి ముసి నగవుల నాతని మానసము నాకర్షించి స్వర్ణ తన భుజము నాతని భుజమున సోకఁజేసి నాతని బుద్ధికి మాంద్యము నొన గూర్చి, తన యాజ్ఞల మెలఁగఁజేసికొని, యిరువురును గలిసి పోవుచున్నారు ఆ జట్టీబాబు జడ్డి యానందమునకు పారము లేక పొంగి పొర్లి యుబికి వచ్చుచున్నది.

ఇక్కడ పడవలో నున్న వారందఱును జిక్కిరి. ఎదిరించుటకు ప్రయత్నములుగూడ లేవు. కాని వీరెంత వెదకినను గోపాల్‌చంద్రు కానరాలేదు. ఎంతపిలచినను నాతఁడు వినిపించుకొనఁజాలకుండెను.

ఇంతలో నా సుందరి వెనుక, సీట దుమికిన వాఁడు, బహు ప్రయాసముతో నీదుకొని మరలివచ్చి పడవనెక్కి 'అబ్బా! ఏఁవైందో మరి తెలిసిందికాదు. ఇదిమాత్రం దొరికిందినాకు.' అని యొక చీరను వారిముందర పడవైచి తానొక చోట నొరగిపడిపోయెను. అందఱును పరిపరివిధముల నాలోచించుచు దగిన నిశ్చయము నందఁజాలక తుద కచ్చట కట్టులతో పడియున్న వారలనడిగిరి వారందఱును మాకు తెలియదనియే చెప్పిరిగాని యొక్కడును ఇదమిద్ధమనరైరి. నిరూపక పక్షమువారలకు కోపము మెండుగాగ 'ఉండర్రా! ఉండర్రా!!

యిప్పుడు మీకెలాగ తెలుస్తుంది—రేపు నాలుగు కుండా పోట్లు తగిల్తేనేగాని ఏదీ చెప్పరు—అప్పుడే అన్నీ బయలు పడతాయి.' ×

'అలాగయితేనేగాని నిజమిప్పుడు చెప్పతారనుకున్నావోయ్ !' 'ఈళ్ళు చెప్పకపోతేమాత్రం తెల్దనుకున్నారుగావాల!' అని యనేకరీతుల వారలలో వా రుపన్యసింపఁజొచ్చిరి. ఇంతలో బడవ లోపలిభాగమునుండి ధన్ ధన్ అని నాలుఁగు గుండు చప్పుడులు వినవచ్చెను. ఇదేమని నివ్వెరపాటుతో నచటి నిరూపకపక్షమువా రందఱును పరుగిడి యెన్నిదిక్కుల జూచినను లోనికేగుటకు మార్గము కానరాలేదు. పరికించి చూడఁగా నాచప్పుడు భూగర్భములోనుండి వెలువడినదా యని తోచుచుండెను. ఎవ్వరినడిగినను నేరు నెఱుంగమనియే చెప్పిరి.

ఇంక మించిపోయెనని కొందరు బలవంతముగ నొకచోటి పలకల రెంటి నూడఁదీసి 'కోన్హాయ్—ఉదర్' (ఎవరక్కడ) అని యఱచిరి. 'నేనోయ్—కింకర్ !' అని ప్రతిధ్వని బలహీనముగ నైనను వినవచ్చెను.

'మాష్టరుగా రిందులోనే ఉన్నారు ? ఇప్పుడు మేము విన్న సంగీతం ఎవరిది ?'

'ఇదిగో ఎవడోనాలాగే ఇందులో పడీగూడా నామీదకే కత్తి గట్టాడు—వాడొక రెండుముచ్చటలు నేనొక రెండు ముద్దులు—అంతే.'

'మరేమైనా రంగు రంగులా మీాకు ?'

'నీదయవల్ల ఒక్కదెబ్బకూడా తగలేదు; గాని మీాద నెలాగున్నాది ?'

'రండి చూద్దురుగాని' అనివాండొక త్రాటిని విడువ దానినాధారముగ చేసికొని గోపాల్‌చందు వెలుపలుకి వచ్చి నంత, 'మాష్టర్, నాకళ్ళుతిరుగుచున్నవి' అని కింకర్ అనెను తోడనే, 'ఆం—సరే బోధపడినది. ఆపలకలు మళ్ళీ మెప్పట్లగ మూాసెయ్ తక్షణం ఇది విషపు పొగదెబ్బ. ఇదిగో కింకర్, ఈటోపీ—మనకు ఆనాడు దొరకిన నిక్షేపం' అని వానికా టోపీనిచ్చి శైత్యోపచారములు చేయుచుండెను. ఇంకను కింకరునకు విషచిహ్నములు బాగుగపోలేదు గోపాల్ చందు, తాను క్రిందబడినది మొదలు జరిగిన సంగతులన్నియు నడిగి తెలుసుకొనుచుండెను.

ఒకకాంత యట్లు పారిపోయినదనియు నామెచీర మాత్రము దొరకినదనియు వినినంత నీతండు, 'ఛీ! ఎంత పనై పోయింది! తప్పించేసుకుందన్నమాట ఇంత ప్రయత్నం చేసిన్నీ లాభంలేకపోయిందే! సరే కానీ కింకర నీకు ఒంట్లో యేలాగుంది? ఆపొగలో నన్ను పడవేసి చంపెయ్యాలనే అనుకున్నారునుమా ఆమూర్ఖులు—ఆటోపీవల్లనే నేను కొంతవరకు బ్రతగ్గలిగినాను—కాని యేదీ ఆచీర దానివలన మరేమైనా బోధపడునేమోచూదాం' అని దానిని పుచ్చుకుని యెంతో ప్రయత్నము చేసిచూచెనుగాని తగినఫలమున్నట్లు కనిపించ

లేదు. సరే, బాగానేఉంది ఇప్పుడుమనం ఏంచేస్తే బాగుం టుంది ? మరెవరైనా తోడూనీడా ఉన్నారంటావా కింకర్ ?'

'తోడు రావాలంటే ఈపాటికప్పుడే వచ్చివుండాలికదా?'

'ఇంకా తోడేమిటోయ్. వెర్రిమాట్లాడుతున్నావు— విను—ఇప్పుడు ఆడవేషంతో తప్పించుకొని పోయి ఊరక యుందునా ? ఏదో తగినపని చేసేవుండాలి. మఱొక గడియ నేవు యిక్కడే వుందాం — ఏదో ఆవచ్చేవాళ్ళను గూడా జాగ్రత్తగా ఉంచుకోవడానికి వీలుంటుంది.'

'అలాగయితే—ఈకళేబరాలన్నీ మనదగ్గ రెందుకు ? ఠాణాకుపంపించేస్తేనే బాగుంటుం దనుకుంటాను — నువ్వేమి టంటావ్—కింకర్ ?'

'మాస్టరుగారి ఆలోచనకూడా బాగున్నది. అదుగో విన్నావుగదా ? ఆసింగుగాడు ఇన్నికట్లతో గూడా దొరుకొని ఎక్కడకో వెళ్ళడానికి ప్రయత్నం చేస్తూవున్నాడని. కాబట్టి యీలాంటి ప్రాణాలు యీ నీటికిబలికాకుండా, మనఠాణాలో ఉంచేస్తే, నిజం నిలకడమీద తెలుసుకోవడానికి వీలుంటుంది.'

'అయితే ఈ పడవమీదనే మనముండి యీమొద్దుల నావడవమీద పంపుదామా ?'

'మాస్టరుగారి యిష్టమే—ఆపడవమీద వాళ్ళను పంప డమే మంచిది. ఎలాగయినా పాతిజాగా పాతే; క్రొత్తది కొత్తే ఇక్కడాడిం ట్టక్కడాడ్డానికి వీలవుతుందా ?'

'అచ్ఛా—ఆ పడవను రమ్మను.

'ఆపడవను రమ్మను' అని చంద్ అనినతోడనే కింకరు డొక వెలుఁగు నాదిక్కునఁ బర్వజేసెను. కాని యాశ్చర్యము! ఆపడవలేదు. ఏమిరా యిది! యని మరల మరల చూచి, 'క్యాం దిస్తానై' (ఏమి కనిపించదు) అనెను.

'ఊలవెయ్-చూదాము.' అని గోపాలచందనెను. కింక రుఁడూదెను. చెవులు మూతలు బడెను. కాని ప్రత్యుత్తరము లేదు. 'జనాబ్ బి నహీం హాయ్.' అని ఓరే; ఎవడైనా యీదు కొనివెళ్ళండి, నిద్రపోతున్నాడో లేక యేడొంకల్లో పెట్టే శాడో—వెళ్ళండి, వెళ్ళండి— జల్దీ—' అని కింకరుఁడు వురి కొల్పెను. ఇంతలో గోపాల్ చంద్ చాలు—చాలోయ్. ఆప్రయ త్నం—ఏఁవిటోయ్. జత్తీ బాబూ అంత పనికిమాలిన వాడను కున్నావా?—ఏదో దగాజరిగింది. ఆపారిపోయినవాడి దెబ్బే యిది. బలేరే, బాబూ ! చాలా సంతోషించవలసిన కార్యమే. జత్తీబాబులేడు. ఇక్కడున్నుంచి ఒకడు తప్పించుకొని పారిపోయి నాడు. ఏఁవిటి, దీనికర్థం?'

'మరింకా అర్థమేమిటి?'

'అంతే? గాకూడదు? సరే యేదోచూదాం రా! బోటు నొదులు.' అని గోపాల్ చందు చెప్పి, తన యాలోచనా సము ద్రమున మునిఁగిపోయి, యీప్రపంచమును గానకుండెను. బోటు గూడ నత్యంత శీఘ్రగమనంబున చంద్పల్ ఘాటు దగ్గర చేరి

నంత కింకర్ మరలనూలవేసెను. బదులురాలేదు. 'మేష్టర్ మనము వుచ్చుకున్న బోటు ఇక్కడే వుంది కాని జత్తీబాబు అందులో లేదు జబాబున్నూ రాలేదు.' అని బిగ్గరగా ననెను. ఉలికిపడి లేచి గోపాల్ చందు. 'హాన్నా! ఇప్పుడు మోసము నిజమే—తెరో, కింకర్. నువ్వున్నూ మఱి ముగ్గురున్నూ కలిసి ఆవేళ మోటారుబండి నందులోని ముసలివాడి యింటికి వెళ్ళి జాగ్రత్తగా యుండవలెనుసుమీ. క్రైము చాలా ప్రమాదించేటట్టున్నాది. అబ్బీ ఒరే! నువ్వలాగ వెళ్తూనే ఠాణానుండి జవానులను పంపుమీ. మరచిపోగలవు. అప్పటివరకున్నూ నేను యిక్కడనే ఉంటాను.' అని వారిని పంపివేసి, బోటంతయు కలయఁజూచి జతీంద్రుడు లేడని నిర్ధారణచేసికొని, చౌధరివచ్చి నవిడప ఆర్ద్రోవాలను వాని కప్పగించి తాను మెల మెల్లఁగ నటనుండి బాసి గృహోన్ముఖముగ నడువసాగెను.

వడివడిగ నడచుచుండెనేగాని వాని మనసుమాత్రము మిక్కిలి బరువుగ నుండి వానికిఁ జాల యాయాసము గలుగఁ జేయుచుండెను. 'పట్టిమూర్ఖులలాగ పారిపోతున్న ఆ యాడు దానివంటిదాన్ని పట్టిఉంచక దిక్కులుచూస్తూ ఊరకున్నారు. వాడెవడోగాని ఇంక బోటుమీదవుండడం చాలకష్టమున్నూ, ప్రమాదకరమున్నూ అని నిశ్చయించుకొని యిలాంటి యెత్తు యెత్తినాడు. చాలా మంచి యెత్తే. ఇంత ప్రయత్నమున్నూ వ్యర్థము చేసివేసినాడు—కాక ఇది స్త్రీయేయగునా? భానోజీ

గాడేడీ? కానీ, కానీ, ఈకథ ఏమున్నందుకి తెలుస్తుంది కాని యిప్పుడు యీపడినవాడు ఆజ్ఞ లేనిదీ యిక్కడికెలాగ ఐతేం దర్ తీసుకొని వెళ్ళిపోవచ్చాడా! ఏదో మోసము జరిగే వుంటుంది.' అని విచారించుచు పోవుచుండెను. గమనము మాత్ర మతి మందగించెను

ఠాణానుండి వచ్చిన రక్షకభటులు కట్లులతోనున్న యందఱను దీసుకొనిపోయి యొక్కొక్కని కొక్కొక్కగది. చొప్పున భద్రపఱచుటచే చౌధరీ యనుసాతడు శీఘ్రగమనం బున నక్కడనుండికదలి గోపాల్ చంద్రునకు కొంచెము వెనుకనే నడచుచుండెను చౌధరి వెనుకనున్నాడనుమాట గోపాలచంద్రు నకు తెలియదు ఇరువురును గోపాలచంద్రు యింటికే పునకే పోవుచుండిరి.

---

## పదవ ప్రకరణము

---

### అదిలీకి బదిలీ

అట్లు పోయిపోయి గుమ్మమునకు నాలుగడుగుల దూర ములో గోపాలచంద్రున్నప్పుడు లోపలనుండి కొంతచప్పుడు వినవచ్చెను 'హాన్నా! అనుకున్నంతపనీ అయితీరింది కాబో లు!' అని తలుపుతట్టునరికి యెవరును పలుకరైరి; కాని

తలుపు తనంతతాను మెల్లఁగ తెఱచికొనెను. 'ఏమిది! తలుపు తీసియుండుటకు కారణమేమి?' యని జేబుదీపమును పట్టి చూచునంత నొకమూల నొక్క కళేబరము గోపాలచంద్రునకుఁ గానవచ్చెను.

'ఏ క్యాహోయ్ బాబూ?' అని యింతలో చౌధర్ దగ్గరకు వచ్చి యడిగెను.

'నువ్వుగూడా వచ్చావ్? మంచిపనే చేశావు. ఇలాగరా—చూదాం' అని వానితో నాకళేబరమునకుఁ గొంతదూరమున నిలిచి చక్కఁగ చూచునరికి—అయ్యో, ఆశరీరము మన జతీంద్ర బాబూ (సబ్ ఇనస్పెక్టరు) గారిదే!

'ఓహో! ఇదేమి!!' అని చింతించి, 'జత్రీ! జత్రీ' అని యెంతలేపినను వానికి చైతన్యము రాకుండెను. తోడనే విషసంబంధమేమో యని తన టోపీని దీసి వాని శరీరమున నునిచి చౌధర్ జాగ్రత్త యని చెప్పి, యొక్కపరుగున లోపలికిఁ బోయి పద్మాబాయి—మనలక్ష్మిబాయిని తానుంచిన గది దగ్గరకుఁబోయి చూచునరికి లక్ష్మిబాయి యాయింటలేదు. కుమారుఁడు కానరాడు 'హాన్నా! ఎంతపని!' యని యనుకొని లోపలఁ బ్రవేశించి నంత నిల్లంతయు దొమ్మిచేసినట్లుఁ గానుపించెను. 'ఇదేమి! ఇలాటిదొమ్మికిఁ గారణమేమిటి' అని మరిరెండు గదులు చూడ సంచు తానుండు గదియందు సైతము పట్టి చిన్నెలు విశేషముగ గానవచ్చెను తనవస్తువు లన్నియు

వరిగనున్నవో లేవో యని చూచుకొని, 'నూ్నా! ఇప్పటికే చిక్కుగా నున్న దనుకొంటిని గాని, ఈ యొక్క రాత్రి చిక్కంతా బహు చిత్రంగా పెరిగిపోయింది. మనభోగట్టా ఎంతవరకు ఈ నోపిడిగానికి తెలిసిందో! ఎంతవరకు మనము జాగ్రత్తగా నుండవలెనో గూడ మనకు తెలియదు! ఏమేమిభోగట్టాలు తీసుకున్నాడో—అసలు పద్మా నెక్కడకు తీసుకొనిపోయి నాడో, ఏమిచేయుటకు ఊహించుకొన్నాడో-ఏమీ తెలియదు—ఇట్టియవస్థలో జత్తీ చూ డెలాగ మొద్దులాగ పడున్నాడో. తెలివితేటలు గలవాడేగాని ఇది సమయ మౌనా కాదా యని చూచేబాపతు కాదు మాజత్తీది అనాడు, ఆవూల్ సాహేబు కాలమునాడు, నాకుసహాయముదొఁకిన దేవేంద్రుడే సరి—ఈ నాటికీ జతీంద్రుడే సరి' అని చింతించుచు నొకకుర్చీపైఁ బడి యైదు పది నిముసములు దీర్ఘాలోచనలో మునిగి యుండెను.

ఇక్కడ చౌధర్ నీళ్ళకై లోపలకుఁ బోయెనేగాని, నీరము నిచ్చువారెవరు? ఏమియో గృహాంతయు నిర్మానుష్యకంబుగా నున్నట్లే తోఁచుచుండెను—'అరే! ఏమిట్రాయిది! ఒకబంట్రోతున్నా కనిపించడు-ఆచావట్లో జత్తీ బాబు అలాగున్నాడు. అంతా చిత్రంగానే ఉంది! ఒక్క రాత్రి కొక్క రాత్రే అంతా పెనుప్రళయంలాగ పెరిగిపోయింది.' అని యనుకొనుచు లోపలకుఁబోయి తానే యిన్ని నీళ్ళు తెచ్చెను. ఈ నీటితోడ శైత్యోపచారములు చేయుచు పాపము జతీంద్ర బాబుగారి విరహతాపము చల్లార్చుచుండిరి.

ఓ విరహమా, ఎంతపనిచేసినావు? ఓపరస్త్రీ వాంఛా పరత్వమా, ఎంతటి స్వామిద్రోహ మొనర్చినావు! ఓ మోహమా, ఎంతమోసము చేసినావు! ఓకామమా, ఒక్కరాత్రి నీ వలన నెన్ని చిక్కులు సంభవింపఁ జేసినావు!—ఓ జతీంద్రా! మోహమునబడి, తొలుత మోహనమూర్తియొక్క దేహస్పర్శ సుఖము, అనంతరము పరస్పర కరస్పర్శనానందమును, పొంది తుదకు నేలయే సెజ్జగాఁ బవ్వళించితివి! నీకు వచ్చునదియు, పెరవారికి వచ్చునదియుఁ గానకుంటివి! కన్నులుమూతపడినవి! బుద్ధికి మాంద్యము ఘటిల్లినది! అయ్యయ్యో, ఎంతపని చేసితివి! నిరూపకాధ్యక్షుని సర్వప్రయత్నములును మంటఁగలిపి, యెన్నో చిక్కులు గల్పించితివి! నీవొక్కఁడవు నిలుకడగలమానసము గలవాఁడవేయయినచో గోపాల్‌చందున కింతవిచారమును, నీకింతమోసమును, నీకిట్టిపాటును సంభవింపక పోయి యుండునుకదా!

విరహతాపోపశమ నార్థమెంతపని చేసినను ప్రయోజనము విశేషముగ నున్నట్లుకానరాలేదు. ఇంతలో చౌధర్ పోయి చేరువ నున్నయొక వైద్యునిఁ దీసుకవచ్చి సబ్ ఇన్స్పెక్టరుగారి కాతని నప్పగించెను.

ఇంతలో గోపాల్‌చందుబయటకురాగా 'ఏమండోయ్, ఏమిటీచిత్రం?' అని వైద్యుఁడడిగెను.

'అదేమో, నాకూ తెలియదు నేనున్నూ యిప్పుడే చూచాను. ఏదైనా మంచిపిరుగు వుంటే జల్దీ యిప్పించండి ఇది విషముదెబ్బ అనే నే ననుకుంటాను. నాడిచూడండి కొంచెము మందముగా నున్నను చక్కగా నేయున్నట్టున్నది.' అనిగోపాల్ చందు ధైర్యముగా మాట్లాడెను.

ఏదియో మందీయఁబడెను వైద్యుడును చౌధరీయును ఆచావడియందే యుండిరి. గోపాల్ చందు మరల లోనికిఁ బోయెను. ఈసారి నిశ్శబ్దముగా వెదకుటమాని బిగ్గరగా సేవకుల పేళ్లుపెట్టి పిలుచుచు నొక్కొక్కగది కడకును బోయి చూచు చుండెను.

అంతలో నొక్కకొట్టునుండికొంచెమలుకుడు వినవయ్యెను. శీఘ్రముగ గోపాల్ చం దటకుఁబోవుచుండ నందు పద్మా బాయి (లక్ష్మీబాయి) దాసీవేషముతో ముందుకు వచ్చి 'మీరేనా! ఇంకా ఇంవాకటినందడే కాబోలు ననుకున్నాను. పోనీబాబూ, మీరు నాకంటికి కనిపించారు అంతేచాలు. ఇంట్లో యింకాయేమైనా అల్లరలు జరిగాయేమో చూడండి నాయనా నీతి ఆవఁటుయింట్లో నుంటుది' అనుచు తానే దారిచూపుచుండెను. గోపాలచందున కానందము మించెను. పోనిమ్ము, ఏది యేమైననేమి; పద్మ క్షేమముగ నున్నది. తన ప్రయత్నములకును తనశ్రమలకును అవరోధము కలుగలేదు.

‘కుమార్ ఏడీ?’ అని యాతఁడు ప్రశ్నించెను. ‘అదేమిటి?’ అని లక్ష్మీబాయి (పద్మాబాయి) యాకొట్టుప బడవైచిన యొక మంచము రెండు కోళ్ళనకును గట్టిన దుప్పటమును చూపెను. దానియందు నిశ్చింతముగా కుమారుఁడు నిదురించుచున్నాఁడు.

‘సరే, కాగితా లెక్కడుంచావు?’

‘బలే! నీకున్నపాటిబుద్ధి మాజత్రిబాబుకుంటే ఎంతో బాగుండును.’

‘అదేమి టలా గంటున్నారు? మరేమైనా ప్రమాదం జరిగిందా యేమిటి? అబ్బా! మీా సంఘా అంతా అదోక లా గుంటుం దండీ. గభీమని పెద్దపులినోట్లోనికే గెంతుతా మం టారు. అబ్బబ్బా! గుండెలు బద్దలవుతాయి బాబూ!’

‘ఔనుమరి. గుండెలూ బద్దలుకాక, తలలూ పగలక, ఎలాగ యీదొంగలతో వేగడం? సరే! నువ్వు జాగ్రత్తగా ఉండు. ఇప్పుడే వస్తాను.’

‘మళ్లీ ప్రయాణమేనా ఏమిటి? అబ్బా! నన్ని పెద్ద దెయ్యామంత యింట్లో పడేసి, మీారేమి టలాగ చక్కర్లు కొడుతూ యుంటారు. ఉదయం ‘హా’ వుచ్చుకొని వెళ్ళ వచ్చునులెండి నిషాకరణంగా మిమ్మల్నిందులోదింపి, యెంతో శ్రమపెట్టుచున్నాను’ అనుచు పాపమాపద్మ తలవంచుకొనుచు నిలువఁబడిపోయెను.

'సరిపోయింది ఇది మరీ బాగుంది. నిష్కారణంగా మాజట్టి బాబుగాల్ల నీకింత శ్రమ కలిగిందిగదా యని నే నను కుంటూ ఉండగా నువ్వేమాటో నాకు శ్రమ కలుగఁజేసినానని నిందించుకుంటూ విచారిస్తున్నావేమి ? మొట్టమొదటనీచాలక్ అంతా ఏమయిపోయింది ? ఇన్నాళ్ళున్నూ యీ దుర్మార్గుల చేతుల్లో పడకుండా తప్పించుకుంటూ వుండే నీ చమత్కార ప్రవర్తనంఅంతా ఇవ్వాడే మూలడేపశావు ? నీవంటిబుద్ధిసూక్ష్మత గలదానిని నేను చూచినందుకు సంతోషిస్తూవుంటే ఈవిచార మెందుకమ్మా నీకు ? చాలుచాల్లే !' అని గోపాల్ చందు మందలింప నా సుందరాంగి, 'నిజమే నన్ను చూచుకుంటే నాకే ఒకలాగుంటుంది. ఇన్నాళ్ళూ ఎంత, ఎలాంటి, కార్య మైనా భయంలేకుండా చేసేదాన్ని. ఇప్పుడు అదేంచిత్రమో గాని మీరీ కేసులో చెయ్యిపెట్టిన దగ్గరనుంచిన్నీ, నాకెక్కడ లేని భయమున్నూ పట్టుకుంది. దీనికంతటికీ కారణం యేమిటో బాగా బోధపడడం లేదు' అనేను.

'చూడు బాగాఆలోచించు అదికూడా నువ్వేచెప్పాలి.'

'ఒక్కటేకారణంలాగ కనుపడుతూంది. ఇన్నాళ్లున్నూ ఈదుర్మార్గుల కన్నా నేనే తెలివైన దాన్నని నే ననుకుంటూ వుండేదాన్ని. అందుచేత ఒకలాంటి ధైర్యం ఉండేది—ఇప్పు డో నాకంటెకి మహాపురుషుల్లాగ మీరు కనబడ్డారు. నేనూ,

నా తెలివి—మీయెదుట ఒకదమ్మిడీకైనా పనికిరాదనిబోధ పడ్డాది. అందుచేతనే యీఅధైర్యము యింత బలీయంగా వుంది. పోనీ యీఅధైర్యం అయినా నాప్రాణాన్నిగూర్చిగాని, ఈ కుమారసింగును గూర్చిగాని, నాకాగితాలు, ఆ స్త్రినిగూర్చి గాని అయితే బాగానే ఉండును. అదీకాదు. అదృష్టహీను రాలనగు నా కేసులో ఇంత తెలివి తేటలుగల మిమ్ములను పెట్టి మీ రెన్నెన్నో బాధలు పడుచుండగా చూడవలసి వచ్చునేమో అనేభయంమాత్రం జోరుగావుంది పోనీ ఈసోదంతా యెందుకుగాని, ఇప్పుడు మనయింట్లోకి వచ్చిన వాళ్ళెవరు? ఆ జట్టేనా ?'

'ఇంకా సందేహామే! ఆజట్టు కాకుంటే మరో జట్టుకింత సాహసమూ ?'

'అలాగే అనుకున్నాను అనుకున్నానేమిటి? ఒకప్రాణాన్నిలాగే ఉండునుగాని, ఎంతమందొచ్చారో? ఒకడ్నికొట్టేసరికి ఎంతమందొచ్చి మీదపడతారో, అన్న అనుమానం చేత, మరి నే నేమీ చేయలేదు. చక్కగా ఒకటి రెండు బలులకు సరిగా సరిపడేటట్టున్నాది నారివాల్వరు. కాని ఆ అనుమానం ఒకటి తినేస్తున్నాది. అందుచేతనే ఊరుకున్నాను. మీగదిలోని కాగితా లేమైనాయో చూచుకున్నారా? వాళ్ళు వచ్చినందు కట్టే లాభం పొందివుండరు లెండి.'

'ఎంతమందో కాలేదు. అలా గెంతోమంది వచ్చినట్టయితే, నువ్వూ, నీ కాగితాల్వారూ, ఎందుకూ పనికిరాక పోయే ఉందురు-ఒక్కరే వచ్చారు కాగితా లన్నీ చూచుకున్నాను. వచ్చినందుకు కొంతలాభంతోనే వెళ్ళిపోయినారు వరే మించి పోయిం దేమిటి? నువ్వూ, నీపిల్లకూ, నీకాగితాలు, భద్రంగా వున్నారుకదా!'

'అదొక మాటా?'

'అయితే నే నిప్పుడే వస్తాను.'

'అదిగో, మళ్ళీ అదేమాటా-మీరేమిచేశారో, ఆసంగతి ఇంతైనా చెప్పరుకదా; ఎప్పుడున్నూ ఇదిగోవస్తాను అని చెప్పడానికే వస్తారు.'

'అలాకాదు. మాజత్తీబాబుగారు కొంచెము స్తీగా ఉన్నారు వారికి తగిన యేర్పాటులు చెయ్యాలా' అనుకొనుచు గోపాల్‌చందు తిరిగిపోవుచుండ గాలికొక్క కాగిత మెగురుచు వచ్చి వానికాలికి దగిలెను. అ దేమి యగునో యని తీసి చూడ నందు చక్కని యక్షరములతో పట్టి వ్రాసినట్లు కన బడుచు నిట్లుుండెను.

మీగదిలో,
రాత్రి 1—30 గంటలు
మీకే!

అయ్యా,

ఇల్లు పెద్దది! పెద్ద మొద్దు!!
ప్రాణమొక్కటి! పూచినది మిక్కుటము!

లాభము లేదు
(అనగా చాలినంత)

ముసలిదాసీ ముచ్చట్లకును } చెల్లు
ముద్దరాలి మురిపెములకును }

ఐనను కొంచెము బాకీ ఉండిపోయినది.
ఋణమున నుండు వారుందురా?
శీఘ్రముగ సంకల్పసిద్ధియు సిద్ధము.
సంతకము.

తా. క:—(క. తా)

బోధపడకపోయిన, చావడిలోని జతీంద్రనాద్ బోస్ బానూన్ ఎన్. ఐ. గారి నడిగిన సంతయుం దేట తెల్లమగును.

అని చదువుకొనినంత గోపాల్ చంను చిన్న నవ్వునవ్వెను.

తోడనే పద్మాబాయి, 'ఏమి టలా నవ్వుతున్నారు?' అని యడుగ 'ఇదిగో చూడవమ్మా' అని యాచీటి నిచ్చెను. పద్మాబాయి చదువుకొని 'మీకు బోధపడ్డదా' అని యడిగెను.

'అందులో బోధపడడాని కేముంది? అదిలీకి బదిలీ చేశానని సంతోషించుకుంటూ వ్రాసిన ఉత్తరం'

'ఎవరికి?'

'నాకే'

'ఆ ముసలిదానీ సంగతులున్నాయికదా; వాళ్లు పోల్చుకున్నారన్నమాటేనా? లాభం ఏమిటి చాలినంత అంటే?'

'నీయిష్టం. మనకంటే మనకే అది సరిపోతుంది. వాళ్ళకంటే వాళ్ళకే సరిపోతుంది. మన శ్రమను విచారించి నంత లాభం లేదుకదా. ఈవెధవ యెవడో తప్పించుకున్నాడు. మళ్లీ చీమలపుట్ట తయారుచేస్తాడు. వాళ్ళకంటే—ఇంత శ్రమతో ఇక్కడికివచ్చిగూడా నిన్నుగాని నీకాగితాలుగాని సంగ్రహించుకో లేకపోయాడు. ఏవో నాగదిలో బల్లమీద కాగితాలు నాలుగు చూచుంటాడు. మరేవో చిన్న వస్తువులు తీసుకొనుంటాడు. కాబట్టే చాలినంతలాభం లేదంటున్నాడు.'

'ప్రాణమొక్కటి పని మిక్కుటం' అంటే నాకు యేమీ బోధపడలేదు. మీకు తెలిసినదా?'

అదీ అంతే మనకైతే మన అర్థం వాళ్ళకైతే వాళ్ళ అర్థం. మనకే ఐతే నేనొక్కడిని. పని అనేకులైన యీ దుర్మార్గులను పట్టడం. జాగ్రత్త యీపనిలో నీ ఒక్కడిప్రాణము తీసివేయడం చాలా సులువుసుమా అనడం వాళ్ళకంటే—నేనొక్కడ్నే ఇక్కడకు వచ్చాను. కాబట్టి బాగా వెతికి పద్మా

బాయిని తీసుకొని పోవడానికి గాని మరే పెద్దపనిని చేయడానికి గాని వీలు లేకపోయింది అని—తెలిసిందా?'

'మరుండిపోయిన బాకీ యేమిటి?'

'కాదూ మరి. ఈవేళరాత్రి వాళ్ళు నాలాగ అల్లరపెట్టడం బాకీ కాదూ. దానికేదో చేస్తాడని అనుకుంటున్నాడు?'

'అది వాళ్ళర్థం. మరి మనకు గూడా అందరిని పట్టుకున్నారు గాని కొంతమంది మిగిలిపోయినారు సుమా అని చెప్పడం కూడా అనుకుంటాను.'

'బాగా అన్నావు నేనా అర్థం ఉందని అనుకోనేలేదు. అలాగే శీఘ్రంగా సిద్ధి. మీకైతే మీకు, మాకైతే మాకు, అనే.'

'అయితే తెలియకపోతే జతీంద్ర బాబుగారి నడగమన్నాడేమిటి?'

'అదా? ముద్దరాలి మురిపెము లెలాంటివో, వాడెలాగ టోపీపడ్డాడో, ఈదెబ్బ ఎలాగ తిన్నాడో, సంగతంతా తెలుసుకో అని వుద్దేశము.'

'ఐతే మన జత్తీబాబు సుస్తీఅంతా వీళ్ళదెబ్బే? అడిగారా సంగతేమిటో?'

'నే నడుగుతానూ? అడిగితేమాత్రం యేముఖము పెట్టుకొని చెప్పగలడు. అతని నైజమంతా ఒకలాంటిది. ఈ

సంగతి మరి యెవరితోనూ చెప్పడు. తానే ఏదో ఆలోచించు కుంటాడు అట్టే బాధపెడితే చెప్పుతాడు గాని అద్దైనా పై పై నే చెప్పుతాడు. అని చెప్పి తానా చీటిని పట్టుకొని పోయెను.

---

## పదునొకండవ ప్రకరణము

---

### దెబ్బమీఁద దెబ్బ

జతీంద్రబాబు తేరిపోయెను. ద్రోహులు ఠాణాలో భద్రముగ నున్నారు. గోపాలచందు మఱికొన్ని ప్రయత్నము లను చేసి, బసలుమార్చి, ఇక్కడిదక్కడనుంచి, అక్కడిదిక్కడ బెట్టి, యనేకరీతుల నప్రమత్తుఁడై తానుండుటయేకాక ఠాణా వారి నందఱను జాగరూకులై యుండ నియోగించి, జతీబాబు దగ్గరకుఁ బోయి, సంభాషణలో దించి; యావద్వృత్తాంతము ను సంగ్రహించుకొనెను. తినవేరు నాయుపని యెఱింగించె నన గానే గోపాలచందు గారికి మతిభ్రమించెను. తోడనే తోట లోపలకుఁ బోయి యొక గింటవఱకు ననే కాలోచనలలోఁ బడి ఆనాడు పూల్సాహేబునే దనవేర విలానము చేయఁబడి పో లీసు స్టేషనునకే పంపబడిన యొక మృత కళేబరము-యావన కాంతది-గల పెట్టె చరిత్రము జ్ఞప్తికి రావేగమే, యేమి నిశ్చ

యించుకొనెనో గాని తిరిగివచ్చి 'జగ్గీబాబూ, నువ్వెలాగ పడిపోయావోయ్. చెప్పుమూ?' అని యడిగెను.

'పోనిస్తురూ! అది నన్ను చెప్పమంటారేమిటి? మళ్ళీ వచ్చి చెప్పుతాను.' అని లేచిపోవుచుండ గోపాలచందు వాని చెక్కలుబట్టి కూర్చుండఁ బెట్టి:—

'చాలు లేవయ్యా, నీసిగ్గు! మొఖము తిరిగిపోయినట్టు లెంపకాయ తినికూడా కొంచెమూ బుద్ధిలేకపోతే ఎలాగ చావడం. అదేదో చక్కగా తెలియాలా వద్దా. నీకడుపులోనే ఉంచుకుంటే కార్యం ఎలాగౌతా యనుకున్నావు. సిగ్గూ బిడియమున్నూ! యీసిగ్గప్పుడుండి, 'అన్నా, నావనిలోనుంచి ఎలాగ పోతాను' అని ఆలోచిస్తే ఎంతబాగుండును? చెప్పు చెప్పు. నీ సిగ్గుచూచుకుంటే మళ్ళీ మేముగూడా ఇలాంటిదెబ్బ తినవలసి వస్తుంది. మూతో ఒకడుతింటే చాలదా యేమి? అని గద్దించి పలుకు నరికి:

'అబ్బే. ఏమీలేదు. ఇక్కడికి రాఁగానే అబ్బా; అలిసి పోయాను-మళ్ళీ రావుడా అనుకొని అక్కడికి పోవలసిందేనా? పాపమువాళ్లు మనకోసం ఎదురుచూస్తుంటా' రన్నాది. అనే సరికి పోసీ ఇక్కడ మనము కూర్చుందామా గడినేవు బంట్రోతులనుపంపి యని నేనని మీకుఁ గబురుచెప్పుకుని పంపాను. ఆలాగ కూర్చోని బాతాకానీ ఆరంభించాము. అంతలో

చాలా చలేస్తున్నా దని నాదగ్గరికి వచ్చి నాచేతులు పట్టుకున్నాది.'

'ఆఁహా! మరేముంది? నువ్వూ గుమ్మయిపోయే ఉంటావు'

'అదుగో అలా అంటారనే నే నేమీ చెప్పనంటాను.'

'పోనీ-పోనీ అలా గననులే చెప్పు చెప్పూ'

'ఎలాగయితే నేమి నేను సిగరెట్టు కాలుస్తూవుంటే నా చేతిలోనుంచి తీసుకున్నాది. తాను కొంచెము కాల్చింది. తిరిగి నాకిచ్చివేశింది. నేనది కాల్చి పారేసినాను. నాదగ్గరే కూర్చొని ఆ కబుర్లూ చెప్పుతూవుంటే నాకు ఆగని నిద్ర వచ్చింది. తరువా తేమైందో నాకు తెలియదు.'

'తరువాతేమైంది? అంతా అనుభవమే. అంత సరసము భోంచేసిన తరువాత అనుభవం కాక మరేమిటవుతుంది-ఏ మయిందో అట. ఏమయిందో! ఆఁ' అని గోపాలచందు గొణుగు కొనుచుఁ బోయెను.

పాపము జతీంద్రబాబు తాను చేసిన తెలివి తక్కువ కార్యమునకు విచారించుకొనుచు, వైద్యుడు చెప్పినరీతిని మంచముపైఁ బరుండి ఇందుల కేలాగుననైన ప్రతీకారము చేయవలయు నని మనసున నిర్ధారణ చేసికొనుచుండెను. ఆ దినమున మరి యేమియు విశేషములు లేకయే సాయంకాల మైనది. యథారీతి నందఱును ఠాణాలో వారివారి కార్యము

లను చేసికొనుచున్నారు రాత్రి పదిగంట లయినది; ఠాణాలో గాచుచున్న యిద్దరు రక్షకభటులును నొక సబిన్స్పెక్టరుమాత్ర ముండి మిగుల జాగ్రత్తతో నిద్రపోక మెలఁగుచుండిరి.

పలువురు పరుగున వచ్చి 'ఏమోయ్ కానిస్టేబిలును సబిన్స్పెక్టరుగా రున్నారా?' అని ప్రశ్నించుచు ఠాణాలోఁ బ్రవేశించిరి. 'ఎవరువా' రని లోపలనుండి సబిన్స్పెక్టరుగారు పైకి వచ్చిరి.

'బాబూ, దండాలు. అదిగో బారా బజారు వీధిలోనే కూనీ జరుగుతున్నాది, బాబూ. మే మెందరం చెప్పినా వినకుండున్నాడు. కనిస్టేబిల్సుగూడా చాలకుండున్నారు అదంతా ఒక జట్టు—పెద్దజట్టు. తమతో మనవిచేయుమని కానిస్టేబులంతా మమ్మల్ని పంపారు బాబూ.'

'ఎక్క డెక్కడ ?'

'రాధాబజారుకి తిన్నగపందుండే ఆ సందులో బాబూ. వేగం దయచేయుండి, వాళ్ళ పొగరు చాలా జోరుగానున్నాది. ఏం కనిస్టేబుల్లంటే వెంట్రుకల్లాగ చూస్తున్నారు. బాబూ.'

'సరే! 304 నెంబరు! ఎంతమందున్నారోయ్ వవారా?'

'బాబూ ఇద్దరం'

'ఏ మిద్దరే ఉన్నారు? జాగ్రత్తసుమా, నే నిప్పుడే వస్తాను.'

'చిత్తం బాబూ వెళ్ళండి. మరి గడి సేపటికి ఇనస్పెక్టరుగారు కూడా వస్తారు.'

నబ్ యిన్స్పెక్టరుగారు వీధిలోనికి వారితోఁ గలిసి పోయినారు. పోవుచు 'ఇన్స్పెక్టరుగారితో చెప్తారా?' అని ప్రశ్నించెను.

'లేదు బాబూ చెప్పను సెలవైతే ఇలాగే వెళ్ళి కొప్పి తీసుకొస్తాం.'

'చెప్పండి—ఎందుకన్నా మంచిది'

'చిత్తం' అని కొందఱు వెనుకబడిరి. నబిన్స్పెక్టరుగారు వారి బైసికిలుమీఁద పోవుచుండిరి.

ఇక్కడ, రాణాలో నబియిన్స్పెక్టరుగారు వెళ్ళినారు. కొంచెము వుషారుగా వుండాలోయ్ అనుకొనుచు నీకనిస్టేబు లుండగా వీరిదగ్గర కిద్దరువచ్చి చప్పుడు లేకుండునట్లు వారి నోరులనుమూసి గుడ్డలుగ్రుక్కి కాలుచేతులు కట్టి భద్రపఱచు చుండ మఱి యిద్దరు తాళములతోఁ గారాగారములను తెఱచి వారివారి నందరిని పైకితీసుకొని వచ్చుచుండిరి. వెలుపలకు వచ్చి, యదే నందని చెరియొకదారి నొక్కొక్కరుడు బట్టి పోవుచుండిరి. ఖైదీలుగాచేయఁబడిన నిన్నటి ద్రోహులందరు ను చక్కగ పైన బడినారిలు. పాపము మన గోపాలచందుగారి ప్రయత్నము లన్నియు నీతీరున వ్యర్థము లాయెనుగదా!

అటుల విడివడిన ద్రోహులందఱు నొకచోట—వారి సంకేతస్థానమున జేరి యేమియోజించుకొనిరో కాని యొక్క సారిగ నేటియుదయము జతీంద్రబాబు పడియుఁడిన భవనము

దిక్కునఁ బోయిపోయి యట కుసికి పాట్లుపడుచుండు నొక్కని కిక్కురు మననీయక కట్టివైచి లోనఁ బ్రవేశించిరి దాదాపు పండ్రెండు గంటలు కొట్టు కాలమాయెను. ఎందుచూచినను నిశ్శబ్దమే యుండెను. చెవ్రులు బీటలుంవారుపట్లు ఝిల్లీరవము మాత్రము వినవచ్చుచుండెను. గాలి, బోరున వీచుచుండెను. మెలమెల్లన గొందఱు వెలుపలనుంచి, కొందఱు లోపలికేగి గృహమును పరీక్షించుచుండ, నొక్కపెట్టున లోగిలి లోని పెద్దతలుపు దబ్బున పడిపోయెను. గాలిచే నని వా రెవరును దానిని గమనింపక, వారి కార్యములకా చప్పుడువలన నేమైన విఘ్నము కలుగునోయని యొక్కింత తడవు గోడల నంటుకొని పోయి, యట్టిదేదియు సంభవింపక పోవుట చేత తిరుగ వారి పనులను చూచుకొనుచుండిరి ఒక రిద్దరు గోపాల్‌చం దుండు గదికిని, కొందరు వంటశాలలకును, మరికొందఱు ప్రక్కగదు లకును యథేచ్ఛముగఁ బోయి పరిశీలించుచున్నారు. ఎందునైన నొక్కజీవియుఁ గానరాలేదు పోనీ మనుష్యులు లేకున్న వస్తువు లేమైన దొరకునేమో యని యెంతప్రయత్నించినను పాపము వారికి చిత్తుకాగితములు, వార్తాపత్రికలు, చింకిగుడ్డలును, దప్ప మంచిది యనఁదగిన దొక్కటియైనఁ గానరాలేదు.

అన్నా, మనకు మించిపోయినాడ్రా యీ డిటెక్టివ్వని అనుకొనుచు వెలుపలికివచ్చుటకుఁ బ్రయత్నముచేయుచుండ నా తలుపు వారి స్వాధీనముకాక యుండెను. పాప మా కారాగా

రమునుండి తప్పించుకొని యీ బందిఖానాలో పడ్డారు. ఎన్ని ప్రయత్నములు చేసినను కార్యము లేకుండెను. ఎంత యఱచినను వెలుపలివారలు బదులియ్యకయే యున్నారు. ఇదికాదు మార్గమని యొక్కఁడు మెల్ల మెల్లగ నింటికప్పునకెగఁబ్రాకి వెలుపలకువచ్చి తెలుపు దీయవలయునని పాపము శ్రమతో ఎక్కి మీఁదకురాగా, గభీమని గుండుచప్పుడును దభీమని మనుష్యుఁడు పడినచప్పుడును వినవచ్చెను. 'అన్నా చిక్కిపోయినారమే' అని అనుకొని యేమి చేయుటకును వీలుగాక యొకరి మొగము నొకరు చూచుకొనుచుండిరి.

'పైనున్న యెదవలంతా ఏటి చేస్తున్నారో మొద్దుల్లాగ మనకు పాలుపా రియ్యొద్దూ? నంతి. ఇంత నంతతో ఏవనైనా బాగుపడ్డాదా. అదీకాక మంచివాళ్ళంతా ఒకడితరవాత ఒకడు డిక్రీగొట్టగా ఈయెదవలంతా మిగిలిపోయినారు. ఎందుకూ పనికిరారు.' అని వారిలో నొకఁడుమాత్రము నిగుల వినుఁగు నందుచుండెను. ఉండి యుండి ఒకొక్కఁడింటికప్పుపై తలనెత్తి చూచునంతకి మఱొక్కఁడను డి గుండు వచ్చుచుండెనో 'ధన్' అని సరిగ వచ్చి వానిని తాకి దబ్బున నేలబడునటుల చేసెను. ఇంక మార్గమేమి యని వారిలో వారాలోచించుకొనుచుండ నొక యూహకలిగి యెదుగు రొక్కసారి యింటికప్పుపై నొక్క క్షణముననే తలఁజూపిరి. ఇటులనైన నొక్కఁడుదప్పినఁ బ్రాణములు జిక్కుంగదాయని పాప

మువారు చింతించిరి. కానివారియూహాకు తగిన ప్రతియూహా వెలుపలి వారలకునుం గూడయుండెను. కావున నైదు తలలు కానవచ్చుటయు నైదుగుండ్లుగురుటయు నైదు కళేబరములు వడవడి క్రిందఁబడుటయు నొక్కసారి సంభవించి యత్యంతా శ్చర్య జనకంబుగ నుండెను. ఇంక 'యన్యథా శరణంనాస్తి' యని యటనుండి పోవుటయేమేలని మారుప్రయత్నము మాని వారందు సుఖజీవనమును చేయుచు చక్కగ నిద్రనందు చుండిరి.

తెల్లవారెను. తలుపులు తెఱచికొని కొందఱు లోపలఁ బ్రవేశించునప్పటికి వీరందఱును శవములవలెఁ బడియుండిరి. ఇంక భద్రపరచుట యొక్క కష్టమా? తాణాకుతీసుకొని పోయి వారివారి యథాస్థానముల వారినునిచి, గోపాలచందు ఆఫీసులో ప్రవేశించునంత, నొక్కఁడు వడివడిగ నొక్కబండిపై నొకశవ మును వైచుకొనివచ్చి 'బాబో మహాఘోరం జరిగిపోయింది. తక్షణం ఏదైనా చికిత్స చేస్తేనేగాని మన సబిన స్పెక్టరు గారు బ్రతుకుట చాలాకష్టం. చూడండి. చూడండి' అని యాశరీరము ను బల్లపై దించెను. చైతన్యమేమియు లేదు.

అబ్బా! దెబ్బమీాద దెబ్బ! నిశ్చయముగా వీళ్ళతో సాహసించడం చాలాకష్టమే. ఈ రాత్రి అంతా ఆయింటి దగ్గరే సంతజరుగుతుందనుకున్నాను గాని యిక్కడకూడ అంత ర్నాటక మొకటవుతుందనుకోలేదు. ఒకొక్కక్కడికి ఒకొక్క

తడాఖా కనిపిస్తున్నాది ఆహా! ఈచరిత్రఅంతా మళ్ళీఫూలాన్ హేబునే జ్ఞాపకం తెస్తున్నాది. ఈ ఆవేశం జామీలియా అమ్మాయి గాబోలును. ఆ పాలు, ఆచీటీలు, ఆ తడాఖాలమూస్తరు, ఆమాదిరంతా వాళ్ళదే, తప్పకుండా అదేయిది. త్రాచుపాము పడుండ! అది సులభంగా ఊరుకొనేదీకాదు. చిక్కవలసి వస్తుందేమో అనే ఆహాహసంచేసి సీటిలో పడ్డాది ఆలా పడినందుకు పశ్చా పనిచేసింది. అయితే భానోజీ గా డెవడు? హారే బాబూ! దేవిపూర్ యెస్టేటుకే ఎసరు పెట్టడానికి చూస్తున్నాది. చూస్తున్నా దేమిటి? పెట్టింది! ఎసరు పెట్టింది! పెట్టింది!! ఈభానోజీగాడు నాకనుమానంగానే యున్నాది ఆ గులాబ్ సింగో? ఇంకా అనుమానాలను స్థిరపర్చడానికి అవకాశము చాలినంత భోగట్టా చిక్కకుండా ఉంది ఇక మీదచర్య ఎలాగుంటుందో!' అని తనలో తాననుకొనుచు 'ఏతద్వ్యాక్ష్యము' నంతయు మఱచి యుండెను.

'చిత్రం. గుప్తాగారిని పిలవమంటారాయేటి? ఏదో వేగం చెయ్యకపోతే ప్రమాదం వస్తుంది ఏమంటారు?' అని యాతడనినంత 'ఆఁ పిలవండి పిలవకపోతే మన మేమిచేయగలము' అని తననోరు మాత్రము జవాబు చెప్పెను.

# పెద్దపులి గుహ

చిత్రము! గోపాలచందను పేరున కలకత్తా నగరములో నిరూపకుఁడుగానున్న యాతఁడు నిజముగ అరిందమ్ అని యాయువతి (సాహసంబున బాగ్లీనది నాఁ నిశీధ సమయంబున నీది జతీంద్రబాబూ జానూన్‌నకు శృంగభంగమును గలుగఁ జేసిన సుందరాంగి)—ఆ యువతి మానసములో నిశ్చయించుకొనుచుండ, నాయుబలా రూపమున నింతచిక్కులఁ బెట్టుచున్న ధీర జుమిలియా యే యని గోపాలచంద్రుఁడు లోలోన నిర్ధారణ చేసికొనుచున్నాడు

'అహా! ఏమి యీయాశ్చర్యం! తిరిగీ ఈ అరిందమ్‌తో నే ముఖాముఖి చేయి కలపవలసి వచ్చింది? దీనిలో నేదో ఒక గూఢార్థము తప్పక ఉండును. నా చేతులలో వాని ప్రాణమో, కాక వానిచేతులలో నా ప్రాణమో, పోవడానికి దేవుడు వ్రాశాడు. తప్పదు. లేకపోయిన యెడల ఇలా గెందు కవుతుంది? ఈ దేశమే విడిచిపెట్టి బొంబాయిలో నగన పనులు చేసికొని బ్రతుకుదామని వెళ్ళిపోయి. అరిందమ్ మళ్ళీ ఇక్కడ దాపరించడమేమిటి? అతనికి మహారాష్ట్ర భాష అన్నా, మరాఠీ దేశమన్నా, మహా అభిమానం. ఎప్పుడు చూచినా *కేసరిపత్రికే చదివేవాడు గాని మరేదైనా చూచేవాడా? అంటేవాడా!

ఇంత అభిమానం ఉండికూడా ? మళ్ళీఎందుకొచ్చాడో యిక్క-
డికి ? నాకోసమే గాబోలు ! ఏదో ఈ దెబ్బతో సరి ! నేనో
అతనో—నిజం. పోనీ—ఇది. రెండిందాలా నాకే లాభకారిగా
ఉంది. నే నతని చేతుల్లో పోయినా తగినవాడి చేతిలో చావు
అపజయమైనా నేను పొందడానికి తగినవాడను. అలాకా-
కుండా నేనే అతన్ని బుట్టలో వేశానా జండాఎత్తినా నన్న
మాటే ! పూల్సాహేబు ఋణం తీర్చేశానన్న మాటే ఆహా !
అణాలు పైసలతో ఫైసల్ చేశానన్నమాటే. ఎటుచూచినా
మంచిదే ! కాని ఒక్కటిమాత్రం బాధిస్తూఉంది. ఇతనే ఈ
ఊళ్లో ఉన్నాడంటే నాదికొంచెం జాగ్రత్తగా ఉండి ఉందును.
జాగ్రత్తేమిటి ? ఇంతవేగ మీా దేవీపూాదు సంగతిలో చెయ్యి
పెట్టకుండానే ఉందును. మించిపోయింది. మహాచక్కగా మభ్య
పర్చాడుకదా. ఊరిలో ఎక్కడచూచినా అతనిపేరేలేదు ఎవరి
నడిగినా ఏవో పుల్లయ్యల పేరులే చెప్పుతారుగాని, ఇతనిపేరే
ఎత్తరు కొంచెము తొందర పడిపోయినాను. తొందరేమిటి—
ఈ అనుమానమే నాకు లేకపోయింది. అతని అభిమానాలూ,
వర్ణాలు తెలిసిన తరవాత ఆయన బొంబాయి వెళ్ళిపోయినాడంటే
ఎవరు నమ్మరు ? అలాగే నమ్మాను. అంతేకాక మాపూల్సాహే
బున్నప్పుడుగూడా యితన్ని గురించి మాట్లాడుకుంటున్నప్పుడు
ఇతను ఈఊరిలో ఉంటే అంతగారాణించడు. బొంబాయి
లాంటిచోట ఇతనికి ఈలాగ బ్రహ్మరథం పట్టవలసిందే అని

అనేకసార్లు పొగుడుతూ ఉండడంచేత ఈమాట వినగానే నా కొక్క రవ్వంతైనా అనుమానం కలగలేదు హమ్మో నాయనా! అసాధ్యుడు. తానిక్కడున్నాడంటే ఆకార్యాలు చెలరేగవనిన్నీ, అందుచేత వాళ్ళని పట్టుకోవడానికి చాలాకాలం పడుతుందనిన్నీ, బాగా ఆలోచించి ఇలాగ నటిస్తూవుంటాడు. నిజంగా వాళ్ళ ఆటలన్నీ ఎప్పుడూ ఇంతజోరుగా సాగలేదని కాలూరాయిచెప్పాడు. ఈవేళో రేపో వాళ్ళమీద పడతాడు. తెంచేస్తాడు ఆభోగట్టా కాగితాలే అవన్నీ—అదే ఎవడ్రా యింతనేర్పు ఇంత చాకచక్యం ఇంత ధైర్యంతో పనిచేసేవాడీవూరులో అని చూతుమా? ఆమాటలరకం, ఆపన్నాగాలూ, అన్నీ పాతవే; లేకపోతే జట్టీబాబువంటి మొద్దులే కదూ యీ పోలీసులో! అనాడు దేవేంద్రుని బ్రతుకేమయినది? చావుతప్పి కన్నులొట్టపోయింది ఇతడో; మహాగడును వాడు. చూడూ ఎలాగ ఎంత గుండెలుతీసిన పనో—మాబోటు మీదికేవచ్చి మావాళ్ళనే పట్టుకున్నాడు, ఇంకేమికావాలి! గడునువాడు-వాడుమ్ కానీ కానీ ఇక నెన్నాళ్లు యీ గడుసుతనం, ఈపెంకితనమున్నూ, ఏదో తెలియలేదు కాబట్టి అలాగయింది ఇప్పుడు తెలిసిందికదా. ఇకను వాని తరమా? చూదాం. ఇంకా నా తడఖాల జోరు. ఆమొఖం తిరగడం బాగా తెలియలేదు. ఈవేళ తెలుస్తుంది ఈవెధవలు నేను చెప్పినపని చక్కగా చెప్పినట్లే చేశారంటే మరి గడియకో ఈ

చేతిలో ఆ అసీందమ్, ఆ పద్మాబాయీ, ఆ కాగితాలూ, ఆ దేవీపూరూ, ఉన్నాయన్నమాటే. దీని కంతటికీ కరీమ్ నేను చెప్పినట్లు చెయ్యాలి. నిన్ననే నేను తొంభైతొమ్మిది వంతులు చేసేసుంచాను. ఒంటిలో చూస్తే అలిసిపోయి దమ్మిడీ సత్తువ లేదు. తోడు చూస్తే ఒక్క పిట్టలేదు ఇల్లంటే పెద్దపులినోరు. ఏమాత్రం కాపుదారీగా లేకున్నా గభీసుంటుం దని అనుకో వలసినదే. అందుచేతనే చేతికి దొరికినంతా చక్కబెట్టు కున్నాను. ఇప్పుడు మించిపోయిం దేమిటి ? ఈవేళ మరొక్క గంటకంతా చక్కంగా తెలుస్తుంది చెప్పిన మూడూ కాక పోయినా ఒకటో రెండో తప్పకుండా చేస్తారు. అది నమ్మకో వలసినదే తరువాత మాత్రం పెద్దత్తేనో ఒక్క పెట్టాలి. తుట్ట తుదకు నాకార్యం ఫలించి సమయానికి సరిగ్గా యీ తురకజట్టే తగులుకుంది. ఏదైతే 'తప్పించుకొందాం కొంతకాలమైనా' అని నే ననుకొని ఇన్నాళ్ళు ఊరుకున్నానో, తిన్నగా అదే సంభవించినది ! ఏలాగు దొరికాడో ఇతను పద్మాబాయికి ? ఆ పడుచుముండ సరిగ్గా ఇతన్నే పట్టాలీ ? పట్టింది—పట్టింది—చింతకొమ్మే పట్టింది. చింతకొమ్మయినా సరే ఉక్కుకొమ్మైనా సరే—యీ రంపానికి నిలవగలదా ? అని మాటిమాటికిని గడియారమును చూచుచు, నాలోచనలు పరంగించుచుం 'నే మిది ! ఇంకను నొక్క వారమైన రా' దని విసుగుకొనుచు నాయువతి, జమీలియా త్రాచుపాము, నిదురరాక యొంక భవనమున నిటునటు ప్రచారము చేయుచుండెను.

నిన్న జతీంద్రబాబు పంటివారి సైతము చూపులను, నాకార విభ్రమముల వలనను, గానసమును వశం బొనర్చి, వానిపై సర్వాధికారమును జేసినాఁడి గా సుందరాంగి నే డెట్టి చోట నున్నదో వ్రాయుకుంటిని దగమగదా ! ఈరీతి నిటునటు బోనున జిక్కిన వ్యాఘ్రము చందమున నీపై దిరుగుచుండిన భవనము, కలకత్తా నగరంబునకే శిల్పా శస్త్ర్యాన జొప్పు బాలును, పాడుపడియున్నది ఈ గృహంబును గట్టించు నాతండెంతయో యోచించి, తగు శిల్పులను రావించి, విశాల ప్రదేశంబున నొక మహా భవనమును గట్టించునప్పుడు, క్రిందియంతస్తులయు పూర్తియాయి పైయంతస్తులు బనులు మొదలిడువరి కొకభాగ మకారణంబుగ శిథిలమై పడిపోయెను. మిక్కిటంబుగ వగచి మరల నా పడినభాగము నెత్తించి యథారీతిని పైయంతస్తు గట్టుచుండ మరియొక్క భాగము విరిగి నేలఁగూలెను. ఏమిరా దైవమా యని మరల పునః ప్రయత్న మొనర్చుచుండ పాపమా గృహస్థుని పెద్దకుమారుఁ డిరువది యయిదు వత్సరంబులవాఁడు సర్వలక్షణ సమోపేతుఁ డూరక యాకస్మిక మరణంబు నొందెను. అట్లగుటచే గొంతకాల మట్టులనే యుండి మరల నిర్మాణంబు నారంభించునంత పాప మా యజమానియే పరలోకగతుం డయ్యెను. ఇం దర్థమున్నను లేకపోయినను, ఇది కాకతాళీయ మన్నను, పరస్పరసంబద్ధ మన్నను, మనకు సరికావచ్చునే గాని, యా యింటివారలకు మాత్రము మా యింటి జోశ్యమన్న నింటికి వినాశ మనుట యని రూఢిమా

యెను. కావునఁ బెద్దకాలమునుండి యీ నగము కట్టిన యిల్లు ట్టులనే యుండెను. ఇతరులుకూడ నిట్టి పూర్వచరిత్ర గల యింటి నంటుటకుఁ గాని ముట్టుటకుఁ గాని చూచుచుఁ జూచుచు సాహసింపకుండిరి. రానురా నా యువంపూర్ణ గృహము దయ్య ముల కావాస మనియు, మఱికొన్నినాళ్ళ కా గృహంబున దయ్యము లనేక చిత్రములను చేయుచుండు ననియుఁ, బ్రతీతి యొకటి కలిగెను. అందువలన నెవ్వరును నాత్రట్టు చూచుట మానుకొనిరి. కాన, నా యిల్లంతయు ముండ్లతుప్పలు, నెముక లు మొదలుగాఁ గల వస్తువులతో నిండిపోయి యుండెను. ఎవరైన హిందువు లా దిక్కున నొక్కరిద్దరు కొంచెము చీఁక టిని పోవలసి వచ్చెనేని, కాళీమాయి ప్రార్థనయో; ఆంజనేయ దండకమునో, బిగ్గరగఁ బఠింపకుండఁ బోవుట యుండదని నిరాఘాటముగఁ జెప్పవచ్చును.

ఆయిల్లు నేటికి మన జమీాలియాకాంత కునికిపట్టయ్యె ను. ఆ ముండ్లనడుమనే కొంత ప్రదేశమును శుభ్రముఁ జేసి కొని, యందుఁ దాని హంతక బృందముతోఁ గార్యాలోచన చేయుచుండును. పురుగు లను భయము గాని, పాము లను భీతిగాని, దయ్యము లను వెఱపుగాని, యీ క్రూరులకు లేదు. ఊహించి చూచిన నా జంతువులే వీ రున్నారుగదా యని, వారి విషములకును, వారి కార్యములకును, నడలుగొని పారి పోయి యుండును. అహా! ఆ సుందరిని జూచి యీమందిర

మును జూడకున్న నామె హృదయము నెట్లు తెలిసికొన నగును! అబల; సుందరి; సుకుమారి; నవ యౌవ్వనాంగి; ఒంటరి; యా భయానక భూత ప్రేత పిశాచ నివాసార్హ మగు నా మందిరం బున నుంటయా! ఇంక నామెకార్యము లెట్టులుండును ?

దూరమున రెండు, మూడు గంటలు కొట్టుచుండుట వినుచుండెను. కంటికి నిద్దుర రాకుండెను. తాను నియోగించిన కార్యములు సఫలములాయెనో, విఫలము లాయెనో, తెలుపు టకుఁ గూడ నొక్కఁడైనను రాకుండెను. ఎన్నియోసారు లుండజాలక వీధినిబడి తానే స్వయముగాఁ జూడవలయు నని యుంకించుచుండెను. కాని, తా నచ్చోట లేనప్పుడు తనవారలు వృత్తాంతంబులఁ దెచ్చినచో కష్టముగ నుండునని యాగు చుండెను. తప్పక యొక్కొక్కటి నేఁ జెప్పిన కార్యములు నెఱ వేరక పోయిన యెడల నీపాటికే ప్రయత్నమంతయు వ్యర్థ మాయె నను వార్తయైన రాకయుండునా యని సంతసమును దెచ్చుకొనుచుండును. ఆయూహ మనస్సున నల్లుకొనుచుండ ‘ఈపాటికి పోలీసు స్టేషనునుంచి విడిపించి ఉంటారు.’ ‘ఈ పాటికి త్రోవలో ఆ పోలీసువాణ్ని చిదగ మొత్తుంటారు.’ ‘ఈపాటికి అరిందం ఇంటిలో ప్రవేశించుంటారు.’ ‘ఈ పాటికి ఆ పడుచుముండ పద్మాబాయినీ, ఆకాయితాలనీ పట్టుకొని వస్తూవుంటారు.’ అని యప్పుడప్పు డనుకొనుచు, ‘నాలెక్కను ఈపాటికి రావలసిందికదా: యేల రాకున్నా’రని చింతించుచు,

మరియొకసారి విఘ్నములను గూర్చియు నీరీతినే యాలోచించు చుండును. 'అసలు పోలీసు స్టేషన్‌లో వీళ్ళమాటే నమ్మలేదు కాబోలు.' 'ఏమో రాత్రి ఖైదుక్కవగా ఉండిఉంటారా?' 'మన కొచ్చిన భోగట్టా అంతా తప్పేమో!' 'విడిపించడానికి వీలు కాలేదా?' 'అక్కడ అరిందం మన మనుకొన్న దానికన్నా చాలా జాగ్రత్తగా ఉన్నాడా?' అని నిముషమున కొక రీతిని విచారించు కొనుచుండెను.

ఆ మానసము ఊహ్యమేకాని వర్ణనీయము కాదుగదా!

ఇంతలో నొక్కరుండు పడిపడి వచ్చి యామె యెదుట నిలువ, ఉదత్తరమున 'కాయా, పండా?' అని యామె యడిగెను. అందులకు వాడు 'ఏల్నొడు అనుకోవడంన్నా, కాయ అవడంన్నానా' అని జదులుపలికెను.

'ఆఁ హో! నరే, ఏమిటయిందో చక్కగా చెప్పగలవా?'

'చిత్తంబాబూ చెప్పలేకపోవడానికి ఏముందినాయనా?'

'పోలీసు ఠాణాలోనుంచి అందర్నీ విడిపించారా?'

'చిత్తం బాబూ.'

'మీరు వెళ్ళేనరి కెవరున్నారా స్టేషన్లో?'

'చిత్తం బాబయ్యా, అల్లా కుర్రోడు. కొంచెం నూదిగా ముక్కుంటాదీ, అతను, కొత్తగా వొచ్చాడు బాబూ ఇతను.'

'ఆఁహో, మంగళ్ళె నంరా?'

'ఔను గావాల నాయనా? ఏల్నొ రెరగరా ఏంటి'

'ఆఁ, ఆఁ, అతనే అయిఉంటాడు. బారా బజారికిబయ ల్దేరాడురా?'

'సిత్తం. మనోళ్ళమాట ఇనేసరికి అట్టే బయస్కాల్ మీదపడి గబగబ తొక్కుకొని పోతూడు. ఎందా కెల్లగల్లు అదుగో, ఆనందు తిరిగేసరికే అయిపోయింది. అయ్యాగాడి సోకంతా.'

'ఏమిటి చంపేశారా ఏమిటి—కొంపదీసి?'

ఆహా ఏమి, యీమె యౌదార్యము! ఏరి నయినను చంప నిచ్ఛింపకున్నది!!

'నేదు బాబూ, సంపాలా! ఆ ఒంటిపేక మనిషివి, నాలుగు కుందాపోట్లుతో సైమ కాలవలో పడి ఊరుకున్నాడు ఎప్పుడూగూడా దొంగలకయినా, అతను అలాంటి కుందాపోట్లు కొట్టిఉండడు. మాబాగా తగిలాయట, మనో లేటినేశారో ఏలోన్నిరికి మనపనేసాసబాబూ. ఆడి బైస్కాలుగూడా ఆడి పక్కనే ఉంచి ఒక నీటీమీద—

'బారా బజార్లో ఏముంది?

మూర్ఖుడా!

పాంబజారు త్రోవలో చూచుకో!'

అని రాశేశి ఆ పోలీసోడి కోటుకి తగిలించీశాడు బాబయ్యా.

'ఆఁహా! మనవాళ్లుకూడా గడుసుమీరిపోయినారు! పాంబజారు తోవలో నేను చెప్పినయింటికి వెళ్ళారా?'

'ఎల్లారు గాని అక్కడేంటున్నాందో నా కెరికిలేదు. నేనిలాగ మీతో సెప్పడాని కొచ్చాను.'

'అన్నా ఆ సంగతే ముఖ్యం. ఏమయి ఉంటుందో?'

'ఏలొన్నరి కాయిచారం ఒక్కనాటి కొద్దుబాబయ్యా; మే మెల్లడం మరొ టవడం ఉంటాదా, తప్పక జయమే. ఆహా! కేసుల్లాగ పట్టుకుంటే ఒకంతట యిడిసిపెట్టే రకాలు మన దగ్గిర మందుగ్గూడా లేవు. ఇదిగో ఒచ్చేస్తారురు. ఈపాటికి తిరుగు దల్లో ఉంటారు. ఇంకొక గడియకి ఒచ్చి పడ్డారన్నమాటే!'

'సరే! నీకు రేపు యినాంయిస్తాన్లే. పో' అని యని, 'వీళ్ళింకా రా రేమి చెప్మా!' అని యనుకొనుచు నా జాముల యా రాత్రియంతయు నాపాడువడినయింటిలోనే గడపెను.

పాపము నియుక్తులకెల్ల భద్ర మని చెప్పవా రొక్కరును లేరుగదా! తెల్లవారినఁ నెంత విచారించునో వ్రాయనేల?

---

## పదమూడవ ప్రకరణము

---

### అసలుకే ఎసరు; పెద్ద తడాఖా

ఇక్కడ గోపాలచందు అనఁగా జగ ద్విఖ్యాతిఁ గన్న యరిందమ్‌బాబు ఠాణాకు తీసికొని రాబడిన మంగత్సేను విగ్రహమును జూచినంత, యనేక రీతుల నాలోచించి .యాలోచిం

చి వాని బట్టలకు నతికియున్న చీటీని జూచుకొని నవ్వుకొనుచు ఠాణావారే దగిన చికిత్సఁ జేయు వైద్యుని నియోగింప నీతఁడు తన గృహంబునకుఁ బోయెను

ఆ గృహ మెక్కడనున్నదో మన మెఱుఁగము. కాని పాంబజారునకుఁ బోవు బాటయందు కాదనిమాత్రము మన ము నమ్మవచ్చును. అది నిన్ననే మార్చివేసిరి కదా! ఇంత నే పాటియయిన ననుమానమున్న నిప్పుడు దిరుగ ఠాణాలోనుండి యున్న రనుకొనుచున్న యా ద్రోహుల నడిగినఁ జక్కఁగాఁ దెలియవచ్చును

వీనిరాక కెదురుచూచుచు నచ్చట పద్మాబాయి— మన లక్ష్మీబాయి—కనిపెట్టుకొని యుండెనని వేఱె వ్రాయ నవసరము లేదుకదా! కాన నీతఁ డాయింటఁ బ్రవేశించినంత నేవార్తయు బంపకుండినందుల కాతనిపైఁ గినిసి, తగిన ప్రత్యుత్తరంబును, నప్పటికి జరిగిన చర్యయును దెలిసికొని 'హన్నా! నాగుండె లెలాగ కొట్టుకుంటున్నాయో! వాళ్ళకు కనిపించిన వాళ్ళకల్లా ఏదో ఒకబాధ కలుగజేస్తూనే ఉన్నారు. పాపము నామూలంచి ఎంతమంది బాధపడుతున్నారు! దీనికేమిటిగాని మీరుమాత్రం జాగ్రత్తగా ఉంటేగాని మీమీదికే వస్తుంది సుమండీ. అలాగా వచ్చిందా, అంతా చచ్చామన్న మాటే. బతికినా చచ్చామే! చచ్చినా చచ్చామే!' అని మహా భయముతో నా పాదమస్తకమును నల్లలాడుచు ననెను.

'ఏమిటి అమ్మా లక్ష్మీబాయీ, అలా గాభరా పడి పోతున్నావు అంత మీద మీ దున్నట్టే కనిపిస్తున్నా నేమి నీకంటికి? మీదకి రావడానికి, మావాళ్ళు చాలా తెలివితక్కువగా పనిచేశారు అందుకే అనుభవిస్తున్నారు. మన మలా తెలివితప్పి నడవా నడపము; అలామీదికి తెచ్చుకోనూ తెచ్చుకోము. దీనికింత భయపడిపోతున్నా వేమి? అయ్యో! వెఱ్ఱీ.'

'పోనీయండి గాని ఒక్కపనిచేద్దా . ?'

'ఏమిటి? ఏదో అలా ఆలోచన ఏదైనా చెప్తూతే లాభం ఉంటుంది గాని ఉత్తనే రావాకులాగ అల్లలాడితే ఏం ప్రయోజనం చెప్పూ?'

'ఐతే, నేను ఈవూరునుంచి మరొక ఊరు వెళ్ళిపోతే మరేమీ బాధ ఉండదుకదా?'

'ఓ సిదా? అదేదో మంచి ఆలోచనేదో చెప్తూతా వను కొని నేనున్నాను? సరే అలా వెళ్ళిపోయావనుకో;ఏమిటిలాభం?'

'లాభ మేమిటి మరి ఇక్కడ లేదురా అని వాళ్లూ ఊరు కుంటారు. మరి మీ కేమీ బాధుండదు.'

'అంతేగాని నీకు బాధ తప్పదుగదా! వాళ్ళ దుండగాలు తప్పవుగదా! మరొక ముప్పయిమంది చావడం తప్పదుగదా! దేవీపూర్ సంస్థానం వారి దవడం తప్పదుగదా? నీ కొడుకు ప్రాణాలమీద ఇప్పుడున్న అపాయం తప్పదుగదా? మరేం లాభం చెప్పూ.'

'అవన్నీ ఉన్నా మీకే ప్రాణాపాయం తప్పిపోతుంది.'

'ఆఁ హా! వాటన్నిటికన్నా ఎక్కువా యిది? ఔను, ఈ అందరిలోనూ సుకుమారుడ్ని నేనే; అందరిలోనూ బాధంటే ఏమిటో యెరగక సుఖాన్ని బ్రతికినవాడ్ని నేనే; ఇలాంటి దుర్మార్గులంటే భయమూ, భీతి ఎక్కువ గలవాడ్ని నేనే; ఇంతెందుకూ? ఆడదాన్నీ నేనే, కుర్రవాణ్ణీ నేనే; కాబట్టి బాధ తప్పించుకోవడానికి ప్రయత్నం నేనే చెయ్యాలి నిన్ను మరొక ఊరులో దించి నేనే వెళ్ళిపోవాలి ఆహా! ఎంత సవ్యంగావుంది! జాగా మార్చగానే బుద్ధికూడా మారి పోయిందా యేమిటి?'

'అలాకాదండీ, పెద్ద తర్కంలోకి దిగిపోయారు. నేనే అనుకుంటాను. అవన్నీ నేనే అని ఒప్పుకుంటాను; గాని ఒకవేళ నేనుచచ్చినా, మరొకరుచచ్చినా, ఇప్పుడు లోకానికేమిన్నీ బాధగాని, నష్టంగాని రవ్వంతైనా లేదు మీకేమయినా వచ్చిం దనుకోండి! ఎంతమందికి నష్టం; మీలాంటివాళ్లున్న దానికీ, నాలాంటివాళ్లున్న దానికీ, వ్యత్యాసం లేదూ?'

'ఏ మెక్కువుందీ? ఆపదలో ఉన్న ఆడదానిని కాపాడ లేక మరొకచోటికి పొమ్మని తోలేసిన తరువాత నువ్వెం డెంతో, నేనుండీ అంతే.'

'అంతే?'

'కాక మరో అంతే ఎలాగౌతుంది నువ్వే చెప్పుమా చూతాం?'

'అలాకాదు. చూడు నా గొప్పతనం ఎప్పుడంటే; యితరుల్ని బాధలనుంచి తప్పించినప్పుడు గదా! మరి నువ్వు చెప్పినట్టు బాధలో ఉన్నవార్ని పోరా ఎక్కడకైనా అని చెప్పి తోలేసి పడటానికి మరి నా గొప్పేదీ? మరా గొప్పే లేనప్పుడు నువ్వూ నేనూ ఆ జగత్సింగూ అంతా ఒక్కటే అంతేకాదు చాకలి ఎల్లిగాడు, మంగలి అసిరిగాడు కూడా మనకన్నా చాలా గొప్పవా రవుతారు. ఏమంటావు?'

'మరనీదేమిటి? నన్ను క్షమించమంటాను. మరేమంటాను!'

'ఎప్పుడూ మరిలాంటి తిక్కవూహలు మనసులో నుంచుకోవద్దు. కష్టమూపడక శ్రమా పడకపోతే జయమొస్తుందీ? ఏమీలేదు పట్టెడన్నం తినాలంటే ఒళ్ళొంచి, వంటచేసి, నానా కష్టపడందీ కాదుకదా? బాగా క్రొవ్విపోయి ఉన్నా యీ దుర్మార్గుల్ని పట్టాలంటే కొంచెం శ్రమపడడం ఉండదూ? శ్రమపడాలీ. మావాళ్ళకు దెబ్బలు తగుల్తున్నాయని విచారం ఎందుకు? వాళ్ళీ డిపార్టుమెంటులోకి రావడం ఇందుకే అందుకే వాళ్ళకంతేసి జీతాలు, భత్యాలు, అధికారాలు, ఇచ్చారు గవర్నమెంటువారు. వాళ్ళకు ఒక్క తడాఖా తగిలిందంటే, పదిమందికి తగలవలసిన తడాఖాలు తప్పాయి అన్నమాటే. లోకంలో అంతా నీలాగే వాళ్ళమీద కనికరిస్తే యికను మరి వాళ్ళెందుకూ?'

'అబ్బా! పోనిస్తురూ నాయనా! పొరపాటున అలా అన్నాను. ఇకనైనా ఊరుకుందురూ! మీపుణ్యం ఉంటుంది'

తరువాత వేమేమియో కొంత లోకాభి రామాయణ మునుగూర్చి ముచ్చటించి. భోజనానంతరమున నరీందమ్‌బాబు గారా గృహాంబునుండి బయలు వెడలిరి. అప్పుడాయన మన స్సులో 'ద్రోహు లందఱను ఖైదులో నుంచాముగదా! కాని వారిలో భానోజీగాడూ కానరాడు. గులాబ్‌సింగూ కానరాడు. జమిలియానంగతి కేమి? అంటే ఏమిటీ—వాళ్ళు ముగ్గురూ ఇంకా పైనే ఉన్నారు. అంటే దాని కర్థ మేమిటి? పులిగోళ్లు తీసేశామన్నమాటే; కాని కోరలున్నాయి; పులీ ఉన్నాది. అభ్యంతరమేమిటి? ఉన్నాది; కాని బలిమీద కీవేళో రేపో వచ్చి పడుతుంది తప్పదు. ముందెత్తు వేసుకొనే ఉండాలి' అని అనుకొనుచు నడచుచుండెను.

దాదాపు పన్నెండుగంట లగును. వీథులలో నలుకుడు కొంచెము తగ్గియుండెను. అరీందమ్ నడచుచుండు భాగము ఇదర్వారు వేషమున సాధారణముగనుండు పనివాఁడు. నడక తీరెంతయు నాలోచనను తెలియఁ జేయును. అట్లు నడచుచు నప్పుడప్పు డిటునటుఁ జూచుచుఁ బోవుచుండు నరీందమ్ ఒక సందులోనికి తిరుగునప్పు డటునుండి వచ్చుచుండు నొకపూడు కాళ్ళ ముసలిని ముఖాముఖి తాకెను. పాప మా ముసలిది దబ్బున క్రిందఁ బడెను. 'సచ్చానురా బాబూ' అని యఱ

బడిపోయెను. 'అయ్యయ్యో; ఈ ఏలువులో నాకు కనపించిందేకాదు పాపము' అని యా ముసలిని లేవనెత్తి కూర్చుండబెట్టి, దానితలపైనుండి క్రిందఁబడిన బుట్టయందుండి ధారదూరముగఁ బడిపోయిన యెండు పుడకలను మరల యథారీతి నుంచుచు 'ఏ మవ్వా! దెబ్బతగిలిందేమిటి' అని యడిగెను. 'హమ్మా! దెబ్బేంటో గాని నాకు ముఖం తిరుగుతున్నట్టున్నాది. కొంచెం రెండు సుక్కలు నీళ్ళుంటే!' యని ఉస్సురని నిట్టూర్పు పుచ్చెను. ఆప్రక్కనున్న కొళాయికి పోయి, దోయిట నీళ్లు తెచ్చి యా యవ్వకు త్రాగనిచ్చెను. పాప నామె కొంచెము .నేదదేరి 'మర్రొండు సుక్కలు నాయనా, నేనువచ్చి నీకడుపున పుడతాను బాబూ' యన మరల బోయి దోయిట నీళ్ళుతెచ్చి చూచినంత నాయవ్వ కనులు మూసికొనియుండెను. 'అవ్వా! అవ్వా' యని పిలచి 'ఇదిగో నీళ్ళు త్రాగు' మని బిగ్గరగా నని నోటిదగ్గర పెట్టెను 'హా,—హా' యని యాతురముతో నోరువిప్పి తొందరపాటుతో త్రాగబోయి పాప మాయరిందమ్ చేయికఱచి యొక్కగుక్కెడు త్రాగి 'అయ్యో! బాబూ, చెయ్యి కరిశేశాను గావోసు నాయనా! పాపిష్టిముండాదాన్ని!' యని విసుగుకొనెను.

'ఫరవాలేదులే. ఇప్పుడు నీవొంట్లో యెలాగుంది?'

'నీ అమ్మకడుపు సల్లగ, నీఅత్తకడుపు సల్లగ, కొంచెం తెప్పిరిల్లాను నాయినా. బుర్రమాత్రం ఇంకా కొంచెం తిరుగుతున్నట్టున్నాది. నువ్వెల్లిపో బాబూ. నీకు దేవుడు మేలుసేస్తాడులే. ముసలిదానికిన్ని నీళ్ళిచ్చావు బాబూ పుణ్యాత్ముడివి నూరేళ్లు బతుకునాయినా. ఈముండాపాపి ఇంకా వొచ్చిందికాదు నూకా, బలేయ్, పున్నీ' అని బిగ్గఱగా తన మనుమరాలిని గాంబోలు పిలిచెను. 'ఇప్పుడెంతా వొస్తాదే! ఆబాబు లేకపోతే యిలా గీతోవలోపడి సచ్చేదమేగదా హామ్మా! టకీనీముండా రా, రా, నీపొగ రణుస్తాను' అని మెల్లన లేచి పడుచుండెను. అరిందమ్ గూడ తనత్రోవ పట్టెను. బాటయందు సందగుట చేత మనుష్యప్రచార మేమియు లేదు.

'ఏమిది? నా కళ్ళు మసక మసక లాడ్తున్నాయి. ఈ రాత్రులు నిద్ర లేకపోవడంచేత ననుకుంటాను.' అని యనుకొనుచు నరిందమ్‌బాబు మరి రెండడుగులు వైచి-'కాదు-కాదిది ఏదో మోసమున్నట్టున్నది' అని యాలోచించుకొనుచు, నా ప్రక్కనున్న యొక యఱుగుపైఁ గూర్చుండి త్రోవలో పోవుచున్న యొక కాపును చూచి, 'ఒరే-అబ్బీ, ఒక బండి—తాణాకి—' అని సగము సగము చెప్పుచూ చేతు లాడించుచుండెను. 'తాణాకు తీసుకపోవాలేటి?' అని కాపు బిగ్గఱగా ననెను.

'హా' అని మూఁతపడుచున్న కన్నులతో తలయూచి 'ఇంద' అని జేబులో చేయి పెట్టఁబోయి వెల్లకిలఁ బడెను.

'అయ్యో పాపం' అని కావు పోయి యొక బండిని తెచ్చి చంకలు గ్రుద్దుకొనుచు, వాని నా బండిపై వైచుకొని సంతోషముతో పోయెను.

ఎక్కడకు? రాణా కేనా?

---

పదునాల్గవ ప్రకరణము

---

## జ త్తీ బా బు ఎ త్తు

సాయంకాలమైనది. మేతలకుఁ బోయిన యావులమందలు గృహోన్ముఖములై మరలి వచ్చుచున్నవి; కాని అరీందమ్ రాడు. ఆహారార్థ మేగిన పక్కులు జక్కఁగ దమ యిక్కలం జేరుచున్నవి; కాని అరీందమ్ రాడు. విహారార్థ మేగిన నాగరకు లెల్ల యిండ్లు జేరుచున్నారు; కాని అరీందమ్ రాడు. లౌకిక కార్యాచరణులగు యుద్యోగస్థు లెల్లరు దమ తమ విడుదులఁ జేరుచున్నారు; కాని అరీందమ్ రాడు. అరీందమ్ రాడు. ఆరు న్నరగంట లాయెను. అరీందమ్ రాడు. ప్రొద్దున పది-పదిన్న రకు పోయిన యరీందమ్ రాకపోవుటకు కారణ మేమయి యుండును? జతీంద్రబా బూహించుకొన లేకుండెను. కింకరుఁ

బిలిచి, పద్మా బాయి నడిగి తా నేగినకార్య మేమైన తెలియు నేమో కనుగొనం బంపెను. పాపము పద్మాబాయికికూడా విశేషములు తెలియవు. ఇప్పుడే వచ్చెదనని బయలుదేరిరి. ఏమైయుండును. ఠాణాలో వార్తలేదు. కింకరునకుం దెలియదు. చౌధరీ కంతకన్న తెలియదు. జతీందర్ బనలోనుండి, పద్మా బాయితో మరికొన్ని ప్రశ్నల నడుగు నూహతో నుండెను; కాని కింకరునకుం దప్ప మఱి యెవ్వారికి నామెయున్న బస తెలియదు. అదెక్కడనుండునని కింకరు నడుగుటకు మొన్నటి తన కార్యము సాహసము నియ్యకుండెను. ఇంతలోం గింకరు వచ్చి 'బాబూ, పద్మాబాయిగారు మిమ్ము రమ్మని సెలవిచ్చి నారు.

'ఎక్కడున్నా రేమిటి?'

జతీబాబు ఎత్తు

'రండి తీసుక వెళ్తాను' అని వానిని తీసుకొనిపోయెను.

కొంతసేవు పద్మాబాయితో మాటలాడియాడి 'ఇదిగో ఇప్పుడే! వెళ్తాను అని సెలవు పుచ్చుకొనుచుండ 'నా మె వెళ్ళండిగాని, మొన్నటిలాగ మళ్ళా ఎదో ఓ పెంటయింటి మీదికీ, ఒంటిమీదికీ గూడా తెచ్చుకోకండేం. ఇక్కడికి వచ్చిన సంగతే మరచిపోండి ఈయిల్లు మీకు తెలియనే తెలియదు. తెలిసిందా?' అనెను. పాపము జతీబాబు సత్తిబా బయి బ్బె బ్బె బ్బె లె లె లేదు' అని యాగ్రహము వెలువడెను.

'ఛీ! దరిద్రం! ఆడదానిచేత గూడా దెబ్బలు పడ్డం ఏమిటి?' అని కింకరుడు వినునట్లు లనెను.

'ఇదియేమిటండోయ్! వింత! ఆడదానిచేత దెబ్బలు పడి మొఖం జుమ్మని కిందపడి గూడా, ఆడవాళ్ళ దెబ్బలొక గొప్పనిందగా అంటున్నారు. ఆడవాళ్ళసంగతి మీరెరుగరు గాబోలు?' అని కింకరగ్నికి సూరాజ్యము నిచ్చెను.

'హుం! అల్లావచ్చింది నాబతుకంతా. ఏదో ఒకసారి బుట్టలో పడ్డామని ఎప్పుడూ అలా ఐపోతుందనేనరే కానీ.' అని పౌరుషము దెచ్చుకొని 'కింకర్, బాబుగారు రాకపోవడం చూస్తే నాకుగూడా చాలా అనుమానం వేస్తున్నది. ఇంత రాత్రి అయింది. ఇంకా రారా, పోనీ ఏదైనా పనిమీద వెళ్ళారండానికి, మనకు ఏమీ అరేంజిమెంట్లు గూడా చెప్పలేదు. కాబట్టి వేగక తిరిగి వస్తామన్న ఉద్దేశంతోనే బయలుదేరారు అది నిశ్చయం ఇంకా రాలేదు ఈ దుర్మార్గు లేదో ఒక మాద రోభదీ చేస్తూంటారు మన మేమిటి చేస్తాం.'

'నాకుగూడా అదే వుద్దేశము కలుగుతున్నాది. ఏదైనా పెద్ద మొత్తుమీద వేళ్ళే నవో్, చౌధరీనో, లేకపోతే మరి వరో్ దూరదూరాన్నయినా రమ్మనకుండా పోరే—ఉండండి' అని లోపలకు మరల పరుగుపరుగున బోయి అరిందమ్ పెట్టెను తెలచి, యందు నాటి టోపీని జూచి, మరల పరుగుపరుగున వచ్చి 'జత్తీబాబుగారూ, మరేం అనుమానం లేదు. తప్పక

ఒక అరగంట, గంటలోపల తిరిగి వచ్చేదామనే బయలుదే రారు మరేనే పెద్ద ఎత్తుగూడా లేదు కాబట్టి రాకపోవడం చాలా అనుమానించ వలసిందే. ఒక పనిచేద్దాం? మన టర్కీని వాడుదాం?'

'ఔను, అదైతేనే బాబుగారి జాడ వేగం తెలుస్తుంది. లేక మనం వెళ్తే చాలాకాలం పడుతుంది తీసుకురా దాన్ని' అని చెప్పగనే కింకరుపోయి టర్కీను తీసుకొనివచ్చి యిరీం దమ్గారు తొడుగుకొని విడిచి పెట్టిన వస్త్రముల పసి కుక్కకు వాసనజూపెను. కొంత వాసన చూచిచూచి యాకుక్క గొలుసు త్రెంచుకొని పోవునట్లు మొరుగుకొనుచు లాగుచుండెను 'ఆ! చాలుచాలు. ఇక నదే దారి చేసుకుంటుంది—ఉండుండు వెళ్ళిపోకు. ఈ కుక్కనే చౌధరికిచ్చి నువ్వునాతో రావాలి.' అని జత్తిబాబని, యొక యాలతో చౌధరిని పిలచి 'దాన్ని పట్టుకొని మాష్టర్‌ని చూచిరా ఇదిగో! వారి చేతి గుడ్డ. పసి ఎక్కడైనా చాలదని తోస్తే, ఇది చూపించు.' అని వానిని నియమించి, తానును కింకరును తన బసకు బయ లువెడలిరి. కుక్క చౌధరిని మిక్కిలి బలముతో నీడ్చుకొని పోవుచుండెను. ఈడిగిలఁ బడుచు చౌధరి దానివెంట నేగుచు నేనుఁగు గొలుసువలె నున్న యాగొలుసును తన యావ చ్ఛక్తితోఁ బట్టుకొని యుండెను.

తన బసకుఁ బోవుచు 'కింకర్, నేనొక పెద్దయెత్తే యెత్తుతున్నాను సుమా. దీనితో నేను యీ డిపార్టుమెంటు

మానుకో నెక్కడికైనా పోవాలి; లేదా, మొన్న నేనుచేసిన పొరపాటు సాఫ్‌సీదాగా బాబుగారి మనసులోనుంచైనా తుడిచి యాలి. అంతే, ఏదో ఒక్క 'ఓమాట' అని జతించుకుండెనెను.

'ఏమిటండోయ్, అంత జోరుగా తెగిస్తున్నారు ?'

'ఏమీలేదు——ఇలా రా' అని మెలమెల్లన చెవులో నేమేమిరయో చెప్పెను. అట్లు చెప్పిచెప్పి 'ఏమి——ఏమంటావు? మంచిదా ? చెడ్డదా ?' అని యడిగెన్ను.

'ఏ మనడానికీ, చెప్పలేము కాని ఒకటి జాగ్రత్తగా చూచి చేస్తే, నష్ట మట్టెఉండదు లాభం కలిగిందా ? ఇలాటి వాళ్ళు పదిమంది పోయినా భయంలేదు. చేయవలసిందే అనుకుంటాను'

'నాకూ అలాగే తోస్తున్నాది కొండకి ఒక దారం కట్టాం. వచ్చిందా కొండ కొండే వస్తుంది పోయిందా చిన్న దారంముక్క పోతుంది.'

'బాగుంది గాని తగినవాడ్ని చూడాలి. పోయినా; మిగిలినా, నష్ట ముండకూడదు.'

'ఔనోయ్ ! అదంతా చూచుకొనే ఒదులుతాం.'

'సరే' అన్న 'సరే' యనుకొని యిద్దఱును తిన్నగ బసకు పోవుటమాసి, రాణాకు పోయి యట నేనేమిరయో యేర్పాటులను జేసి గృహోన్ముఖులయి పోయిరి.

వీరుపోయిన యొక్క నిమేషమున కొక రక్షకభటుఁడు 'ఏం చిత్రంగున్నాది ? ఏక్షణం ఎవడిమీదికి వొస్తాడో తెలీదు కదా చూడు పొద్దున్న వెళ్ళిపోయారట. ఇంకా రాలేదు. మరొచ్చేదేఁటి. మళ్ళా వీళ్ళు వలల్లో పడకపోతున్నా తిరిగీ రావడమున్నా ? ఉత్తిమాట. చాలాకష్టం చాలాకష్టం మా మంచిబాబు పాప మెలాగ మళ్ళీవచ్చి మాలో కలుస్తాడో ! ఎప్పుడు కలుస్తాడో !' అని గొణుగుకొనుచు నొక ఖైదీయున్న గదిదగ్గరకు వచ్చి 'ఏమిరా ఒకే, పైకి వెళ్ళడానికి ఉద్దేశముంటే రా. మరి గడి గడీక్కీ తలుపు తీయలేను' అని తాళముతీసి వానిని వెలుపలికి విడిచిపెట్టెను. వాఁడును ఒకటికి బోయి యుండ, మగచియో యేమోకాని యీ కనిస్టేబులు తిరిగి యాకొట్టుకు తాళమువైచి మరియొకతట్టుఁ బోయెను.

చీకటి విస్తారముగ నుండెను. దీపములు మినుకు మినుకు మనుచుండెను. ఆకాశమున రేఖేదు లేనేలేదు. నక్షత్రములు మాత్రము ఒకదానితో నొకటి సంబంధములేక అనాయక ముగా నున్నవి. వర్ణించుట యెందులకు ? యజమానిలేని యవస్థనే యంతయు తెలియఁ జేయుచుండెను.

ఒకటికనిపోయిన ద్రోహి, కనిస్టేబు అట్లు బీగమువైచి పోవుటను చూచి, యొక్క గడియ యిటునటుఁ జూచి నన్న నన్నగ వెలుపలికి వచ్చెను. చీఁకటి పెల్లుగ నుండెను. అదియే

నం దనుకొని వడివడిగ మార్గముపట్టెను. పాప మా కనిస్టేబున
కీ సమాచార మెఱుకలేదు గాబోలు.

ఇంక వీఁడు 'ఖైదు తప్పెను—బ్రదుకు జీవుఁడా' యని లోలోన ననుకొని 'ఆ మాటలుపట్టి సూస్తే, ఇన్‌స్పెక్టరుకే మావో ళ్ళేదో దెబ్బతీశారన్నట్టున్నాది తీశే ఉంటారు. అంత టోళ్ళు కారా? ఏటో? ఈఁగొట్టులో పడ్డదగ్గరనుంచీ ఈసంగ తులే తెలకుంపున్నాయి నే నిలా గొచ్చానంటే మావో ళ్ళెంత సంతోసిత్తారు! బా బెంతె మెచ్చుకుంతాడు! అలాగనేశా, నిలాగనేశా నంతే నాకు లాంవింత ఇనాం ఇయ్యారా బాబు. బుట్టలేశామంతే బుఱ్ఱమీద పెట్టుకుంతారు నా పాయిన నల్లగ బతకాల. తన్నేమంటే తలమీద పెట్టుకుంతారు బాబు నాకు తప్పకుండా మంచి యినాం ఉండన్నమాటే' అని యనుకొనుచు సాధ్యమైనంత వేగముగఁ బోవుచుండెను. చీఁకటికి సంతోషించుచుండెను. ఆ వెనువెంటనే మరియొక విగ్రహముగూడ వాని నీడవలె నంటి పోవుచుండ వాఁ డెఱుఁగఁడు—పాపము!

అట్లు పోయిపోయి పాడుపడియున్న శిల్డా త్రోవలోని గృహముదగ్గరకు బోయి 'జేయ్! మహాంకాళి శక్తీ!' అని యనెను. తోడనే చిన్న వెలుఁగు మినుకుమనియొక్క నిముసము కానవచ్చెను. వీఁడును తా నెఱిఁగియున్న చుట్టుదారిని లోనికిఁ బోవుచుండెను. పాపము, వెంటవచ్చిన విగ్రహమునకు దారి తెలియదు గదా! కాన వెలుపల నుండవలసివచ్చెను. కాని

మతియొక్క యుఖ నిమునములో నీ రెండవ విగ్రహామునకు తా నెక్కడ నుంటయో చక్కఁగఁ దెలియవచ్చెను. మెల మెల్లన నా యింటి రాతిగోడపై కెక్కి—చప్పుడు కానీయ లేదు—చూచుటకు గాఢాంధకారముగ నుండుటచే—చెవి గొట్టమును దగిల్చి వినుచుండెను.

సంభాషణము

ఛీ! అలాంటివాడ్ని చేతులార చంపుతే మన కెప్పు డైనా దేముడు మేలుచేస్తాడా! అత డెప్పుడైనా మనల్ని ఉత్తనే చంపాడా? ఏదో అతని ప్రాణాలుమీాది కొస్తేగాని ఏమీాచేయడు. చూడు! ఆవేళ మిమ్మల్నందర్నీ చంపేస్తే ఏమిచేసుందుము? ఛీ! కూడదు. ఇంతకీ చంపేస్తే ఏమిలాభం? ఇలా గల్లరపెడుతున్నాడుగాని—నాకు కావలసింది దొరుకు తుందా? అది మరెక్కడికో?'

'అదేం టలా గంటావు? మంచిమాటే! దొరికినవాడు-మన కింత చిక్కు పెట్టిన వాడు—చిక్కినప్పుడు చంపకపోవ డం చాలా బాగుంది కదూ? ఇదే నీతో...'

'నిజమే గాని, నా సంగతంతా చెప్పి మరీ ఓడిపోయా నని అతనిచేత అనిపించి, పోటాపోటీగా పనిచేస్తే లాభం గాని ఒళ్ళు తెలియకుండా ఉన్నప్పుడు పీక కోసేస్తే నా గొప్పయేదీ. అలా చెయ్యడానికి చేతులు నా కొక్కనాటికి రావు. అందుకే చంపలే నన్నాను. నే నేంచేశేది? పాప మీాపాటికి బం డొచ్చి ఉంటుందా?'

'ఆం తొమ్మిదిగంటలు కావొచ్చింది '

'సరి ఒక అరగంటలో, రైలుబండిక్రింద పడి ఒకడు పోవును. ఒకడంటే ఒకడా! లక్షమందితో సమానమైన ఒకడు —కోటిమందితో సమానమైన ఒకడు. ఛీ, ఛీ, ఈ పాపము నా కెప్పటికీ పోదు. పోదూ? ఆలాంటివాడి కిలాంటి చావా?— ఛీ! ఆయినాలస్యం యెలాగా అయింది గాని మరి కొంచెం సేపయితే చాలా బాగుండును కదా!'

అని యొకరు విసుగుకొనుచుండ, నా రెండవవాఁడు 'పోనీ దీనితోనయినా చస్తే ఉంది.' అని యనెను.

'చాలు లెస్తూ; చావక ఏమవుతాడు? ఆమత్తు, చావు మత్తూ—అది పోదుకదా? చీకటి ఎలాగుందో చూచావా? ఇంక చక్రాలకింద పడ కెక్కడికి పోతాడు.'

వెలుపలివిగ్రహముదారిబట్టెను విషయము తెలిసికొనెను

'ఏమో తప్పించుకొని పోతే! అబ్బా ఏమివెఱ్ఱి. నువ్వు చంపకపోతే పోయావు గాని, నన్నెందుకు చంపనిచ్చావుకావు? చాల పొరపాటు. పోనీ అక్కడనుండి చూదామంటే అదీ చెయ్యనిచ్చావుగావు—మంచి ధైర్యమే!'

'అబ్బా! అత నలాగ చచ్చిపోతుంటే, నేను చూస్తూ నిలబడగలనూ? ఏదో నీపోరు భరించలేక ఆ రెయిలు కమ్మీల మీద పెట్టడానికైనా ఒప్పుకున్నానుగాని అక్కడనుండిచూడ్డమే!

'చాలా సంతోషించాను! గాని, వా డెలాగయినా తప్పిపోతేనో అని భయపడుతున్నాను.'

'అయితే ఏమంటావు ?'

'నే నక్కడకెళ్ళి చూస్తూవుంటాను ఇందాక నిన్ను చూస్తే నాకు భయంవేసి నీతో వచ్చేశాను.'

'అయితే పో.'

ఖైదునుండి విడి వడి వచ్చినవాఁడీ సంభాషణ వినుచు మాట్లాడక ప్రక్కను నిలిచియుండె వాఁడు పోయిన వెనుక 'సిత్తం ఏలోన్నరి పాదాలదగ్గిరికి మళ్ళీ వొచ్చాను మా ప్పెబో' అని నివేదించుకొనెను; గాని జమీలాలిచూ మన నీ ప్రపంచమున లేదు. ఆఁ కూర్చో' అని నోరనెనే గాని దాని యర్థము గాని, వాఁడు వచ్చుటయందలి వింతగాని, యామెకుఁ దోఁచలేదు. తన యాలోచనలే మహాసముద్రముగాఁ జేసికొని యందు మునిఁగి కొట్టుకొనుచుండెను.

తా నెన్నఁడు ననుకొననియట్టుల నాతఁడు చేఁ జిక్కెను ఇంట బయలు వెడలినప్పు డిట్టు లగునని తా నెన్నఁడు ననుకొనలేదు. దైవయోగమునఁ జిక్కెను. చిక్కినందులకు వానికిఁ దెలివితెప్పించి, తన సామర్థ్యమును చూపించి, యోడితి నని యొప్పించి, విడివినం దనకు యశస్సబ్బును; గాని, మత్తున నుండ, దొంగరీతి, ప్రాణములఁ దీయుటవలనఁ బేరేమి ? యని తన యూహా. ఇట్టి దుర్మార్గము నరేందమ్‌కిచ్చు నని తెలిసిన పూల్సాహేబే ఉండిన యెడల ఒప్పుకొనునా ? నీచమైన కార్యముగా నిది తనకు కన్పట్టెను—అటులనే చేసియుండును. కాని

తన సహకారి యొకఁడు నడుమ వచ్చి పుఁకొల్పెను. చంపు మనెను. ఆకార్యము నేను చేయలే ననెను. చంప నిమ్మనెను. చంపినఁ జంపుముగాని, యావెనుక మరి నాముఖము జూడకు మనెను. చంపకుండ విడుచుట చాలప్రమాదకర మని చెవి ల్లుకట్టి పోరెను. తుద కిసుపదారిపై నా శవాకారముగనున్న శరీరమును విడిచిపెట్టి వచ్చెను ఈరీతిఁ జమీాలియా కోర్కె నకొంతవరకు నెరవేర్చినవాఁ, డామె యనురాగమునకుఁ బ్రియ త్నించుచున్నవాఁడు కాకుండునా? అయ్యయ్యో! పాప మొక్కయరగంటలో ప్రాణములను బాయునుగదా అరిందమ్! ద్రోహులపాలిటి మిత్తి! ఆర్తుల కమరతరువు! మితి యుండదుగ దా! ఛీ, నా కెట్టిమరణము వ్రాసెనో దేవు డని యనుకొను చుండును. కన్నీరు గార్చుచుండును. విసుగుకొనుచుండును. పరుగునబోయి బండి నాపుదునా యని యనుకొనును. పరివేదన నొందును. పాపము ! ఆడుదిగదా !!

---

## పదునైదవ ప్రకరణము

---

### ముక్కు మీఁద ప్రేలు

చౌధరీ టక్కను బట్టుకొని యీడిగిల బడుచు, బోయిఁ బోయి కిదర్పూరుసందులో నాయకునిదగ్గరకుఁ బోజాలెను. అక్కడకు పోయిన యంత ఛంగున నఱుఁగుమీఁదకు గంతిన

టర్కునుచూచి చౌధరీ 'సరి కూర్చుంటూది గావోసిక్కడ!' అని 'టర్క్, టర్క్' అని దానిని బిలిచి చేరుమాలును మురల నాకుక్క ముక్కుదగ్గర నుంచెను పాప మా కుక్క యెంత వాసనచూచినను ప్రయోజనము లేకుండెను. దిగ్భ్రమఁ జెంది యిటునటుఁ జూచునేగాని కాలు కదల్పకుండెను ఎన్నిసారు లదలించినను లాభము గలుగలేదు సంగతి ఏమియో యని సంశయముతో చౌధరి యెందరి నడిగినను మే మెఱుఁగ మను వారే యగుటఁ దిరుగ నింటికిఁ బోవలసివచ్చినది. అటుల పోవుచు ఠాణా కొకసారి పోయి కనిస్టేబును సమాచారము లేమి యని యడుగ నాతఁడు 'ఏమున్నాయి; బాబుగా రేమో రాలేదు. జత్తీబాబుగారున్నూ కింకరుగారున్నూ ఏదో ఎత్తు ఎత్తి నాదగ్గరికొచ్చారు. ఒచ్చి, ఖైదీల్లో అమాయకుడుగా ఉన్న మొద్దు ఎవడని అడిగారు నేనొకడున్నాడన్నాను అంతే చూచా, ఎందుకయినా మంచిది నీకు చెప్తుంటే. వాడ్ని మెల్లగా ఒదిలేయ్ అని చెప్పారు. నేనుగూడా అలాగే అని వాడ్ని ఒకటికి ఒదిలినట్టూ తరువాత ఏదో పొరపాటున తలుపు మూసి మరొకదుక్కు పోయినట్టూ నటించాను' అనెను.

'అయితే, ఏంటి, ఆ ముండాకొడుకు పారిపోయాడేంటి?'

'పారిపోకపోతే అంత సులువు దొరికిం తరువాత మళ్ళీ వొచ్చి అయ్యా, మళ్ళీ నన్ను ఖైదులో పెట్టండి అని అంటా డనుకున్నా వేంటి?'

'అన్నా, బాబుగారు లేనప్పు డిలాటి పనులుకూడా మనం చేస్తే మనమీాది కేదో పెద్ద నిందే వస్తాదనుకుంటాను.'

‘జత్రీబాబు గారు చెప్పారు నేనుచేశాను. నాదేం తప్పుంది—ఇంతేకాదు మనముగూడా చూడాలికదూ. ఆకింగర్ ఉన్నాడే మల్లీ బాబుగారి లాంటోడే కాబట్టి ఏదో పెద్దత్తే ఎత్తుకుంటాడు.’

‘అదేమో! దీనివల్ల నష్టం ఒచ్చిందా వాళ్ళమానాన్ని వాళ్ళు తప్పించుకొని నీమీద పడేస్తారు. ఏదో నువ్వే చూచుకో! నేను పోతాను’ అని సెలవుతీసికొని తిన్నగ పద్మాబాయి యున్న యింటికిఁ బోయెను.

అచ్చట పద్మాబాయి మన స్నేహములుండునో వ్రాయుట మా కసాధ్యమని నమ్ముదురో నమ్మరో! తొలిదినమునుండియు నీ గోపాలచందునందు మహా గౌరవము కుదురుకొనెను. ఈ గౌరవము దినదినమును వృద్ధియగుచుండెను. ఆతనితో నొక్క క్షణము మాట్లాడిన నొక దిన మా మాటల యందము, నందలి యర్థములు, వాని సౌజన్యము, వాని యుక్తియు నొక్క దినమంతయు—స్మరణ చేయుచునే యుండును. తాను కోప పడిన నణుకువఁ జూపునే కాని స్వేచ్ఛావర్తనమున నున్న యట్లులం దోపదు; స్వగృహంబునకన్న మిన్నగా నీయింట నధికారమిచ్చెను. తన కుమారునియం దత్యంత వాత్సల్యముఁ జూపుచుండును ఇంకఁ దెలివితేటల నాలోచించితిమా యనన్య సామాన్యము; అట్టి గోపాల్ చందు-ఇంక నీతఁ డరీందం అనుమాట నెఱుఁగడు— బాధపడుచున్నాడను నూహాయే బాద పరమావధి నెఱుఁగిఁ జేయుచున్నది. ఏమేమియో వెఱ్ఱి

యూహల నాలోచించుచుండెను. తానే నడుముకట్టి వీధింబడి యాపుణ్యుని వెదకి వత్తునా యను నూహ బలీయంబుగ నున్నది. రాత్రి 9 గంటలు గావచ్చెను ఏవార్తయును రాలేదు రహస్యమును జెప్పదగు విశ్వాసయులు దగ్గర లేరు. ఎవ్వరయిన కింకర గాని-చౌధరీగాని-వత్తురా యని చూచుచుండెను. లోపల నుండి నిరీక్షించుట మహా కష్టము గాం దోచెను. వీధి గుమ్మము దగ్గరకుంబోయి నిలిచి యచట చప్పుడైన నెవరో వార్త దెచ్చుచున్నా రనుకొని తొంగి చూచుచుండెను

అట్టి యీ మేడకు చౌధరీవచ్చి తా నెఱిగిన యిది చెప్పెను. అన్నా ఒక ధైర్యము—చౌధరీ ఏమయినా నువార్త దెచ్చునను ధైర్యము-పోయెను ఇంక శరీర మంతయు నొక్క సూక్ష్మ విషయముపై నానియుండి గిఱ్ఱునం దిరుగుచున్నది. ఈ స్వల్పవిషయమే కింకరురాక అగి తడయుచున్నది జతీంద్ర బాబుగారి యింటికి ఒకనితరువాత నొకనిని పంపుచున్నది. విశేషములు లేవు మరల చౌధరీని పంపెను.

చౌధరీ పోయిన రెండు నిముసములకే తిరిగివచ్చి 'అమ్మా, జతీబాబుగారే వచ్చున్నారు' అనెను. ఇంతలో జతీంద్రబాబు ప్రత్యక్ష మయ్యెను. 'కింకర్, రైలుస్టేషను నుంచి నాకు టెలిగ్రాము పంపాడు— రేపుదయం రమ్మని. వెళ్ళమంటారా?

'టెలిగ్రామా? కింకరేనాపంపింది-లేక ఈఛండాలులా?'

'కాదు-కాదు; మా గురుతుతోనే పంపాడు. అందుకు సందేహంలేదు.'

'అయితే నమ్మకమే?'

'అహా!'

'అయితే అడగడమేమిటి? పదండి- నేనుకూడా వస్తాను.'

'అదేమిటి మీా రెందుకు?'

'మీా రెందుకు?'

'ఏదైనా పనుంటే చేయడానికి'

'నేనూఅందుకే నేనుచేయవలసిన పనులుండ వేమిటి?'

'ఉంటే ఉంటాయి గాని మీారే చెయ్యాలని నిర్బంధ మొకటా?'

'మీాతో నాకు వాదమెందుకు? రండిపోదాము నేను మీాకన్నా జోరుగా నడవగలను. రండి పందెంవేసి నడుద్దాం.'

జత్తీబాబుకు తానే దారితీయుచుండెను. జత్తీవెంట బడెను.

'చౌధర్! జాగ్రత్త రండి గాడీఖానాదగ్గర బండిచేసుకుందాం.' అని వానితోఁ గూడ పోయి యచట చేరెను.

చౌధరీ! టక్కునుపట్టి యక్కడ సంభాషణము జరుగుచుండ—నడుమఁ దెలియదగిన విషయములు తెలిసిన వెనుక నత్యంత భయముతో నా పాడుగృహమును, వీడి మార్గము పట్టిన విగ్రహము— మనకింకరు— శీఘ్ర గమనంబున చేరువనున్న రైలు స్టేషనునకు బోయి కనుగొనఁగా నప్పుడే పైస్టేషను నుండి బండి బయలుదేరిపోయె నని తెలియ వచ్చెను. ఇంకఁ జేయుట కేమున్నది? తోడనే ఆ కమ్మీలపై బోవు ట్రాలీనొక

దానిని వేయించి దానిపైఁ గూర్చుండి వడివడి బండి కెదురు గఁబోవుచుండెను బండివిషయము కనుఁగొనుట, ట్రాలీ వేయించుట, యజమానులు వలదనుట, తాను పట్టు పట్టియుండుట, యంతయు మరి కొంతకాలము చెరచెను. సాధ్యమైనంత వేగముగఁ బోవుచుఁ దనదగ్గఱనున్న విద్యుద్దీపము—నాడు హుగ్లీ నదిమీఁద బోటుహౌసును జూచుట కుపయోగించినదీపము. ఆ దీపమును ముందుంచుకొని పోవుచుండెను. ఎక్కడను శరీరము కానరాదు. రైలుబండి చప్పుడాయెను. కింకరుఁ గుండియలు కొట్టుకొనుచుండెను. ట్రాలీ యపరిమిత వేగమునఁ బోవుచుండెను. రైలు సమీపించుచున్నది. కాని రైలు చక్కఁగ కింకరు ట్రాలీకిఁగానరాదు. సరిగనాచోటనే పెద్దమలు పున్నది. కీ యని యీలవైచెను. ఆ వంకరలో కమ్ములపైఁ బడవేయఁబడిన యరీందం బాబుకు కొంచెము కొంచెము తెలివి వచ్చుచుండు సమయమున నీయీల వినిపించెను. తోడనే తన యవస్థ బోధపడెను. ఇంక ప్రళయకాల రుద్రునిగతి వచ్చుచున్న నా బండిచక్రములఁ బడి ప్రాణములు బాయుట నిశ్చయమయ్యెను. తానప్పుడున్న స్థితి వానికి మఱింత తెలివిని కలుగ జేయుచుండెను. సరి! ఒక్క ముహూర్తములో నిర్దాక్షిణ్యా భావముతో వచ్చెను. తా నెంత యఱచినను లాభములేదు. లేచి తొలఁగిపోవునంత కాలముసైతములేదు. దైవసంకల్పము లభేద్యములు.

సాహసము! మానవభావాతీతము! అసదృశము!

దైవకృతము! సాశ్చర్యము!

అట్టి సమయంబున మానవబుద్ధికిని బలమునకును అతీత మగునట్టి యొక్క యద్భుత ప్రయత్నము చేసెను ఇంజనుకు ముందు చేటవంటి దానిమీఁదఁబడి వ్రేలాడుచుండు కొంకీలను బట్టుకొనెను. సరి! చక్రములు తానింతకుముందు పడియున్న చోట దొరకొనిపోయెను అరీంచం మీఁదకు మెల్లమెల్లగ ప్రాకుకొనుచు నింజనులోనికి బోవుచుండెను. 'అరే, బద్మాష్! ఎవ్వడావీడు—చోర్' అను యటనుండు బొగ్గువాఁడును, 'అరే! ఎలాగొచ్చాడురా వీఁడు?' అని ప్రశ్నింప జేతుల తోడనే తాను మిక్కుటమగు నాయాసమున నున్నవాడననియు నించుక యట నేదదేరు నంతదనుక నేమియు ననవల దనియుఁ బ్రార్థించి యటనే చాపకట్టగఁ బడియుండెను. పోనిమ్మని వారును దమపనులఁ జేసికొనుచుండిరి. కమ్ములపై రైలుబండి వంకతిరిగెను. దేదీప్యంబగు నీకిలుఁగుఁ జూచి రైలు నాపి వేసిరి. ట్రాలీబండి సమీపమునకుఁ బోయెను.

'డ్రైవరుగారూ, తోవలో నేదైనా శరీరము, మను ష్యులది, బండిక్రింద పడిపోయిందా?'

'ఏదీ అలాంటిదేమీ జరగలేదే. ఏమిసంగతి?'

'జరగలే దని నిశ్చయంగా చెప్పగలరా?'

'ఎలాగ చెప్పడం. కిక్కుమనకుండా చస్తే మా కెలాగ తెలుస్తుంది? జరగలేదంటే మాకు కనబడలేదన్నమాట.'

'అంటే క్రిందపడిచచ్చిపోవడానికి వీలుందంటారుకదూ'

'ఉందన్నమాటే, ఏమీ! యెవరైనా చావడానికి ఈ పట్టీలమీాది కొచ్చారా ఏమిటి.'

‘ఔనండి.’

‘అయితే ఉండండి. చూదాం’ అని ఇంజనుకు ముందున్న చేటవంటిదానిని చూచి ‘ఏమీ గురుతు లున్నట్టులేదే. చెప్పలేము. గురుతుల్లేవని చావలేదనీ చెప్పలేము. నిశ్చయంగా చచ్చియుంటాడనీ చెప్పలేము’

‘హాన్నా! ఒక మణిపూసలాంటి ప్రాణం ఈవేళ నీ బండిక్రింద పడిపోయిందన్నమాటే! ఛీ!! ఇంతమందిమీ ఉండికూడా ఇలాగు చేశేశాము’ అని విసుగుకొనుచుండెను.

ఇట్లు వీరు సంభాషణ చేసికొనుచుండ ట్రాలీ కమ్ముల ప్రక్కను తిరుగ ద్రోసివేసిరి. కింకరును లోనికి రమ్మని డ్రైవరు కోరెను. అందుకు కింకరు ‘నేనింక యీ కలకత్తాకెందుకు రావాలి. సరి! నాకూ కలకత్తాకున్నూ’ అని యనుచుండ నుపచోదకుండటకు వచ్చి సంగతిని తెలిసికొని ‘అయ్యా, ఇతనెవరో చూడండి.’ అని యఱచెను. కింకరు లోపలకు పోయి చూచి ‘అచ్ఛా! అదృష్టం!! మాష్టర్, మాష్టర్, మాష్టర్, జీవముందా? అనెను.’

‘బంగారంలా గుంది. ఇప్పుడే ఎలా గొచ్చాడో వచ్చి పడుకున్నాడు.’

‘ఎలాగొచ్చాడు చెప్మా?’

‘అడుగుదామంటే మరిలేదు. సొమ్మసిల్లి పోయినట్టు పడిపోయాడు.’

‘అచ్ఛా, అదృష్టం, పోనీయండి, బండి పోనీయండి. డ్రైవర్, ఇతనెవరో తెలుసునా?’ బండి పోవుచున్నది. పై

విషయములవలన బండియంతయు నొకటిన్నర నిముష మాగి యుండెను. పోవునప్పుడు కింకరు ట్రాలీవారిని చూచి 'ఒరే! యెవరైనా బండి యెందుకు ఆగిందంటే, ఎవడో బండిక్రింద పడిపోయి సచ్చాడు ' అని చెప్పండి ప్రజంట్లకోసం ఠాణాకి రండి.' అని యరచెను డ్రైవరు 'ఇతనెవరో నాకు తెలిసే తెలియదు. ఇంతసేపూ మా కోల్మ్యాననుకున్నాను. కాని మీ చర్యనుపట్టిచూస్తే ఇతనేదో పోలీసో డిటెక్టివో, లాగ కనిపిస్తున్నాడు. అంతేనా ? ' అనెను.

'అంతే—కాని చూడండి—ఈవేళరాత్రి బండిక్రింద పడి ఒక మనుష్యుడు చచ్చిపోయాడని రేపు న్యూసు ఊరంతా పుట్టిపోవాలి. రేపు పేపరులోను కూడా అలాగేఉండాలి. తెలిసిందా ? ఇది డిటెక్టివ్ బాబూ అరిందమ్ జానూన్ గారి ఆర్డరని మనసులో ఉంచుకోండి ఇది పెద్ద గవర్నమెంటు కేసు. చూశారా, దొంగరూపాయలు చేసేవార్ని పట్టడానికి ప్రయత్నాలు తోవలో ఈ కష్టాలు తెలిసిందా? '

'హా ! అరిందమ్ బాబుగారే! ఈయన. అందుకే అంత సాహసం - అంటే జోరుగా వస్తున్న బండిమీదపడి చెక్కుచెదరకుండా ఉన్నాడన్నమాట. ఆ ధైర్యమును చూస్తేనే గుండెలు ఇలా గ్గాభరా అయిపోతాయి. అమ్మోనాయినా బలే! బలే! మళ్ళీ వచ్చాడు ఈవూరికి! ఇక నూరంతా బాగుంటుంది భేష్! అని డ్రైవరును అందఱును మెచ్చుకొనుచుండిరి. స్టేషను దగ్గర బండి నిలిచిపోయెను. అరిందమ్ భద్రముగ తీసుకొని

పోఁబడెను. వెంటనే బండిక్రింద నొక మనుష్యుఁడు, కూలి వాఁడు, పడి ప్రాణములు బాసె నని స్థల విచక్షణలతో నా యర్ధరాత్రియే పోక్కిపోయెను. అదేప్రకారము రిపోర్టులు అన్ని డిపార్టుమెంటులకును పంపబడినవి.

జమీలియాను ప్రేమించుచు, నాకతంబున నరిందమున కింత యరిష్టమునిచ్చిన యా గులాబ్ సింగు దూరదూరమునుం డియే, బండి తా నెతింగిన యాచోట నాగుటయు, మరల పోవుటయు, చూచి సంతోషించి, వడివడి నటకు వచ్చుచుండ ట్రాలీవాని కెదురుపడెను. అదిచూచి 'బండెందుకురా ఆగింది అక్కడ?' అని యడుగ 'ఎవడో ఒకకూలోడు లాంటోడు బండికిందపడి సచ్చాడు, ఆడికి ఆయువు చెల్లింది. సచ్చాడు' అని బదులు చెప్పెను.

'ఎక్క డెక్కడ?

'అదో ఆ వొంకర్లో'

'ఏమయినా బతికేనా?'

'బతికడమా? పిప్పిపిప్పి అయిపోతే! సింతపండు ముగ్గులా గయిపోయాడు మరి బతకడమే' అని ట్రాలీని తీసికొనిపోయిరి.

పాప మా రాత్రి నీ గులాబ్ సిం గాచోటికిపోయి చూచనేకాని యేమికానవచ్చును? తుదకు, ట్రాలీత్రోసివేయుట, మరల నమర్చుట, మొదలగు పనులవలన నయిన చిన్నె లన్నియు నాకళేబరమును దీయుటయందయినవిగా నెంచుకొని యూ లపైంచుచు, లోలోనఁ బాధుకొనుచు, గృహోన్ముఖుఁడాయెను.

# పదునారవ ప్రకరణము

---

## అన్నా! అరిందమ్!!

తెల్లవారినది. వార్తాపత్రికలలో నెక్కడఁ జూచినను 'ఆకస్మిక మరణము' అను పేర కిడర్పూరులోని దృఢదేహుఁడు ఒకఁడు రైలుబండిక్రిందఁబడి మడిసెననియుఁ నాతఁడట్టుల జచ్చుట యుద్దేశపూర్వక మనియుఁ, గాకున్న రైలు కమ్ముల పై నట్లుల నుండుట కెటనిశ్చించ వలియు ననేకరీతుల యూహలు ప్రకటింపఁ బడెను. పోలీసువారు చావునకుఁ గారణము తెలిసికొనుటకును బహువిధములఁ బ్రయత్నించుచుండిరి. జువినాలి యా విచారముతో వార్తాపత్రికలఁ జదివి 'ఆహా చాల గొప్పవాడు గతించిపోయినాడు. చాలా గొప్పవాడు. నే నెన్ని యెత్తులు వేస్తే అన్నిటికీ అన్ని పన్నాగాలు పన్నేవాడు. చూడు! మొన్న రాత్రి ఆ యింటిమీదికి పంపుతానేమో అని గభీమని వాళ్ళ వ దర్నీ ఎక్కడికో మార్చేశాడు! మార్చేశా డేమిటి అక్కడికి వెళ్ళి మావాళ్ళకోసం యిల్లు ఖాలీచేశాడు చక్కగా లోపలికి వచ్చిన తరువాత ఏదో మాటతో తలుపు మూసేశాడు. ఇంతా నేనువేసిన మూడెత్తులూ ముక్కలు చేసేశాడు- ఒక్కదెబ్బను. అబ్బా, చాలా తెలివైనమనిషి! పోయాడు! పోయాడు! అయ్యో, పోయాడు!!' అని యనుకొనుచు విచారించుచుండెను.

గరిమీసాల సింగులోపలకు వచ్చి 'హన్నా ఎన్నాళ్ళ కణిగిందిరా బాబూ వీడిపోగరు.' అని సంతోషముగ ననెను.

'చాలా గొప్పసంగతి!' అని పెదవి విరచెను జాముల.

'ఏమయితే అయిందిగాని చూశా ఆముండకొడుకు, ఎంత గడుసువాఁడో. ఆవాచీ చూచా; ఒక ప్రక్క వాచీ. ఒకప్రక్క పొట్టిగ్రావుపెట్టీ. ఏదయినా సంగతి కనుపించిందన గానే చట్టున వాచీ చూచినట్టు చూస్తాడు. మీాట నొక్కేస్తే పొట్టిగ్రావు పడ్డదన్నమాటే! చాలా బాగుంది' అనిసింగ ననెను.

'నీకేమి తెలుసును; ఆయన తెలివితేటలు? బా-బా-మని గొప్పలాగరుస్తేనే గొప్పనుకుంటారు మీారంతా అలాంటి వాడ్నినిష్కారణంగాచంపికోరు ఆ వుసురంతా మీాకుతగల్దా?'

'తగుల్తే తగలనియ్యి. మరేం ఫరవాలేదు. ఇకను మనకా పద్మాబాయి దొరికడాకేం అభ్యంతరముండదుకదా. ఈవేళో రేపో తప్పదు. అప్పుడు నా మనవి, నాకోర్కె, నావాంఛ నాఈప్సితం మరేమిటి చేస్తావో. నిన్నే నమ్ముకున్నానుకదా.

'ఓహో, సరసం! నీకు మహాసమయం దొరికింది ఈ కబుర్లు మాట్లాడ్డానికి! ఎవరితో మాట్లాడుతున్నావో వాళ్ళ మనను కొంచమైనా గ్రహించలేకపోతే మరెందుకయ్యా?'

'అబ్బే! ఊరికే అలాగన్నాను కాని, నీకు మతిపోయిందనుకుంటాను. పగవాడు చచ్చిపోతే ఏడ్పువాళ్ళెక్కడైనా ఉంటారని నే ననుకోలేదు. ఇప్పుడు నిన్ను చూశాను. స్నేహితుడే అయితే ఇంకా ఎంతవిచారిస్తావో!'

'మీలాంటి స్నేహితులు పోతే ఒక్క అరనిమిషం కాదుకదా, రెప్పవేసినంతనే పైనా విచారించను. ఎవరికోసం విచారించాలో నీకు తెలియదు?'

'అదేమిటలాఅంటున్నావు? నేనేచచ్చిపోతేవిచారించవూ?'

'విచారించ ననే నేను చెప్పుతున్నాను. అరవాన్ని చెప్పుతున్నానా ఏమిటి?'

'అంతే?'

'ఆహా! అంతే. ఈవిచారం ఎలాంటిదో నీకు తెలుసునా? ఇవ్వరాని ఈవి, తగినవారికే యివ్వాలిగాని మీలాంటి వాళ్ళకు యివ్వొచ్చునా? కూడదు'

'అలాగా! —'

మరికొంతసే పయిన తరువాత సింగుగారే నోరువిప్పి 'నేను ఠాణాకు వెళ్తాను. మరేమయినా క్రొత్త సంగతులు తెలుస్తాయేమో?' అని యనుకొనుచు రహస్య మార్గమును బట్టి వెలుపలకుఁ బోయెను.

సాయంకాలము వార్తాపత్రికలలో ముఖ్యమైన దేమనగా?

"డిటెక్టివ్ మాయమగుట"

గోపాలచందు అను మారు పేరుతో నేదో యొక కేసు డిటెక్టుచేయుచు, నిన్న ఉదయం 10 గంటలకు భోజ నానంత రమువీధిలోనికి వెళ్ళినట్టున్నూ, మరి కానరాలేనట్టున్నూ తెలియ వచ్చినది. ఉదయం ప్రకటించిన రైలుబండిక్రింద చావు వీని దే

అని బలమగు నిదర్శనలు కనబడుచున్నవట. ద్రోహుల మా గడములు విశేషముగ నున్నవనుట పురవాసు లందరును గమనింపవలెను పోలీసువారు చర్చలు చేయుచున్నారు.

*　　　*　　　*

ఇదివార్త. ఈవార్త జమీందారియాయున్న శిథిలాలయమునకు గూడ విచ్చేసెను. సింగునకు మరి యనుమానము లేదు పై యాలోచనలు చేయుచున్నాడు- తన దైవమునకు బలి యిచ్చుచున్నాడు-తనకోర్కె లీడేరు సమయము వచ్చుచున్న దని గంతులు వైచుచున్నాడు——

ఇక్కడ వ్యగ్రృహములో నరీందమును పద్మాబాయి యుఁ గూర్చుండియుండ నీ సాయంకాలపు వార్తాపత్రిక రాగానే నవ్వుకొనుచు 'పద్మాబాయ్, ఇది చూచావా?' అని యాతఁడా పత్రిక నిచ్చెను. పద్మాబాయి చదువుచు, 'మారుపేరేమిటో?' అని యతనిని చూచెను. అరీందమ్ నవ్వుచుండెను.

'అయితే మీ పేరేమిటండీ'

'నాపేరు గోపాల్‌చందు'

'మీ మారుపేరేమిటో?'

'నా మారుపేరే గోపాలచందు. పొరపాటు.'

'అయితే మీ మొదటి పేరేమిటి?'

'అదేలేదు.'

'అంటే'

'అంటేమేమిటి అది లేదన్న మాట, చూడు ఉందేమో'

'ఓాను ఈ కాగితములో లేదని నాకు తెలుసును. మీ తొలి పే రేమిటో చెప్పకూడదూ?'

'చెప్పడానికి మారు పేర్లు పెట్టుకుంటారు? కింకరుడు చాలా పొరపాటు చేశాడు. పొరపాటేమిటి-అలా చెయ్యకపోతే లాభంలేదనే చేశాడు వాడిదేమీ తప్పులేదు.'

'అయితే చెప్పరుకదూ.'

'చెప్ప ననుకో!'

'చెప్పకపోతే పోనీయండి.'

'పోనీయండంటే ఏమి చేస్తావు?'

'ఏమిచేస్తాను; నేనే పోల్చుకుంటాను.'

'ఏదీ పోల్చుకో చూదాం.'

'పోల్చేదీ—పోల్చేదీ— అరిందమ్ మీ పేరు.'

'అమ్మా గడుసుదానవే! ఎంత గమ్మత్తుచేశావు తెలియనటు! నీ కెవరు చెప్పారమ్మా?'

'మీరే చెప్పారు.'

'ఏమని? ఎప్పుడు?'

'ప్రతిరోజూ నేనే అరిందమ్‌ని అని'

'ఛీ, ఛీ, అబద్ధాలుకూడానా?'

'మీ తెలివితేటలు, మీ సాహసము, మీ యెత్తులు, అన్నీ మరేమని చెప్పుతున్నాయి చెప్పండి. నేను అలా అప్పుడప్పుడనుకొనిదాన్ని, మీ రెంతకైనా సాల్తారుబాబూ.'

'మరేమైనా అనుకున్నావా? అంతేనా?'

'మరేముంది అడక్కోడానికి?'

'ఎందు కిలా మారుపేరు పెట్టుకున్నారో? ఇంకా మ రెవరైనా మారుపేరు పెట్టుకున్నారో? నీ మారుపేరుగురించి కాదుసుమా?'

'మరి నేనే పోల్చుకోలేకపోయాను పోనీయండి గాని, ఇకమీద చర్య ఎలాగుంటుంది? ఇంకా యీ యింటిలో మన మున్నామని వాళ్ళకు తెలియునే తెలియదు గదా?'

'తెలియదు. ఏదో ఎత్తువేసుకొనే ఉంటారు. కాని ఆయెత్తు కాకుండానే రాణాకే వస్తారు — పోవాలి; టైమై పోయింది' అని అరిందమ్ బయలుదేరెను.

'ఏమిటింత ధైర్యంగా అంటున్నారు. తప్పక పట్టుకోండేం. వాళ్ళనందర్నీ తీసుకోరండి. జగత్సింగు మహా తొందరపడుతున్నాడు. ఆ ఆడముండనుగూడా తెండీ తప్పకుండా.'

(అరిందం లెంపలు కొట్టుకొనుచు) 'అలా తిట్టకు. నేను బతకడమంతా దాని దయే అనుకో.'

'చాలుచాలు ఎప్పుడూ ఇలాగ్గానే అన్నా రుండురూ. దానినుంచే పొట్ట పోసుకుంటున్నా మంటారు. దాన్నుంచే బతికా నంటారు. మీకీ పిచ్చి పోలేదు!'

'ఏదో ఈ పిచ్చికీ నీపిచ్చికీ పడదు. పోతాను' అని యిల్లువెడలి తగిన యేర్పాటులుచేసి దాదాపు తొమ్మిదిగంటల వేళకు కిల్లా స్టేషను త్రోవను పోవుచుండెను. త్రోవలో కాన వచ్చుచుండిన యందఱకు నన్ని చోటుల నుండ నియమించుచు

నీ పాడుపడిన యింటిచుట్టును తనవారిని, ఊరివారిని, యుంచి సిద్ధముచేసెను. ఇండ్లు కట్టునప్పుడు వాడుకచేయు పెద్ద బల్ల నిచ్చెన నొకదానిని తెప్పించి దానిపై మెలమెల్లగ జవ్వాదు కారుండ నెక్కి తానే స్వయముగ చే తుపాకి నమర్చి చూడ గాఢాంధకారముగ నుండెను వెలుపలివా రందఱు నీవిషయ మేమిటో యెఱుగక జాలకే 'భూతవైద్యుడు' వచ్చెనని చాటు చుండిరి. ఆబాలగోపాలమును నాచోట నుండిరి.

నిచ్చెననెక్కి చూచూ యంధకారమును జూచి 'అహో ! ఆబుద్ధికి ఆ అందానికి ఈజాగాలా ?' యని యాశ్చర్యము నంది, దీపపుమీట నొక్కెను. పుచ్చపూవువంటి వెన్నెల. లావణ్యమునకు బుటముపెట్టజాలు శరీర విలాసంబుతో జమీలియా నిలువబడి యుండెను. ముఖమున నొక్క చుక్క యయిన నెత్తురులేదు. పిండి యారబోసినయట్లుల నున్న యా వెన్నెలలో నొక పిండిబొమ్మవలె నిలిచిపోయి, నోరు మెదప లేదు—పాపము జమీలియా !

అన్నా అరిందమ్ ! —బ్రతికే ఉన్నావా!—ప్రాణము పోలేదా ? అని లోలోన ననుకొనుచు తనలాంతరుతో వతనిని చూచి పండ్లు పటపట గొఱుకుచుండెను. ఈమెయే యాశ్చర్యమున నున్న, నింతకు కోటిరె ట్లాశ్చర్యముతో నరిందమ్ నిలిచిపోయెను. ఆమె యాకారలావణ్యము లట్టివి. సమాధికి మించిన నిశ్శబ్దమున వా రిరువురును ప్రతిమలై పోయిరి.

ఇచ్చట వర్ణనలు తగవు

---

## పదునేడవ ప్రకరణము

మరేమి ఈ మాయ ? ఆహా ! మహేంద్రజాలము !

'అరిందమా, చాలా సాహసం చేశావు ప్రాణాలున్నందుకు కొంచెము బాగా అనుభవించు, పో—పో.'

తత్తరపాటుగాని ఆందోళనగాని వైద్యనలేదు. అతి సాధారణము.

ప్రాణదానముచేసినట్టి నిన్నువిడిచి నేనొక్కడిన్ని పోరవడానికా, ఇంతదూరమూ వచ్చాను చెప్పూ?'

'ప్రాణదానము చెయ్యడానికీ, నీతో రావడానికీ నేనెవరు, నువ్వెవరు ?'

'నేనెవరో నీకుతెలియునే తెలిసింది, ఇంక నువ్వా, చిరకాలమునుంచి పరిచయముతో కలిసి మెలిసి తిరుగుతూ ఉండే, లోకవిఖ్యాతిని పొందిన జమలవు కావూ ?'

'తెలుసునూ ? నేను జమలనని ఇంతసులభంగా మీ చేతుల్లో చిక్కిపోవడానికిది బ్రాహ్మహాము తెలుసునూ ? అరిందము లాఠుస్సైతేనే గాని పట్టుకోవడం అంటే అబద్ధము అనే పెద్దపులినని తెలుసునూ ? ఇది సింహం పిల్లని తెలుసును కదా ? మరెందుకిక్కడ కొచ్చావు ? పో, పో, ప్రమాదం. ప్రాణాలమీద కెందుకు తెచ్చుకుంటావు ? దూరంగా ఉంటేనే మీలాటి వాళ్ళు మర్యాదా నిలుస్తుంది. వెళ్ళిపో ఆ వెలుగు తగ్గించు.' వెలుగు తగ్గించుచు నరిందము 'జమలా—జమీ

లియా, ఇప్పుడు నువ్వు చెప్పిన మాటలన్నీ యథార్థాలనిన్నీ, నువ్వు సాధారణురాలవు కావు అనిన్నీ నాకు బాగా తెలుసును. ఏదో మహాపాతకం క్రిందటి జన్మలోనే నువ్వు చేసుండకపోతే ఈ నీ రూపు రేఖలకీ నీ తెలివితేటలకీ ఇలాంటిపనులూ ఇలాంటి ద్రోహాలూ చేయడం వ్రాసుండడు దేవుడు' అనెను.

'తెలివితేటలున్నా అని అంటూగూడా నా గుహాకే, వచ్చావ్! నీకు కొంచమైనా గుండెలు తడబడలేదూ. అరీందం, చాలా పొరపాటుచేశావు పెద్దపులిని గుహాలో పట్టుకోడాని కెవడైనా వెళ్తాడూ?

'ఈ మాటల కేంగాని——'

'సరే; నువ్వన్నట్టే కానీయ్ మరి మాట లెందుకూ? వెళ్ళిపో.'

'మరినువ్వో, నాతో రావూ? ఇంతప్రయత్నం చేసుకొని వచ్చానుగదా.'

'ఏమిటె, నన్ను పట్టుకొని వెళ్ళిపోవడానికే. ఖైదులో పెట్టడానికే, వచ్చావూ?' నవ్వుచు జూమిలియా అనెను.

'అదొక కబురా! నిన్ను పట్టితీసుకొనిపోయి ఠాణాలో నుంచి, మా అందరకీ రాణీలాగ చూచుకోవడానికి, ఇటువిను; నాతో చక్కగావచ్చి, దేవీపూరు సంస్థానము కేసులో ఇంకా ఉన్నవాళ్ళనందరినీ ఆపని తప్పించినట్టయితే నిన్ను నా సోదరి కన్న నెక్కువగా చూచుకుంటాను. నీచెప్పు చేతల్లో ఉండేట్టు, ఠాణాఅంతా ఉండే ఏర్పాటులు చేస్తాను. నిష్కారణముగా

దేవుడిచ్చిన నీగుణాలు, నీరూపము అంతా ఆ ఫూల్సాహేబు చేత పాడయిపోయినాయి. ఇకనైనా నా మాట వింటే నిన్ను దేవుడులాగ చూచుకొనేవాళ్ళున్నారు. వారిలో నే నొకడను, నమ్ము. నిష్కారణంగా ఫూల్సాహేబులాగ అంతం పొందుట మేలో కీడో నువ్వే చూచుకో.'

'హా—ఫూల్సాహేబును నువ్వేకదూ అలాచేశావు. నువ్వే, నువ్వే ఆమాటే మరచిపోయాను ఆమాటేజ్ఞాపకముంటే నువ్వునిన్ననే అయిపోయుందువు. పాపమని కనికరించాను. పోనీ అని చేతులారా నిన్ను చంపలేక పోయాను. ఆపని నా చేత ఇప్పుడుచేయించకు వెళ్ళిపో, నరే నీఉద్దేశాలు నీదగ్గరే ఉండనీయ్ నాఉద్దేశాలు నా దగ్గరే ఉంటాయి. దగిపో.'

'మరినువ్వు యిలాగ పట్టు పట్టి రానంటే మరి దిగవలనే వస్తుంది.'

'దిగానంటే ప్రాణాలుపోతాయి అని మాత్రం నమ్ముకోమా! ఇది జమల నివసిస్తూవున్న యిల్లు-జాగ్రత- నాతో మాట్లాడాలనుంటే మాట్లాడు. అంతేకాని పట్టేప్రయత్నాలూ, దిగివచ్చే ప్రయత్నాలూ, మానుకో—నీతరంకాదు.'

'అయితే ఇంతా సాకు దొరకుండా తప్పించుకుంటానని అనుకుంటున్నావా ఏమిటి? ఇల్లు జమీందారిదైతే వచ్చినవాడు అరిందము కాడూ, నీకు దారియిస్తాడూ? జమలా! ఈ వెఱ్ఱిగూడానా?'

'అయితే దిగుతా; దిగుతానంటావేమిటి? దిగూమరి;

'ఇదిగో!' అని చేతుపాకియు దృష్టియు నా జమీలియా మీఁదనే యుంచి, గోడమీఁద నొక్క కాలు పెట్టునరికి 'గుభాల్' మని యాగోడ గుండ పిండియై నేలఁగూలెను. అరిందమ్ మాత్రము తన నిచ్చెనమీఁదనే నిలిచి యుండెను.

'ఔను! నిజంగా ఇది జమీలియా ఉన్నయిల్లే' అనెను.

'నిజంగా నువ్వు అరిందమ్ వే బలే సంతోషించాను. తెలివైనవాడవు. నిజం-నీవు అరిందమ్ గనకే నిలిచావు!'

'ఇకనైనా, నాతో రా.'

'అది ఉత్తమమాటే'

'తప్పించుకో లేవు'

'అది నీకేం తెలుసును?'

'అంతా కావలా; నీమరలూ నీకేళ్లూ పనికిరావు. ప్రతి చోటా పహరా. లోపలనుండి పోయినా దొరికావే పైకి వచ్చినా దొరకానే. నామాట విను.'

'ఒక్కనాటికైనా అలా కాదు సుమా.'

'అదేమ్మాట? నీగోడయెత్తు నిష్ఫలమై పోయిందా? మరెందుకూ. ఇదిగో వస్తున్నాను.'

'ఒద్దు సుమా ఒద్దూ——ఒద్దూ——' అని జమీలియా చెప్పుచుండ నరిందం తనదృష్టి నంతయు నామెపైనే యుంచి, చేతుపాకీ గురి చెదరనీయక మెల మెల్లగ దిగుచుండెను. జమీలియా వెనుకనున్న తలుపు నొక్కసారి చూచి యొక్కయడుగు వెనుకకు వైచుచుండెను. అరిందమ్ ఒక్కింత నిలచి 'జమీలా! లాభం లేదు. ఆతలుపు దగ్గర పదిమం దున్నారు.

నిన్ను పట్టుకొంటి నన్నమాట నాకే దక్కనియ్యరాదా; వాళ్ళ చేతులో పడడం ఎందుకూ? అది నీకు నామర్దానుమా'

'అరిందమ్ ఒద్దూ నామాటవినూ నాచేతిలో తుపాకీ లేదే అని గాబోలు అంత ధైర్యం చేస్తూన్నావు? నాకు తుపాకీ ఎందుకు? గాలే నాకు తుపాకీ, భూమే నాకు తుపాకీ. మీకు తుపాకులు సాయమైతే, నాకు పంచ భూతాలూ సాయం. తిరిగిపో.

'నిన్ను పట్టుకొని మరీతిరిగిపోతాను.' అని మరియొక్క యడుగు ముందునకుఁ బెట్టెను.

గభ్భీ! మని చప్పుడు! ఇల్లంతయుఁ బొగ తండోపతండ ములు!! మందుగుండు కంపు!!! అరిందం చతికిలఁబడి కూర్చుం డెను. పొగతగ్గెను—జుమీలియా మాయం! లేదు!!

ఇంతకుముం దనుకొనునట్లు అరిందం ఈలవేసి 'ఏప్రక్క నైనా వచ్చెనా' యని అందరి నడిగెను. ఏతట్టును రాలేదనియే బదులు వచ్చెను. లోపలనుండి వెలుపల కొక్కచీమ కూడరాలేదని వారు నొక్కి చెప్పుచున్నారు. నాలుగురు గడ్డపారలును గునపములును పట్టి త్రవ్వ నారంభించిరి. గోడ లలో లేదు. భూమిలో లేదు. సొరంగములు కానరావు!

మరేమి ఈ మాయము! ఈ గారడి!

ఆహా! మహేంద్రజాలము!

---

పదునేడవ ప్రకరణము

---

## అవ్వాలి కథ

చేజిక్కి పోయినదని తానెంతయో ధృఢముగ నమ్మి యున్న జమీలియా వ్రేళ్ళసందులనుండి జారిపోయినది. పోయినది. ఈకార్యములో తా నేమాత్రము సశ్రద్ధగాని, తొందరితనముగాని చేయలేదు. ఇంకేరీతిని తానేమిచేసినను నీకార్యము తటస్థించియే యుండును. తప్పదు. జమీలియా యెవ్వడా యింటికి పోయెనో యప్పుడే—ఆనాడే—ఆయుత్తర క్షణముననే, యిల్లంతయు మహేంద్రజాల మయమైపోయి యుండుననుమాట యరీందమునకు దెలియకపోలేదు. అట్టి నాయింటిలో నుండునని తాను నిశ్చయించుకొనియే వచ్చెను. వీలుగల మార్గములకును, తానూహింపజాలిన యెత్తులకును, ప్రతీకారములన్నియు జేసెను. కాని యాశ్చర్యముగ మాయ మైపోయెను. 'నేనెంతాలోచించినాగూడ బోధపడకుండావున్నా ది. ఏమయిపోయింది?—పైకిపోలేదు! లోపలలేదు! చచ్చి పోలేదు! ఏదైనా సొరంగంనుంచి పోయిందనుకుంటే, తానంటే పోవచ్చునుగాని సొరంగంఅంటూ ఒకటెక్కడయినా ఉండాలా మరి? అదీలేదు! అదేమి మాటనొక్కిందో! అదేమిచేసిం దో! కాని మరికనబడునూ? ఆపొగతోనే మాటగూడా పోయింది గాబోలు నాకేమీ బోధపడదు. ఇలాగే ఏమీ

బోధపడకుండా ఉన్న సంగతులు దీనిలోనే కదా. అది అన్నట్టు నిజంగా పంచభూతాలున్నూ దీనికి సాయం చేస్తున్నాయే గాబోలు! లేకుంటే ఇంతగా గడీ ఆ' అని యనుకొనుచు, నాచోటం గొందఱం గావలియుంచి మరలి పోవుచుండెను.

ఇంతకు ముందే, గరిమీసాల గులాబ్ సింగును, మఱి యిద్దరుతోటివాళ్ళను సతిభద్రముగా ఠాణాకుం దీసుకొని రాంబడియుండిరి. అప్పటికి, సంతాలులు, తురకలు, హిందువులు, గరిమీసాలవారు, బుగ్గమీసాలవారు, రాగి గడ్డములవారు, నయి జుమీలియా దండువా రూరిలో చూపరులకు వేడుక నిచ్చుచు, ఠాణాగదులలో, బోనులలోం జిక్కిన బెబ్బులుల చందమున నిటునటుం జెరలాడుచుండిరి. ఠాణాయంతయు ద్రోహులతో నిండియుండెను నిరూపకుల మనసులన్నియు నద్భుతముతో నిండియుండెను. ఊరిలోనివారి చెవులన్నియు వింతలతో నిండియుండెను జుమీలియా మాత్రమెక్కడనో నవ్వుకొనుచుండెనని వేఱుగ వ్రాయవలయునా.

పాపము తనకున్న సహాయమంతయుం బాడయిపోయెను ఒంటరియై తానేమిచేసి యరిందము వంటి మహాఘనుని, మహావరుని, నోడింపగలఁగును? ఒంటరి, యాఁడుది సహాయ శూన్య, యాధార రహిత, బలవద్వైరమున నెట్టులం జయింప జాలును! ఇంక నీ కలకత్తానగరమంతయు నరిందం బోనులతో నిండి పోవును. ఎక్కడం జూచిన నేదియో యెలుక బోనులో

నుండుట తప్పదు అడుగుపెట్టి, తీయుటయు నసత్యముగ నుండును కావున నాతయు విచారించి 'పోని యీదెబ్బతో కళ్ళల్లో ఇసుకకొట్టానుగదా పాప మేమిటనుకొ నుంటాడో! ఇల్లంతా తవ్వి గొప్పపెట్టాడు. అయ్యో! అంతేగాని నేనున్న జాగాఅయినా పోల్చుకున్నాడు కాదు-ఇది అసాధ్యురాలురా అని ఒక్క-దండం పెట్టేవుంటాడు ఈపాటికి ఆ కరీంగాడి సంగ తేమిటా తెలిసిందికాదే. నేను రమ్మన్నట్లు 10 గంటలకు వచ్చాడా ఈపాటికి ఠాణాలో సుఖంగా ఉన్నాడన్న మాటే. ఆముద్దు! పోనీవాడి నరసం తప్పిందీ నాలుగు రోజులయినా! ఇప్పుడునేను వ్రాసిన యీఉత్తరం ఎందుకైనామంచిది కాలూ రాయికి తక్షణం పంపించేస్తాను. ఇకను నేనీ చలిలో నీమంచు లోఉండి ఈచింత గీతాల సంగీతంతో చెవు లెందుకు చిల్లులు పొగొట్టుకోవాలి చెలో! దేవీపూర్ కు-చెలో!

'జో గీ ఆ యా! జొ న్న ల్ ఖా యా,
పా నీ పీ యా! చెలేగయా.'

అని పాడుకొనుచు నొక నిర్జనమార్గంబుఁ బట్టి రోటో పోవుచుండెను. ఇట్లుపోవుచున్న యీ సుందరవిగ్రహంబు నవలోకించి 'అయ్యో! పాపము!' అని యననివాఁడెక్కడయిన నుండునా? ఆ సుందర విగ్రహమునకా యీ యవస్థ? ఆసుకు మారశరీరకా యీ పాట్లు? అనిదాక్షిణ్యము ననుకంపయు నుద్భవించును. నిజమే! కాని యామె యేగుచుండిన దేవీ పూరులో నేమిచేయునో యను ననుమానము కలుగకుండు పాఠకుఁడు నుండుట కూడ నరుదే కదా! * *

మరికొన్ని దినములు గడిచిన యనంతరము పద్మాబాయి యొకనాడు 'మరేమైనా భానోజీగాడిని గురించి తెలిసిందా?' అని ప్రశ్నించ, నరేందర్ 'లేదు - చమారాగూడా రాలేదు భానోజీగాడంటూ ఒకడున్నట్లే కనబడదు. ఇప్పుడు ఠాణాలో ఉన్నవారిలో ఒకడలా మారుపేరు పెట్టుకొని ఆటలాడి ఉంటాడు. ఆటలాడుతుంటాడంటే బోధపడ్డాదా?' అనియనెను.

'ఎలా బోధపడుతుంది? నాకు బోధపడాలని మీరు మాట్లాడేనా ఒకటి?'

'మరేమని మాట్లాడానంటావు?'

'ఏదో మరో డిటెక్టివ్ గారితో మాట్లాడుతున్నాననే మాట్లాడినారు. అలాకాకపోతే ద్రోహుల్లో ఆరితేరిన ఆ ఆడదానితో మాట్లాడినట్లు మాట్లాడుతున్నారు'

'బాగ అన్నావు - ఈ ఆడదానితో మాట్లాడుతున్నాననే మాట్లాడాను. ఆట లాడుతుంటాడంటే ఈ ఆడది అలా ఆట లాడించుంటుందని నా అర్థం.'

'అది నా కెలా బోధపడ్తుందీ-అని నా యర్థం.'

'ఏమీ యిదిబోధపడదూ? ఇంతా తెలిసినతరువాత!'

'ఎలా తెలియడం. ఒక్క ఆడ దింతపని చేసిందంటే ఎవడు నమ్ముతాడు ఆడది రాజ్యానికి రాజ్యం ఒళ్ళో పడేసుకోవాలని చూస్తుందా? గొప్పగొప్ప మగవాళ్ళకే అలాంటి సాహసం ఉండదుగదా.'

'అలాగేం! ఇప్పు డది చేసినపన్నీ ఆడదిచేసిన పనుల్లా గే కనబడుతున్నా య్యేమిటి? ఇంతమంది పోలీసువాళ్ళకున్నా తలా ఒక దెబ్బతో మొఖం తిరిగిపోయినట్టు చేయడానికి ఏ ఆడది సాహసిస్తుంది! పద్మాబాయీ! దాని సంగతి నీకు తెలి యదు. అది ఇంకా అందరిలాంటి ఆడదే అని అనుకుంటున్నా వు. ఉండు ఒకనాడు దాని చరిత్ర అంతా చెప్పుతాను. గుండెలు బద్దలయిపోతాయి వింటేనే'

'ఏది! ఈకేసులో చరిత్రే!'

'కాదు, కాదు-కాదేమిటి? ఈకేసులోని చరిత్రే గుం డెలు బద్దలుగొడితే, ఇంతకుముందు చరిత్ర అమాంతంగా చంపేస్తుందన్నమాటే!'

'అయితే ఇప్పుడు కొంచెం చెబుదురూ. వింటాను'

'ఇప్పుడు చెప్పను.'

'ఏమి?'

'అదెవర్తో ఆడ దనుకుంటున్నప్పుడే ఇంత గాభరాపడి మరొక ఊరికి పారిపోతానని అంటున్నదానవు. దాని చరిత్ర అంతా తెలుస్తే నన్నీ కేసులో సరిగా ఏమైనా చేయనిస్తా. తత్క్షణం వెళ్ళి దాని పాదాలమీద పడిపోయి, అమ్మా నువ్వే దిక్కనవూ.'

'ఓస్! ఏమి యెగతాళండీ?'

'ఎగతాళేంటి? అంతపనీ నువ్వు చేసితీర్తావు. అంతే కాదు అదిప్పు డెక్కడికి పోయిందో దానిదగ్గరికి నిన్ను తీసు

తీసుకు వెళ్ళమనీ నన్ను ప్రయాణం చేస్తావు గూడాను. నాకు తెలుసును.'

'అన్నట్టు—ఈ కబుర్లకేం గాని—అది యిప్పు డెక్కడికి పోయుంటుంది?'

'ఏదీ, ఆభోగట్టా ఏమీ రాలేదు. ఈ ఊరులో ఉన్నట్టు జాడ లేమీ లేవు'

'అయితే భానోజీదగ్గరకే పోయుంటుం దనుకుంటాను.'

'భానోజీ అన్నవా డెక్కడ వున్నాడు?'

'దేవీపూరలో.'

'ఇంతసేపూ నేను చెప్పిందంతా ఏమిటి? భానోజీ అన్నవాడు దేవీపూరులో లేడు. నాకా భోగట్టాఅంతా వచ్చింది.

'పోనీ అలాగేఅనుకోండి తాను దేవీపూరుకిపోకూడదూ?'

'అక్కడికి పోయి ఏం చెయ్యాలని.'

'దాని రాజ్యం పూజ్యం చూసుకుంటుంది.'

'దానిరాజ్యం పూజ్యమే (సున్న) అయింది.'

'అదిగో మళ్ళీ బోధపడకుండానే మాట్లాడుతున్నారు. చక్కగా మాట్లాడుతున్నారు. చక్కగా మాట్లాడుదురూ నాయనా!'

'దేవీపూరులో దీన్ని రానిచ్చేవా రెవ్వరూ లేరు. జాల్వారు ప్రభువు రాజ్యమంతా తన చేతుల్లోకి తెచ్చి తానే రాజ్యం చేస్తున్నాడు.'

'అదేమిటి! అలువుడ్ని బలువుడుకొడితే, బలువుడ్ని బ్రహ్మదేవుడు కొట్టాడన్నట్టు వీళ్ళ చేతుల్లోనుంచి వాళ్ళు తీసుకున్నారూ! ఇక మనకు దక్కదన్నమాటే, ఇంతశ్రమా బూడిదలో పోసిన పన్నీరేనా? అన్నా!'

'ఏమి టలా ఈదేస్తున్నావ్! జాల్వారు మహారాజు తీసుకోలేదు మన ప్రార్థనమీద, వంగతుంటన్నీ తెలిసి అయినంతవరకూ తానే చూచి, ఆఖరి కెవరిది హక్కని దృఢపడితే వారి కిచ్చేటట్టు ఒప్పుకున్నాడు. దానివల్ల భయముందా?'

'అదీ చేశారు! మంచిపని చేశారు. మరిక్కడెందుకు ఉండడం? రండి పోదాం — అక్కడికి'

'ద్రోహులో! — మిగిలిన వాళ్ళు? శత్రుశేషం ద్రోహం.'

'మరివాళ్ళు దొరక్కపోతే ఇక్కడ అజ్ఞాతవాసం చేస్తూ ఉండిపోవడమే?'

'దొరకడం లేదంటూ ఒకటి స్థిరపడితే అంతే అన్న మాట. వాళ్ళు బతికి పైనుండగా నువ్వు అక్కడికి వెళ్ళి రాజ్యంచేస్తా?'

'ఔను. నిజమేగాని, మ రెన్నాళ్లిలాగ?'

'వాళ్ళు దొరికినందాకాను.' అని పోవుటకు లేచెను.

'అదేమిటి లేచిపోతున్నారు? వాళ్ళున్నప్పు డంటే ఊరికే అంతపనుండేదిగాని, ఇప్పుడేమిటండీ ఆతొందర? ఒక 5 మినిటు గూడా ఇంటిలో నుండరు?

'నాకున్న కేసులన్నీ నీవే అనుకుంటున్నావా ఏమిటి?'

'అఁహా——అలాకాదు. ఇంత అర్జెంటు కేసు అని.'

'ఇంతకన్న తొ. థైరెటు అర్జంటు కేసు ఒకటుంది. ఆ తురకముండాకొడుకులు మహాచిక్కులు పెడుతూ ఉన్నారు. వారిని సాధించాలి, సాధించాలి' అని అడుగులు వైచుచుఁ బోయెను.

'హమ్మా! నాయనా! ఏమిపనిరాబాబూ! అన్నీ అడకత్తెర్లే! ఎలాగు ఇన్నింటిలో జయించుకోనొస్తారో తెలియదు. ఆ బుఱ్ఱలో మఱెన్ని అరలున్నాయో, గాని అన్నింటిమీద దృష్టే. అన్నింటిమీదా ఆలోచనే' అని యనుకొనుచుఁ బద్మాబాయి మరి పదిదినములలోనైనా తేలదాయని యూరకుండెను.

---

# పందొమ్మిదవ ప్రకరణము

---

## రోగిని

పెక్కునాళ్ళేఁగెను.

* * * ఈలో నరీందమ్ ఆ తురకల కొఱకనేక రీతులఁ బ్రయత్నములు నేయుచుండెను. ఇంకను కలకత్తాలో నరీందమ్ ఉన్నాడనుమాట యెవ్వరు నెఱుఁగరు. ఎఱిఁగినవారు పరులతో నొక్కయక్షరమైనఁ బలుకరు. అరీందమ్

బొంబాయి పోయినాడనియే యాట నట ననుకొనుచుందురు. ద్రోహులఁ బట్టను విచారణకు వచ్చిరి కఠినదండనములు వారలకు నేడో రేపో విధింతురను వాడుక యూరంతయు నిండుచుండెను.

ఆ తురకల నెంతపట్టుకొనఁ జూచినను నరిందమునకు వీలు దొరకకుండెను. అందులో ముఖ్యుఁడగు కాలూరాయి జామీలి యాకు అరిందము బొంబాయిలో నున్నాఁడని చెప్పినవాఁడు మిగుల నసాధ్యుఁడుగాఁ దోచుచుండెను. విషయ మేమియో నెవ్వరు నెఱుఁగరు.

ఒక్కనాటి సాయంకాల మరిందం ఠాణాదగ్గర జతీంద్ర బాబు తోడను మంగళ్సేనుతోడను గాలికొఱకుఁ బ్రచారము చేయుచు నేదియో లోకాభి రామాయణముం గూర్చి ముచ్చటించుకొనుచుండిరి. కింకరు దూరమున నేదియో యొక వార్తాపత్రికను జదువుచుండెను. పొంతనుండు సరోవరము మీఁదుగ వచ్చుచుండు తెమ్మెరలు కమ్మనితావుల నీనుచుఁ జల్లదనమ్మున డెందమ్మున నెత్తుచున్నవి. బాటం బోవువారల ముఖంబు లరవిందంబుల యట్లు కళఁ గలిగి యంతర్గత సంతోషంబును వెల్లడిఁ జేయుచున్నవి. బాలు రాటలనుండి మగిడి యిండ్లకుఁ జేరుకొనుచు, దమతమ యాటల పాటవంబుల విమర్శించుకొను చున్నారు. చక్కని గుఱ్ఱపుబండ్లపై సామంతులు దమ పుల్కాలతోడను, పింజ పెట్టే నులిపి యుంచిన యుత్త

రీయంబుల తోడను, పెగ పిగల మిగుల దువ్విన మెుంజొట్టల తోడను, సల్లాపంబుల నాపుకొనుచుఁ బోవుచున్నారు. కార్యాలయమునుండి యిండ్లకుఁ బోవువారలచే సంపూరితములయి, యింక నెటుపయిన నాగిన నెవ్వారైన నెక్కుదురో యను భయంబునఁ గాబోలు ట్రాముబండ్లతి శీఘ్రగతిని టంగ్ టంగ్ అని చప్పుడు చేయుచు బోవుచున్నవి. వీథియందలి నాలు గంతస్థుల మేడల యుపరిభాగంబుల వెలుందు లందందు నందంబుల సందె మేలంబు లొసంగుచు ప్రచార విచారణంబులఁ బ్రొద్దు పుచ్చుచున్నారు.

అట్టి యీ సాయం సమయమున నరేందర్ తనవారిని నలుగురఁ బిలిచి కాలూరాయి జాడ నెటనైనం గనుపట్టునేమో యని జూడఁ బంచెను. అందు తన శిష్యుఁడగు చౌధరీ కేమే మియో కొన్ని రహస్యములఁ దెలిపి——

'నీవుమాత్రము తొందరపడకుమా! ఆజాగా, ఎలాగుంటుందో, వాళ్ళుచర్య లెలాటివో, మరేమయినా దిమ్మలు అచ్చులు ఉంటాయో లేక సాధారణంగా ఇల్లులా గుంటుందో అంతా అతి జాగ్రత్తగా కనుక్కొని రావాలి. మహాజాగ్రత్తగా కనుక్కొనిరావాలి. మిక్కిలి జాగ్రత్తతో మెలగాలి సుమా వెళ్ళు' అని చెప్పెను.

'చిత్తం అవసరముంటే నే నక్కడనే ఉండిపోతాను' అని సెలవుతీసుకొని పోయెను.

'అబ్బా ! ఈవే శంతా ఎంత మొద్దులా గున్నాదీ ! ఏమీా చురుకుతనం లేదు ! ఛీ—ఒరే, ఎవఁడ్రా అక్కడ ! తోడా గుడాక్ లేఆవ్' (కొంచెము హుక్కా తీసుకొనిరా) అని యాజ్ఞాపింప, 'జీ ! హుకుమ్' అని యొకఁడు దెచ్చిన హుక్కాను బీల్చుచు నేమేమియో మాట్లాడుచుండెను.

ఇంతలో నొక వందుముసలి యోగినిని వెంటఁబెట్టుకొని యిద్దరు కానిస్టేబుల్సు ఠాణాకువచ్చి సలాములుచేసి, 'ఇలా గొచ్చి నిలబడు !' అని యా యోగినిని నాజ్ఞాపించిరి. 'ఇదేమి' టనగా నం దొక్కఁడు (రైల్వే పోలీసు కనిస్టేబు) 'చిత్రం, ఈముసలిముండ—' అనుచుండగా నా యోగిని 'దేఖోమాలిక్ దేఖో, ఓ క్యా ఖరాబ్ బాత్ హాయ్' (చూడు బాబు, చూడు అదేమి టా చెడ్డమాటలు) అని నడుమననెను! వాడు దీనినిలక్ష్యముచేయకయే 'కరాబ్ బాతూ లేదు, గిరాబ్ బాతూ లేదు. నువ్వు నోరుమూసుకో ముందు ?' అనెను.

'నీ నోటికొచ్చినట్టు నువ్వు కూస్తుంటే నేనే నోరు మూసుకోవాలా—హారే, గ్రహచార్ ! జేయ్ శాంకరీ !'

'శాంకరీ ? నీ శాంక రొస్తా దుండుండు'

'అచ్ఛా ! బోలో, బోలో (చెప్పు—చెప్పు), హారేరాం హారేరాం' అని గూా నేలనే చతికిలఁ బడి యున్నని పెద్ద నిట్టూర్పువిడిచెను. 'అచ్ఛా! తుమ్, ఒయిసాబైరో, యోగిన్— అని యేమియో మంగళ్లేను చెప్పుచుండ 'చూచారా ! మీా

రెలా మాట్లాడుతున్నారు. అత నెలాగ మాట్లాడుతున్నాడు ? ముండా గిండా అని.

సాధూ, జోగీ, ప్రవ్రాజక్
దూషణ్ కర్నా, దోష్.
చంబేలీపర్, చడ్నా మత్,
మన్మేరఖ్నా, మేష్.' అన్నాడు.

(సాధువులను, యోగులను, పరివ్రాజకులను, దూషించుట యెప్పుడును దోషము. తలమీద పెట్టుకొని పూజించుచున్న మేలి మల్లియలపై త్రొక్కుట మాను. ఈమాట యెల్లప్పుడును మనసులో పెట్టుకొనుము)

'సరేలే ! ఓయ్ చక్కగా మాట్లాడు' అని జతీంద్రబాబు పలికెను.

'చక్కగా మాటాడ్డం ఏమిటిబాబూ, ఎక్కడున్నాంచో అలా టిక్కట్టు లేకుండా వెళ్ళిపోవచ్చింది స్టేషనులో పట్టుకున్నాడు టిక్కటు కలక్టరు దగ్గర దమ్మిడీలేదట ! పెద్దపెద్ద మాటలుమాత్రం జోరుగా ఆడ్తాది. ఠాణాలో పెట్టమని నా కొప్పచెప్పాడా రమ్మంటే ఒచ్చునా ? కాశీ వెళ్ళిపోతాదట ! అంచేత రాదట ! ఇప్పు డిలాగుంది గాని అవేం మాటలూ ! అదేం జోరూ ! అక్కడున్నవాళ్ళంతా ముక్కుమీద వేళ్ళు పెట్టుకొని అలా నిలబడిపోయినారు పోలీసువాళ్ళంతా దమ్మిడీకి చెయ్యరనే దీని ఉద్దేశం. మాకు నిజంగా సిగ్గువేసింది అదేం

జబర్దస్తీనాయనా, మే మెక్కడా చూడలేదు ! ఏదో బతి మాలుకోని తప్పించుకోవాలా ! అలాకాకుండాట, జబర్దస్తీచేసి జయించేద్దామనే దీని ఊహ !" అని కానిస్టేబిలు చెప్పెను.

'జేయ్! శాంకరీ! ఎందుకు బ్రతిమాలుకోవడం. ఎవరి పనని బతిమాలమంటావు ? జగదీశ్వరకా కాం ! అన్నపూర్ణకా పని. నే నెందుకు బతిమాలాలా అంటాను. జబర్దస్తీ కాదూ ? మీా దొరలపనంటే మీారు జబర్దస్తీ చెయ్యొచ్చునూ ? మా దొర మా జగదీశ్, మా రాజాధిరాజాగారి పనికి జబర్దస్తీ లేదూ ! ఆపనికి అడ్డుచెయ్యరాదు ముర్దార్నై ! ఏమిటనుకు న్నారు ? జేయ్ ! అన్నపూర్ణ భగవాన్ !'

'చూచారా ! ఇలాగే, ఆ తురక టికెట్టు కలక్టరుతో కూడా దెబ్బలాట! వా డసలే కర్కోటకుడు, ఠాణాలో పెట్టు మని రిపోర్టు చేశాడు'

'చేసుకోనీ ! ఎవడ్ని పెడతావు ఠాణాలో! అంత కళ్ళు మీాదికొచ్చిన మాటలాడి, నా మూటాముల్లె పడుమంటాడేం? మరి నేనే రిపోర్టుచెయ్యనూ ! హారేరాం ! హారేరాం' మహో రౌద్రము చూపించుచుండెను.

'ఏయ్ గడ్బిడ్‌మత్! యోగిన్, అలా తొందరపడడం నీకుతప్పు; తెలిసిందా ' అని దయార్ద్రహృదయుండగు నరీం ఖము అనుచు. లోలోపల 'దీనికి భక్తి కాక, పిచ్చే జాస్తీగా ఉంది.' అని అనుకొనెను.

'తొందరపడడం కాదు బాబాజీ-కాసు. వాడికీ, వీళ్ళకీ ఎంత అధికారమున్నా దేవుడివనికి ఆటంకమా? సూర్యభగవాన్ చూస్తున్నాడు కాడూ? పెద్దాచిన్నా చూచుకోవద్దూ? అందర్నీ తూల్నాడియ్యాడమే? జోగీ అని పేరు పెట్టుకున్నా బురుడుదాసులంతా ఒక కాసు చేతిలో పెడతే ఒదిలేస్తాడూ! అప్పుడు టిక్కెట్టుబద్దూ! ఎంత మహాత్మున్న వాళ్ళయినా కాను ఇవ్వక పోతే తప్పా? టిక్కెట్టు కావాలా? ఆహా! తమాషా! దేవుడు జగదీశ్వర్ అంటే ఇంత అజాగ్రత్తా! కాతరు లేదేం! ఉండండి ఉండండి, వీళ్ళందరికీ తగినశిక్ష వాడివ్వడా?'

'వాడివ్వడమెందుకూ? నువ్వే ఇచ్చికూడదూ?' అని యొక యారక్షకుఁ డనెను.

'ఓ, చూస్తా, చూస్తా. నేనే ఇస్తా శిక్ష, ఏమిటను కున్నావ్, మహాత్మా అంటే, కావాలా చెప్పు, ఇస్తాను చూద్దువుగానీ! అలాగేం? మా సంగతంతా చూపిస్తాను చూడూ! ఎగతాళీ అంతా ఎగిరిపోవాలి.' అని కన్నుల చింత నిప్పులు రాల, నచ్చటి వారందఱును గిజగిజ వణకునట్లు ఆ ముసలి తన మంటయు మూలనుంచి, కూర్చుండినది లేచిపోయి ప్రళయ కాలరుద్రునివలె ననుచుండెను

'హా-హా-యోగిన్, హా సీ-హా సీ!—ఓయ్ తొంబై నాలుగూ నువ్వెళ్ళిపో, వాళ్ళతో నేమిటి నీకు? ఏ పుట్టలో ఏపాముంటుందో ఎవరికి తెలుసును.' అని జతీంద్రబాబు వారిని దోలెను.

'అయితే, నీ దగ్గర దమ్మిడీ లేదంటావుగదా, ఛార్జీ ఇవ్వకపోతే వాళ్లొదలరే. మరేలాగ యోగీ?' అని మంగళ్సే ననెను.

'ఎలాగేంటి? మా దగ్గర ధనం ఎలాఉంటుంది? మేమేం గణిస్తామా? యాచించుకుంటామా? భగవాన్‌కా యిచ్ఛా'

'అలా అంటే తెముల్తుంది? అలాంటిదానవు రైలు మీాద ఎక్కనే కూడదు? ఎక్కిన తరువాత ఒదిలేస్తారా?'

'ఒదలాలి-ఒదలకేం చేస్తారు? భగవాన్‌కా నామ్‌కీ సేతో (దేవుడు పేరు చెప్తే) ఒదలాలి, నోరెత్తకూడదు.'

'అలా అంటే అవుతుందీ? దేముడు పేరు చెప్పిన వాళ్ళ నంతా ఓదిలేస్తే అంతా భక్తులమే అంటారు.' అని జతీంద్రు డనెను.

'అనీగానే నరా-మహాత్ముపోయిందేమిటి? దాన్ని చూచుకోండి, ఆ మహాత్మున్నా వాళ్ళనే ఒదలండి; మాలాంటి వాళ్ళని బాధ పెడితే సరిపోతుందా?'

'బాగా అన్నావుగాని, ఇప్పుడు నువ్వేవొచ్చావు, నువ్వొక పెద్దయోగినీ నంటున్నావు నీదగ్గిరేమి మహాత్మున్నాదో చెప్పు చూదాం.' అని యురీందమ్ అనెను.

వారందఱును నీ ముసలిముండకు పిచ్చిపట్టినదని లోలోన నిర్ధారణ చేసికొనుచున్నారు. పిచ్చివారిని చూచినప్పుడానందము కలుగునుగదా-ఆ ఆనందము ననుభవించుచు వారందఱు

మాట్లాడుచున్నారు. అంగలకు తగినట్టుగూడ నాముసలిది ముడతలు గట్టి చేపపొలుసువలె బీటలువారి, యొక్కడికక్కడ వ్రేలాడుచుండు శరీరముగా, పెద్ద గూనియు, చొక్కిదవుడలును నెరిసిన వెండ్రుకలును గలిగి వికృతాకారముగ నుండి సాధువుల పరికరములతో గూడ నుండెను. మాటలాడుచు, నారాయా వేశమునకు వగర్చుచు, రామ్ రామ్ యనుకొనుచు, పెదవులం దడుపుకొనుచు, నప్పు డప్పుడు గూనిని సవరించుకొనుచు నందఱకును గనికరము గలుగఁజేయుచుండెను. నీదగ్గర నే మహాత్మ్యున్నదో చెప్పుమని రాముడువలి నడిగినంత నారాయా గిని, 'నాకొకటేమిటి, వైద్యం అంటే శరీరములో ఉన్న 72 నరాల్లో పుట్టే 64 విధాలయిన రోగాలకీ చెప్పినట్టు వినే మూలికలున్నాయి, మూలికిచ్చిన మూడగంటలకి వమూలంగా రోగం పోవాల జోతిషం అంటే ప్రశ్న, మూహూర్తం, జాతకం, భవిష్యత్తు అంతా అలాకంటికి కట్టి నిదర్శనం ఇచ్చేటట్టు చెబుతాను. జేయ్ శాంకరీ, భగవతీ కరుణాకర్; శాస్త్రంఅంటే—' అని చెప్పుచుండగా మంగల్ సేను నడుమవచ్చి 'ఏదీ చూదాం, ఇతనికి పెళ్ళెప్పు డవుతుందో చెప్పూ' అని జత్తీబాబును చూపెను.

ముసలిది జేయ్‌శంకరీ అని, నిమీలితలోచనయై మీాదకి చూచి యేమేమియో లెక్కించుకొని 'అచ్ఛా! ఈ బాబుకి పెళ్ళి అవుతుంది. చాలా శీఘ్రకాలంలోనే అవుతుంది. బాబు

మనసు అందరిలాంటి మనసుకాదు. నలుగురూ మంచిది కాదనేపనే లాను చేస్తానంటాడు ఒక్క ఆడదానిమీద మనసు పెట్టాడు. అదేం చేస్తుందో తెలియదు, గాభరా పడతాడు. చాలామంది నిందిస్తున్నారు, కాని పెళ్ళి వేగం కావాలి ప్రశ్న ఫలం అలాగున్నాది. ఇంకేం కావాలి? ఏదో అలాచూచి మాకు కాశీయాత్ర చేయించే దారి చూడండి' అనెను.

'అదే అవుతుందా! లేకపోతే మరొక టవుతుందా'

కొంచె మాలోచించి 'అదేఅవుతుంది'

'ఊఁహూ! జత్తీబాబూ! కొట్టూ డావు! ఇంతమంది కూడదనడం పోతుం దేమిటి? దేరీజ్ సమ్ట్రూత్ ఇన్ దిస్ (ఇందులో కొంత నిజముంది') అని తమలో తా మనుకొనిరి.

మంగల్ సేను 'లెటజ్ సీ, (చూదాం) చూడూ అవ్వా ఈ బాబు ఫలం ఎలాగుందో చూడు' అని యరీం దమ్ను చూపెను. అవ్వ యోచించు కొనుచుండెను. 'బలేరే బాబా!' తనలో తా ననుకొనుచుండెను. అయిదు నిముసము లయినను చెప్పుట కారంభింప లేదు. 'ఏమవ్వా, అలా గాలో చించేస్తున్నావూ?' అని మంగళ్సేను ప్రశ్నించెను. 'జాయ్ శాంకరీ మహాత్మా అభినందన్. మహా గొప్ప జాతకం! మహా గొప్పజాతకం! ఈ పాటికే లోకం అంతా మీకీర్తి నిండిపోవాలి. చక్రవర్తిగా ఉండాలి! ఇలా ఉన్నారేం! క్యం శాంకరీ' అని మళ్ళీ ఆలోచించెను.

'ఆహా! అచ్ఛా! శాంకరీ! మనసులో చింత ఉన్నాది. తిన్నా తిండి ఒంటా కట్టదు రాత్రుళ్ళు నిద్రాలేదు. పగలు ఆహారంలేదు. బలేకష్టాలు బలేకష్టాలు భగవాన్ దయాతో జయం కలుగుతున్నాది ఎక్కడికి వెళ్ళినా జయం; కాని మనసులో విచారం నిండా ఉన్నాది' అనెను

'ఎందుకా విచారమో చెప్పగలవా?' జత్తీబా బడిగెను. ఆలోచించి 'శాంకరీ విచారానికి రెండు కారణాలు నిదర్శనంగా కనిపిస్తున్నాయి. ఒకటి ఆడదానిమూలం విచారం చేత, రెండు; పురుష జీవినుంచి విచారం. ఇందులో పెద్దదీ. మనసంతా చిక్కుపెడుతున్నాదీ రెండోది కాని చేతికిచిక్కిపోయినట్టుంటాది కాని చిక్కదు. దొరికినట్టు కనిపిస్తాది. దొరకదు. అందుచేతనే విచారంగా వుంది.'

'దొరుకుతుందా ఫలం?'

'దొరుకుతుంది. దొరుకుతుంది. ఒకరి సహాయంతో వేగంగా దొరుకుతుంది, లేదా కొంచెం ఆలస్యం అవుతుంది.'

'ఆడదాని మూలం విచార మేమిటి అవుతుంది?' అని అరీందమ్ అడిగెను.

'జేయ్ భగవతీ! ఇది మహా చిన్నది. తొంబై తొమ్మిది వంతులు విచారమేలేదు. ఒక్కవం తున్నది. ఆ ఒక్కవంతు గూడా ఫలానికి వచ్చింది. రెండుమూడు మాసాల్లో అయిపోతుంది. ఇది చిన్నది.'

'యెస్, దేరీజ్ ట్రూత్ ఇన్ దిస్ - (అవును నిజమే), అని వారిలో వా రనుకొనుచుండిరి. అరిందమ్ ఆలోచించి 'ఎవరి సహాయంతో వేగిరం అవుతుం దంటావు యోగిన్?' అని ప్రశ్నించెను.

'ఒక ఆడదాని సాయంచేత.'

'ఛీ! ఐతే నీకు దాని సంగతేం తెలియలేదు.' అని యరిందమనెను.

'క్యాం! క్యాం! శాంకరీ నాకు దానిసంగతి తెలియదూ? అలా మా శాంకరి మాటపడదూ! పడదు! అయితే చెప్పనా'

'అలా అయితే యిలా రా' అని దూరము తీసుకొని పోయి, యెవరును విననట్టు చూచుకొని, 'ఏదీ చెప్పు చూదాం' అనెను.

'జయ్ శాంకరీ! విను. కొందరు దుర్మార్గులు, మహా చెడ్డవాళ్ళు, సర్కార్ వాళ్ళకి తెలియకుండా రూపాయిలు తయారుచేస్తున్నారు నువ్వెంత ప్రయత్నం చేసినా దొరకలేదు. లక్షలకొలది రూపాయిలు చేస్తున్నారు. వాళ్ళను పట్టుకోడానికి మహా శ్రమ పడుతున్నావు. ఆఖరికి మారువేషాలు గూడా వేశావు. అందులో చిక్కు కొంచం ఉంది. భగవతి సహాయము కొంచెం కావాలి.'

'అయితే ఏమి చెయ్యమంటావు?' అని యడిగెనే గాని అరిందమ్ మనసు భ్రమించుచుండెను నమ్ముటా, నమ్మకపోవుటా? నమ్ముటకు—ఈకాల మీరీతి మహాత్ములన్న నమ్మ

సాహసించవరుగదా ? నమ్మకపోవుటా ! ఇంతచక్కగ నిజమును చెప్పుచున్నదే, తాను కాలూరాయి కొఱకెంత శ్రమపడు చున్నదియు చూచినట్టు చెప్పుచున్నదే! మోనమా? ఎక్కడి రైలుజట్టీ! ఎక్కడితాణా! ఎక్కడిబార్డ్! ఇంతకుముందు తెలిసెనంటిమా? ఒక్కరైన పరు లెఱుఁగరే! ఏమిది? ఇప్పుడేమియుఁ జెప్పజాలము.

'ఏమి చేయమంటా వనా అడిగావు? శాంకరీ, విను, నువ్వు పుణ్యంచేసి పుట్టావు. చాలా గొప్పవాడివి. అన్నపూర్ణ మాయీకి అభిషేకం చేస్తాగా చెప్పు నే నొక మార్గం చూపిస్తాను.'

'దేనికి ?'

'వాళ్ళని పట్టుకోవడానికి వాళ్ళ అచ్చులతోను, సామగ్రులతోనున్నూ.'

'నువ్వుచెప్పిన మార్గంచేత నిజంగా దొరుకుతే తప్పకుండా నీ యిష్టంవచ్చిన అభిషేకం చేస్తాను—చెప్పు'

'అలాగేనా—సరే చెప్పుతాను కొంచెం నేను పూజ చేసుకోవాలి, నాకు వేళ అయిపోతున్నాది. పూజలో మనవి చేస్తాను శాంకరీకి.'

'అలాగయితే, రా, మాయింటికి పోదాం. అక్కడ నువ్వు పూజచేసుకుని లోగా నేనుగూడా భోంచేస్తాను.' అని యరీందమ్ కింకరుతో నా యవ్వను దీసుకరమ్మని తాను ముందుగ బైస్కిలు మీదఁబోయెను.

'ఏదో, నిజం చెప్పినట్టున్నాది.' అని మంగళ్ళేసనెను.

'హమ్మా! చాలామట్టుకు నిజం చెప్పింది. చేనే ఉన్నదే గాని ఉత్తబురుడు కాదు' అని జత్తిబాబనెను

'అయితే నీ పెళ్ళి—అది—నిజమన్న మాటే.'

'నోరు మూసుకుందూ' అని హాస్యము లాడుకొనుచుండిరి.

---

## ఇరువదియవ ప్రకరణము

## ద్వారమునకు దారము

కింకరుడు యోగినియు నరేంద్రమింటికి వచ్చినతోడనే యోగిని యా యావరణలో నొక చెట్టుక్రిందఁ దన సామగ్రి నుంచి కొంతమేర పరిశుభ్రము చేయించి యందు నిప్పురగుల్చ నిచ్చి, గంజాయిని వేడి, కొంతగాల్చి దాదాపు పెనిమిది గంటల వేళకు 'బాబూజీ! నేను స్నానము చేసుకొనివస్తాను ఆశ్రమం మాత్రం జాగ్రత్తగా ఉంచండి' అని చెప్పిపోయెను.

'నద్దీకు జాకె, స్నాన కరకె, ఫిర్బిఆవుంగా
ఆబీచ్ ఫిర్బి ఆవుంగా.'

అని రాగము దీసుకొనుచు బోయెను. సేవకుడు నతి భద్రంబుగ నాశ్రమంబు గాచుకొనియుండెను.

మరియొక్క పదినిమిషములలో కింకరు టక్కుతో నాదిక్కుననే పోవుచు 'ఆ ముసలిముండ పోయి యెక్కడో

మూలుఁగుతుందంటే మాష్టర్ నమ్మరుకదా! నే నేమిచేసేది? ఈ గాలిలోనూ ఈ చీకటిలోనూ ఎందుకు చెప్పూ! ఏమో, అలా అనకూడదు. ఈ బుద్ధి మాష్టరు కెందుకు పుట్టిందో, ఏమో! ఈముండ ఆనీటిలో పడిపోకూడదా? నేను దాన్ని తప్పించ కూడదా?—అన్నీ సరేకాని. ఇతనికేం చెప్మా దీనిమీద ఇంత భక్తి కలిగింది? ఇది భక్తి—కాక దీనిద్వారా కనిపెట్టడపు సొగుసు అయి వుంటుందా ఇదంతా? మాష్టర్ సాధారణంగా ఎవళ్ళనీ నమ్మే మచ్చుకాదే! లేదా తనకేమైనా లాభకారిగా వుండే సాయం చేస్తుందనే నమ్మకం కలిగిందా? ఈముండ మాష్టరికి లాభం చేసేదేమిటి? ఇదంతా పట్టిచూస్తే ఈ ముసిల్ది ఏదో నెత్తుమీద వొచ్చినట్లు కనపడుతూంది! మాష్టరుకూడా యేదో ఉప్పర్ పేచీ వెయ్యడపు ఉద్దేశంతో వున్నట్టే కనపడుతూంది. ఇంతకీ మాష్టరు పనులూ, ఊహలూ చర్యలూ అన్నీ చిత్రాలు' అని యనుకొనుచు కుక్క వెంట బడిపోవుచుండెను. ఏమియు వింతలు లేవు. నదివరకు పోయి యొకరి తరువాత పదినిమిషముల వెనుక నౌకరువచ్చి యింటికిఁజేరిరి. చేరఁగానే 'క్యాం! మహారాజ్, స్నాన హువా?' అని యరింద మడిగెను.

'హాఁ, బాబూ, హాఁ'

'అచ్ఛా, పూజా కరో.'

'హాఁ! బాబూ' అని పూజలో కూర్చుండెను. దాదాపొక గంటవఱ కట్టుల పూజఁజేయుచుండెను. అరిందమ్ తన

పనులను తాను జక్కఁ బెట్టుకొనుచుండెను. పూజాస్థలమున కరటిపండ్లును పాలును పంపఁబడినవి. కాని యారోగిని వాని నందుకొనుచు నక్కర యొకతట్టున నుంచి 'నిన్ననే తిన్నాను శాంకరీ దయవల్ల మరి రెండు రోజులవఱ కేమీ అక్కరలేదు.' అనెను. పూజానంతరమున గంజాయి బట్టుకొని 'భం, భం, మహాదేవ్ కా రాణీ, మహాకల్యాణీ, భం,' అని గుప్పు గుప్పున పొగవిడుచుచుండెను అరింప మింతలో పనులు జక్కఁబెట్టుకొని యామెను బిలువగా నామె యేగి గుమ్మమును నొద్ద గూర్చుండి 'హా, హా, ఏమిగాలి వేస్తూంది!' అని యనుచు 'నువ్వా కుర్చీమీదే కూర్చో,' అనెను.

రాత్రి దాదాపు ఒంటిగంట కావచ్చినది.

రూపాయిలను చేయువారలను పట్టుటకు యోగినియొక మార్గము చెప్పెను. ఆమార్గమువలన రాదగు ఫలములును బాధలును, నాలోచించుకొని రేపట్లుచేయుట కరిందమ్ సమ్మతించెను. తరువాత యోగినిదగ్గర సెలవుపుచ్చుకొని యరిందం తన పహరాలు చూడఁ గాబోలు నూరిలోనికి పోయెను 'మళ్ళీ ఎప్పుడు తిరిగివస్తావు' అని యోగిని యడుగ 'మళ్ళీప్రొద్దున్న ఆరు గంటలకే! మీరిక్కడ కూర్చోండి. కావలిస్తే ఇక్కడే నిద్రపొండి, మరేం పరవాలేదు.' అని యాతడనెను.

'ఈతలుపులు వేసుకొనే పొండి.'

'ఏం ఫర్వాలేదు అఫీసుగది ఇది. ఇందులో ఏముంటుంది. వట్టికాగితపు ముక్కలు! కాగితాల దొంగలింకాలేరు.'

'అదీకాక మీరాయింటిలో ఆ బాధపమీ లేదు కాని, ఎందుకైనా మంచిది. తలుపులు వేసేస్తే.'

'అబ్బా ఇప్పటికే చాలా ఆలస్యమైపోయినది మీరు న్నారుకారా!' అని తనదారిని తాబోయెను యోగిని కొంత వరకు కావలివానితో మాట్లాడి, కొంత దేవునిగురించి చెప్పి, కొంత గంజాయి కాల్చి, యింతలో నా కావలివానికి నిద్ర రాగ, తానొక్కటిత హరినామ సంకీర్తనము చేసి, 'లీజో రామ కా నామ సతతను' అని పాడుకొనుచుండెను

తెల్లవారుచుండగనే తాను నదికేగి స్నానాదికృత్యముల నిర్వర్తించుకొని తిరుగవచ్చి యరిందంతో నేమేమియో యో చించి, యూ కాలూరాయి నెట్లు బట్టవచ్చునో మరియుంజక్కగ జెప్పి, కొందర నా కార్యమునకు బుత్తెంచి 'బాబాజీ ఈవేళో రేపో తప్పకుండా వాడూ, వాడిదండూ, వాడి సామగ్రులన్నీ దొరుకుతాయి, మరినాకు, గాళికి దారిబెట్టరా? అభిషేకం చేయించే ఏర్పాటులన్నీ చేస్తున్నారా?'

'మహాత్మా, తొందరపడతారేమి? ఆ కార్యం ఏదో కళ్ళతో చూచినతరువాత మీచెక్కు చెదరకుండా పంపు తాను. అభిషేకం తప్పకుండా చేస్తాను'

'ఔను నేనుంటేనే మంచిది ఈవేళ చర్యనుపట్టిచూస్తే జేయశాంకరీ (కన్నులుకొంచెము మూసి) నీ ప్రాణాలమీదికే వాళ్ళు చూస్తున్నట్టు కనిపిస్తున్నది. నువ్వు మాత్రం జాగ్రత్త గా ఉండాలి-చాలాజాగ్రత్తగా ఉండాలి.'

'ఎప్పుడూ జాగ్రత్తగానే ఉంటాను. ఈవేళేమిటి ఆవేళే మిటి? నాప్రాణాలమీదికెవరో ఒకరు చూస్తునే ఉంటారు. అలా అని ఎప్పుడూ నా జాగ్రత్త మానను.'

'శాంకరీ, చాలా బుద్ధిమంతుడవు. జయం-జయం.'

అరిందమ్ తన పనులకై పోయెను. యోగినియు తన పూజావిధానములం జక్కంబెట్టుకొని యా యారామ మందే యిటునటు దిరుగుచుండెను. ఈ లోనే సాయంకాలమాయెను. అరిందమ్‌యింటికివచ్చి పద్మాబాయితో ముచ్చటించుచుండెను.

'ఎవరండీ ఆయోగినీ? ఇప్పుడిప్పు డవతల తిరుగుతుంటే యీ అద్దములోనుంచి చూచాను.

'అది ఒక యోగిని.'

'ఆమాట దాని ఆకారం చూస్తేనే బోధపడ్తున్నాది.'

'అలాగేం! అయితే మరేం కావాలి?'

'ఎక్కడనుంచొచ్చిందీ, ఇక్కడ కెందుకొచ్చిందీ అది చెప్పండి.'

'రామేశ్వరంనుంచి ఒచ్చింది. కాశీకి పోతూ ఉంటే రైల్వేటిక్కెటుకలక్టరు పట్టుకున్నాడు. కొంచెంజోతిషంవైద్యం శాస్త్రం అంతా తెలుసును. పోనీఅని దాన్ని విడిపించాను.'

'అయితే ఇక్కడికి మన బస కెందుకు వచ్చింది?'

'నా కేసులో కొంత సాయంచేస్తున్నాది. అందుచేత ఆచెట్టుక్రింద చిన్న ఆశ్రమం చేసుకోనున్నాది. రాత్రిచాలా సేపు బాతాఖానీ కొట్టుకుంటూ కూర్చున్నాము.'

'అంతా బాగున్నాది గాని, ఆ ముండేమిటి, మీకు సాయం చెయ్యడ మేమిటండీ?'

'ఏమీ ఆడవాళ్ళు సాయం చెయ్యకూడదూ?'

'దాని మొఖంచేస్తుంది.'

'పోనీ చెయ్యలేదనుకో, నాపని నేను చేసుకుంటున్నాను కానూ, మరి బాధేమిటి?'

'బాధేమిటి గాని, యిలాంటివాళ్ళను ఇంట్లోకి చొర దియ్యరాదండీ. మీకు తెలియదు.'

'పోనిస్తూ చాదస్తం కబుర్లు కేమిటి?'

'పోనీ దాన్ని మరెక్కడో పెట్టకూడదు? ఈబసలో ఏమిటి అసహ్యం వేసుకుంటూ—'

'అదేమిటి. దాన్నిచూస్తే నీకు పడినట్టు కనబడదు.'

'అదేమిటో దాన్ని చూచినదగ్గరనుంచీ దాన్నేలాగై నా ఉద్యాపన చెప్పించియ్యాలనే నామనసులో వుద్దున్నాది. మీకు చెప్పకేం?'

'అబ్బే, అలాంటి దేమీ లేదు. నే నాజాగ్రత్తలో నున్నాను. మరేమైనా ఉంటుందేమో అని పరీక్షచేశాను.'

'ఏమైనా నరే పొమ్మందురూ దాన్ని. ఏవెధవముండో ఓతొక్కుముండ, దా న్నింట్లో చొరదీయడ మేమిటి?'

'అలాఅనకు. ఏపుట్టలో ఏపాముందో ఎవరికితెలునును! ఈవాళ—రేపు ఆపనేదో పూర్తిచేసేస్తుంది తరువాత పొమ్మం దాము' అని యూరటబలికెను. 'సరేమీయిష్టము' అని పద్మ

యనుచుండగ సంతలో జతీంద్రబాబువచ్చెనని వార్తవచ్చెను. లోనికి రమ్మని నా ముగ్గురును కొంత ముచ్చటించి యావల యెవరిస్థానములకు వారు పోయిరి.

మఱికొంతసేపటికి చౌధరీ సమాచారముల కొంతవఱకు గనుగొని యరీందం దగ్గరకు వచ్చి 'మాష్టర్, వాళ్ళంతా చాలా జాగ్రత్తగా పనిచేస్తున్నారు'

'అయ్యో! చెయ్యరూమరి. కాలూరాయిగాడి జాడే మయినా దొరికేటట్టుందా?'

'మరి వా డేవేషములో ఉన్నాడోగాని ఇక్కడే ప్రస్తుతం ఉన్నాడు.'

'ఆఁహా, సరే! వాళ్ళ మీటింగు లెక్కడ జరుగుతూ ఉంటాయి?'

'అదో పాలీమారుపోయేత్రోవలో చిన్న కొండలున్నాయే, ఆ కొండల్లో. వాళ్ళెప్పుడు మీటింగు చేసినా మట్టమధ్యాహ్నమో, కాక రాత్రి 12 గంటలకో చేస్తారు, దండు మాత్రం బాగానే ఉంది. అందులో ఎంతమందికీ రహస్యము తెలుసునో మరి! ప్రతివాడుగూడా జాగ్రత్తగానే ఉంటాడు. ఏలాటప్పుడు చూచినా రివాల్వ రుంటుంది.'

'సరేలే! ఈ రివాల్వర్లేమీ చెయ్యలేవు, మళ్ళీ మీటిం గెప్పుడో తెలుసుకో గలిగావా?'

'అది మీతో చెప్పడానికే వచ్చాను. రేపు తప్పకుండా మెడ్రాసు బ్రాంచి వాళ్ళ మీటింగు అవుతుంది.'

'ఓహో! బ్రాంచి బ్రాంచీలుగా మీటింగులు చేస్తున్నా రేమిటి? అంటే అర్థమేమిటో తెలుసునా, దండు దండిగా అయిపోయి అందఱిని ఒక్కచోట పెట్టి మీటింగు చెయ్యడానికి వీలుకాకుండా ఉందన్న మాట. అంటే మనకుగూడా పదిరోజులకు సరిపడా భత్యం ఉందన్నమాటే ఈ మెడ్రాసు దండెం తుంటుందో అజ్జా యేమాయినా దొరికిందా?'

'ఉంటారా, మాష్టర్! ఉంటారు. ఒక నూరూ, నూటా యేభయి మంది ఉంటారు. తేలికగా కావలసింది కానట్టే కని పిస్తుంది.'

'అయ్యో! మెల్లిగా అంటావేమిటి? తేలికయితే ఇన్నాళ్ళు పడుతుందీ? సరే రేపు మీటింగుకే మనముగూడా వెళ్ళాలి, అని వానితో నేమేమియో చెప్పి, సాయంకాలమగుట నొక్క సారి వీధిలోనికి పోగా, మరలి తనకార్యముల నుండెను.

యోగినియు సాయంకాలమంతయు నాయావరణయం దే పాడుకొని తిరుగుచుం, గావలివారిల కీశ్వరునిగూర్చి బోధ చేయుచుం గడపి, రాత్రి స్నానమునకేగి పూజలో గూర్చుం డెను. భోజనానంతరమున నరేంద్రం వచ్చి 'క్యం! మహాత్మా!' అని పిలిచి లోనికి తీసుకొనిపోయి, యోగిని చెప్పిన పద్ధతిని తానుజేసిన యత్నములును, వాని వాని ఫలములును దెలియం జేసెను యోగిని యుద్దానిని విని 'జేయ్ శాంకరీ మరి భయం లేదు. చక్కగా చేతిలో చిక్కినారన్న మాటే. ఈవేళ బయ లుదేర్దామా? మ రాలస్య మెందుకు?'

'అదేమిటి ఆతొందర! ఇప్పుడు మనకు దొరికిన భోగట్టా చాలదనుకుంటూనే?'

'ఆఁ, చాలదూ? జేయ్ శాంకరీ, చాలును చాలును.'

'అలాకాదు. మహాత్మా! తొందరకూడదు దానివల్ల మావాళ్ళంతా ఇలా అమాంతంగా చావవలసివస్తుంది రేపు వెళ్దాం—భోగట్టాలుగూడా బాగావస్తా యీలోగా—

'జేయ్ శాంకరి నువ్వుగూడా బుద్ధిమంతుడవే. కాబట్టి అలానేగానీ రేపు తప్పక వెళ్దాం. ఏదో ఈరవ్వాంతి పనీ అయిపోతే చక్కగా కాశీ యాత్ర చేసుకోవచ్చునుగదా అని తొందరపడ్తున్నాను. జేయ్శాంకరీ! మాయీా. వేగంనన్ను రానీ?

'అదెంతసేపు పని! ఈ పని అయిపోయిన తక్షణమే ఆపని.'

'జేయ్శాంకరీ! నీమహాత్మ్యం ఎవడెఱుగ గలడు? నువ్వెప్పుడు చేయిస్తే అప్పుడే పనులు జరగాలి గాని, మే మనుకున్నా అవుతాయా? వట్టిభ్రమ. జేయ్ పరమేశ్వరీ'

'మరేం! 'మానవుల్ తడబడుటంతె కాని యలదైవము కాడటె కార్యనేతయా' అని అంచేతనే అన్నారు."

"సచ్ బాత్, సచ్ బాత్ (నిజము, నిజము) అది ఇంకొకలాగ కాదు."

"అలాగయితే, మరి మనమెందు కిలాగ తాపత్రయంపడి యెండనక, వాననక, మాడి, మసిబొగ్గుల మైపోవాలి? అయేకార్యం ఏదో ఎలాగాఅవుతుంది. కాని వేరేలాగా కాదు."

జేయ్ శాంకరీ! ఈ ఆలోచనే పెద్దపొరపాటు. మహా ఘోరపాటు. భారతంలో ఏమన్నాడు? శ్రీకృష్ణభగవాన్ని రాయబారము పంపినప్పుడు అర్జునుడు:

ఉ. కావని నట్లయుండి యను; కార్యము లెట్టులు కాటన్ బ్రయత్నసం
భావననేత పౌరుష పద్ధతి; తత్ఫలసిద్ధి పొందు; జూ
దైవము తోడ్పడిన్ సహాయము; తథ్యము రెండును నీ వినోద
ములే;

అనికదూ చెప్పాడు. దాని అర్థమేమిటి? మనము ప్రయత్నం చెయ్యాలి; అంతేగాని ఉత్తనే కూర్చుంటే కార్యాలవుతాయా? జేయ్ మాతా.'

'సరి, ఆభారతానికేంకే, అందులోనే కృష్ణుడేమన్నాడు?

చ. వెరవున లావునన్ కృషికి వేయివిధంబుల మేలుచేసినన్
దొరకొనునే ఫలంబు? తతితోడ దగుపర్జన్యము లేకయుండినన్!

అన్నాడు గాదూ!'

'అలాకాదమ్మా, శాంకరీ, ప్రయత్నం క్షేత్రమువంటిది దైవసహాయము బీజమువంటిది ఏది పాడయినా ఫలంలేదు, కాబట్టి ప్రయత్నం ఉండాలి, తరువాత అంబాళా ఇచ్ఛ. ఎలాగవాలంటే అలాగవుతుంది. నువ్వుచాలా బుద్ధిమంతుడవు. ఇలాంటి ఊహ ఎప్పుడూ పెట్టుకోవద్దు సుమా?'

'జీ,'

'సిమునను మంచిది, కొంచెం ఉపదేశం మాత్రం కావాలి.'

'జీ.'

'శాంకరీ అనుగ్రహం కదా ప్రధానము'

'జీ ఉపదేశంవల్ల లాభాలేమిటో నాకు బోధపడలేదు.'

అనునంత యోగిని యనేకరీతుల గుహూపదేశ ప్రయోజనములను గూర్చి యువన్యాసమునిచ్చి యరిందమువంటి వానికిం గూడ నాశ్చర్యమును గలుగఁజేసెను. ఇంత ర్రాత్రి దాదాపు పంద్రెండుగంట లగుటచే నరిందమ్ యోగిని దగ్గర సెలవుం గైకొని నిన్నటి యటులనే పోయెను.

పిమ్మట, యోగిని యొక్కసారి ద్వారమునొద్ద గుఱ్ఱు పెట్టుచు నిద్రపోవుచున్న కావలివాని దగ్గరకుబోయి, చావడి నుండి లోనికిం బోవనున్న తలుపు గడియవేసి యొందుట పరిశీలించి చూచి, తన పూజాస్థానమున నున్న యొక చిఱు గంటను దీసికొని వెలుపలి ద్వారమునొద్దకు వచ్చెను. సన్నని దారము నా ద్వారమునకడ్డుగ మోకాళ్ళకు దగులునట్లుగట్టి, యాదారము నడుమ మఱియొకదారము నతికి, యాదారమును గోళ్ళెము నుంచుకొను మీాది కొక్కెమునుండి లాగి, తన చిఱు గంటనందమర్చి—

'శం కరోతీతి (శుభము చేయువాడు) శంకరః; శంకర కాదేవి శాంకరి' అని అరిందమ్చావడిలో ప్రవేశించెను. వెలుపలినుండి యెవరు వచ్చినను గంటచప్పుడగుట తప్పదు. లోపలి నుండి వచ్చుటకు, గడియ

# ఇరువదియొకటవ ప్రకరణము

---

## 'హన్నా నువ్వా యోగినివి'

అరీంధమ్ వాని యభ్యాసము ననుసరించి చావడినుండి పోయెను. ప్రొద్దున నాలుగంటలకే పునర్దర్శనము. కావలి వాఁడు యోగినీ వరప్రసాదమున గాఢతర నిద్ర నున్నాఁడు. పరులువచ్చినచో గంటచప్పుడు తొలుత వచ్చునుగదా! ఇంక యోగినికి భీతియేల? యధేచ్ఛముగా విహారింప ననువుగలదు. కావుననే కచ్చేరీగదిలోనికి పోయెను. విద్యుద్దీపముల వెలుఁగున నా మందిర మంతయు రమ్యంబుగ నున్నది. మందిరంబు నకుఁదగిన యందమగు వస్తువులును, వస్తువులకుఁ దగిన మందిరంబు, నయి యత్యంత సుందరముగ నున్న యా యింట నొక తట్టున నొక నిలువుటద్దమా యోగిని కంటఁ బడెను. తోడనే యామె యద్దముకడ కేగి తన నీడం జూచుకొనెను. ఛీ, ఛీ, ఏమి వికృతాకారము! అంత సొగసగు నద్దమున నిట్టి కురూపి విగ్రహమెంత యసహ్యముఁగఁదోఁచెను! ఈ రూపము తనదే యను నభిమాన మిట్టియెడల నుండునా? ఎట్లులుండును? ఏదోటఁజూచిన నందములఁ గందోయికి విందొనరించు నామం దిరమ్మున నీ కురూపాకారము మఱింత కురూపముగ నుండును గదా! పాపము యోగినికిగూడ నట్టి భావమే కలిగి 'అహా! నా ఆకారమెంత అసహ్యంగావుంది. అత్రహ్యాం ఆముద్రుతిలు,

ఇలాంటి సురూపాన్ని చూసేగానే ఆన్ని పేడ్నీళ్ళు నోట్టకుండా ఉండడం నిజంగా కొంత సుకృతమే. తొంభై ఏళ్ళతోక్కయినా ఇంతకన్న కొంచెం బాగుంటుంది ఓస్స్, ఏమి మార్పు-ఏదీ చూదాం—' అని యోగిని తన కుడిచేతి చిటికెన వ్రేలి గోరు నోటిలో బెట్టి యొక్క ముహూర్తము మాత్రముంచి, దృష్టియంతయు నద్దముననే పెట్టి, గుటక వేసెను. తెప్పపాటు కాలమైనను కాలేదు. పాఠకులారా; నమ్ముడు, ఓహో యేమి మార్పు! అనన్యసామాన్యము! ఆహా! అనదృశ శేముషీమహిమ!

ముసలి యోగిని మఱిలేదు.

ఆ ముకుర బింబంబునం బ్రతిబింబించు చుండిన యది సుందర నేత్రారవిందయగు నొక్క పరిపూర్ణ చంద్రవదన; శిరీషకుసుమ కోమలశరీర. ముడుతల యొడలికి బదులత్యంత సౌకుమార్యంబున నవ నవ లాడుచు జిగ జిగ మెరయుచున్న దంతపు విగ్రహము. కడు నెఱసి చింపిరిగనున్న జడలకు మారు, హరినీలములకన్నను మించియున్న నీలిమ గల నునుగొప్పు. చొక్కి దవుడల స్థానమున చక్కగ నీడజూచుకొనం జాలు నిగ్గుటద్దములు నీరుగారుచున్న కన్నులుగవ లేదు; వికసిత కమలములు. వయసుచే బలియముగు వార్ధక్యమునొంది యేవగల్పించు ముక్కు కాదు; కొఱేరు వేసినరీతి నున్న తిలపుష్పము. వేయేల; ముసలిముద్ద మఱిలేదు; జగన్మోహన యను కవి సమయము కాదు. బంగారు బొమ్మయను నుపమానము కాదు. తటిల్లతయను భ్రమగొలిపింపజాలు శరీరకాంతిగల దా కాంత 'అన్నా, సువ్వా యోగినిది' యను భ్రాంతిమంతము కాదు; ఆ ముద్దుగుమ్మ నిలుకడమెర పనవర్ణనము కాదు. రూపొందిన రతీ

దేవియన నతిశయోక్తికాదు ఇదియంతయుఁ బాగ డ్తగాదు. ఏదికాదన్నను ముసలి యోగినిమాత్రము మఱికాదు.

'బలేశే! ఔషధం. ఏమిచిత్రము ! ఎవ్వఁడు నన్ను ఆ కురూపంతో పోల్చుకోకలడు ? ఎవడితరము ! ఎవడితరము !! ఏదీ' అని మఱల నడిమిప్రేలి గోరునందు ఔషధము సేవించెను. మరల మన ముసలియోగినియే. ఆ వికృతాకారమే. మఱియొకసారి చిటికెనప్రేలు నోటనుండెను. అధరీకృతాప్సరో వనితానివహ. తోలుత తన యాకారమును దినంతులు గొట్టుచుండు నాయద్దమైన కిప్పుడు తనప్రతిబింబమే వింతలావణ్యము నిచ్చుచున్నది. ఔషధమును మెచ్చుకొనుచున్నది. ఇంతలో నాయద్దమున నగుపడు వస్తువులలో నొక్క పెట్టెపై నేమియో యక్షరములు కానవచ్చెను. పట్టిచూచెను. దేవీపూరనుమాట చదువఁజాలెను. తోడనే నిలచినయట్లు లయిపోయి యాపెట్టెను చూచెను.

అటనొక ఆఫీనుపెట్టెయున్నది. దానిపై కప్పునః—

'కానికీ'

దే వీ ప్రూ ర్ కా గి త ము లు

అని వ్రాసియుండెను.

యోగిని మెల్లగ నాకప్పు తెఱచి యుండునా యని యెత్తఁజూచెను. ఓహో ! అదృష్టము ! పొరపాటున నది యట్లులనే యున్నది యోగిని కప్పు నెత్తకయే మెల మెల్ల నేగి

కావలివాని యవస్థచూచి గడియల నారసి తిరుగవచ్చి, పల్లవ కోమలంబులగు తన వ్రేళ్ళ నొకప్పుడు నలువాయిగ నెత్తునంత 'క్లి' క్కను చప్పుడుతో పైకప్పు తనంతట తానే సంపూర్ణముగ తెఱచుకొనెను. ఆ ముహూర్తముననే తాళముండు పెట్టె ముందలిపలక క్రిందఁబడెను ఆక్షణముననే—ఇది యంతయు నొక్క రెప్పపాటు కాలమునఁ జఱిగినదని గమనింపవలయును—అనేక సర్పములు బుస్సుమని పెట్టెనుండి పైకుబికి పాప మా యోగిని నాపాదమస్తకము నన్ని కీళ్ళకుం జుట్టికొనెను చక్కగ చూడ నియ్యవి సర్పములుకావు; బలీయములగు సర్పాకారము ననున్న యుక్కుతీఁగలు (స్ప్రింగులు). అహో! మోసము, ఒక్క అవయవముం గూడ గదల్ప నసాధ్యము—ఎక్కడి కక్కడ బంధమాయెను.

'ఓహో! అరిందన్ అరిందమే! మెచ్చాను, మెచ్చాను, ఇంతమంది సహాయంతోను గూడా తానుచేయలేని ఈపని ఈ పని ఈ ఒక్క పెట్టే చేసేసింది మరేముంది! చెయ్యికదల్పలేను. కాలు కదల్పలేను, కూర్చోలేను, మెడవంచలేను, బలే! బలే! ఆచంద్రతారార్కము లోకములో నుండిపోయే పనిచేశావురా నాయనా! నిన్ను గెల్చుట కష్టమే—అన్నా యెంతపని! ఈ ఆకారముతో నున్నానే—తప్పకుండా అవమానము సిద్ధమే, ఏమిది, ఏమిచేయుడం? ఛీ, ఏదో యోగిని ఒక్కర్తె యీలాగు పట్టుపడ్డాడంటే ఎలాగోపోనుగదా! నే నీఆకారంతో చేతుల్లో

పడిపోవడమే! అన్నా! అన్నా! కూడదు, ఈ స్ప్రింగులకు బదు లు నిజంగా పాములోస్తేనే బాగుండును. సరే. కానీ, అని తన యోగశక్తిని వినియోగించి హుమ్మని యా స్ప్రింగులను త్రెంపజూచెను. తెగవు-పెట్టెగూడ కదలదు. 'ఇన్ని చేసిన వాడు, పెట్టెకదలనిస్తాడూ?' అని యనుకొనుచుండ మరియొ క్కనారి క్లిక్కు మనెను. మెడ త్రిప్పిచూడ నింకే మున్నది! ఎదుటనున్న పెద్ద టేబిలుయొక్క పై పలక కొంతవరకు మీదికి లేచి యుండ, సొరుగులలోనుండి యరిందమ్ నిర్ఘాంతపడి చూచుచు లేచియుండెను. ఈతని శరీరము నడుమువఱకును మాత్రము కానవచ్చుచుండెను. ఈయిరువురును దమచూపుల తో నాయింట దోరణములు గట్టుచుండిరి.

యోగినివి?

'హా న్నా నువ్వా జమలా!'

---

ఇ రు వ ది రెం డ వ ప్ర క ర ణ ము

---

నే నే!

'హాన్నా! నువ్వా యోగినివి జమలా!' అనువరికి జమలు హృదయము మెట్టియవస్థయందుండెనో వ్రాయ నెట్టివాని కైన గష్టసాధ్యమగును. అయినను సాహసించుచున్నాము.

'శాబాష్ అరిందమ్! తెల్లవారినవఱకును రానని చెప్పిపోయి, ఏదో ఒకతోవను మళ్ళీవచ్చి, ఈయింటిలోనే ఈటేబిల్లోనే పడుకుంటా? ఔను; 'ఇదే నాజాగ్రత్తలో నే నుండనా' అన్నావు వహ్వా! శత్రుడవే, నాకేబాధ, కాని సంతోషం కలుగుతున్నాది. ఈ పెట్టెలో ఈ కాగితాలా! పట్టు పడ్డవాడు బలవంతముచేసి లాగినపటికి నీటేబిల్లో గంటచప్పుడా! టేబిలుమీదిబల్ల లేచిపోవడమా! మెల్లగలేచి నువ్వు నాపేరు పెట్టి నన్ను దెప్పడమా! బాగుంది, నాతెలివితేటలు నీదగ్గర ఒక్కటోళీగూడా చెయ్యలేదు—చెయ్యకేమి, నువ్వా యోగి నివి అనలేదూ-అంటే అర్థమేమిటి? ఇంతకుముందు నువ్వాలాగ అనుకోలే దన్న మాటేనా? అంతమట్టుకు నీకళ్ళు కప్పానన్న మాటే? కాని నీజాగ్రత్తే నిన్ను కాచింది. ఈ కేసులో ఎవడు వచ్చినా ఈ కాగితాలకోసం వస్తాడు-ఇల్లంతా వెతికేటప్పుడు పెట్టెకనిపిస్తుంది, తప్పదు. పెట్టెతీస్తాడు. తీసేసరికి బందిఖానా! లోపలగంట బజే! ఛీ, నారూపమే నన్ను పట్టిచ్చేసింది. కుడి చెయ్యి నోటిదగ్గర కోస్తేచాలు. నన్ను నా పేరు పెట్టిపిలవగల డా? తప్పింది. ఇక నేమిటి చేయడం? నన్ను పట్టుకుందామనే అనుకుంటాడు. కాని అదిఅబద్ధం. నాపనినేనుచేసేసుకుందునా? అదేబాగుంది లేకపోతే బలవంతగా మీదపడి పట్టుకుంటే? ఆ ఏమిటీ వెఱ్ఱి? అలాచేయడానికి ముగ్ధాయుండా? కాలు కదులుస్తే ఏమిటయిపోతుందో అన్న భయం లేదూ? దగ్గరకు రావడమంటే కాలుకదలదే, నేను జుమలనని తెలిసినతరువాత

నా తడాఖా లితనికి తెలియవ్వా? బాగా తెలీదేమో, చెప్పిశి మరీనాపని చేస్తాను.' అని యనేకరీతుల నూహాములు పరుగిడు చుండెను. పాఠకులారా, యిన్ని యూహాలను వ్రాయుటకు మాకును, జదువుటకు మీకును, నింతకాలము పట్టినప్పటికిని, నా జూమాలియా మానసంబున నత్యంతవేగముతో, మనోవేగ మనుపేరునకు దగినట్లుల, నొక్క త్రుటిలో విద్యుద్దీపులకువలె పర్వెనను మాట మరువవలదు కావున గణింపదగినంత కాలవిలంబనము కాకుండగనే 'హాన్నా! నువ్వా యోగినివి జూమలా' అను ప్రశ్నకు 'ఔను, నేనే, అరిందమ్, నేనే! జయించావు' అని జూమల ప్రత్యుత్తరమిచ్చెను. 'ఆ మాటలకేంగాని, నువ్విలాగ యోగినివై వచ్చావని నేననుకోలేదు. ఈయోగి నీదే మాయయోగిని అయితే వాలుబాయిగాడి పనే అవుతుం దనుకున్నాను; గాని యిలా అనుకోలేదు. నువ్వేనా?'

జూమాలియా కానంద మిప్పొంగుచుండెను. అజేయుం డని తానే యొప్పుకొనుచున్న యరిందమ్ తన్ను మెచ్చుకొను చున్నాడు. ఇంతకన్నను జయించిన నేముండును! కీలు పాములతో తన్ను పట్టిబంధించినందు కరిందమెంత యుత్సాహము నందుచున్నాఁడో, యంతయానందమును నిదయము నకు జూమాలియా యొందుచుండెను. ఆనంద మంకురించు కొలఁదిని జూమాలియా ముఖమునకు వింత వింత విన్నాణము గలుగుచు సౌందర్యంబెల్ల మూర్తీభవించినట్లుల దోఁచు

చుండెను. 'మర్ఘూరే సౌందర్యము! ఈ సుందర చంద్రవదనకా యిట్టి ఘోరాకారణము' అను నచ్చెరు వరీందమ్ మనమున పెచ్చు పెరుగుచుండెను. జమీలియా 'నువ్వేనా! అను ప్రశ్నకు 'ఔను; మళ్ళీ చెప్పాలీ నేనే అని? యోగినిని నేనే. నీచేత కీలుబొమ్మలాగ చెప్పినదంతా చేసేటట్టునిన్ను లొంగదీసి, నా కార్యం సానుకూలం చేసుకొని నీకళ్ళు జిగ్గు మన్నట్టు చెయ్యాలని వచ్చిన యోగినిని నేనే, తెలిసిందా? ఈపాటే పోల్చుకో లేపవాడవు నువ్వు తక్కిన వేమిపోల్చుకుంటావు? పట్టిది. ఏమైతే నేమి? ని నుదుట వ్రాశాడు' అనెను.

'ఇంకా నేను పోల్చుకోలేనవి గూడా ఉన్నాయా?'

'ఉన్నాయి, ఉన్నాయ్' అని జమీలియా అను సరికి గంట క్రిందను పడినచప్పు డాయెను.

తోడనే జమల 'అదిగో ఎవరోవస్తున్నారు.'

'నీకెలా తెలునును?'

'నేనిక్కడ పట్టుబడ్డానని నీకెలా తెలిసి టేబిల్లోనుంచి పైకి లేచావు?'

'ఆపెట్టె లాగితే యిక్కడ ఎలెక్ట్రిక్ బెల్ గంట వాగుతుంది. ఆ గంటచప్పుడుతో లేచాను.'

'అలాగే, ద్వారబంధానికి కిద్దుగా మాకాళ్ళకు తగిలేటట్టు ఒకదార మా గేటుదగ్గిర కట్టి గొళ్ళెములోనుంచి లాగి

దానికి ఒక గంటకట్టాను ఆ గంట ఇప్పుడు క్రింద పడ్డాది. కాబట్టి నేను ఎవరో వచ్చారని చెప్పాను.'

'ఎవరు కట్టారు ? నువ్వేనా ?'

'ఔను—అదికూడా నేనే.'

'ఒప్పుకున్నాను. బలే' అనుచుండ మంగల్సేను బాబు మరినలుగురు కనిస్టేబులును చావడి గుమ్మముదగ్గర కానవచ్చిరి.

'బస్; అరీందమ్, లోపలకు రావద్దని చెప్పా ?'

'ఆఁ, ఆఁ, అక్కడనే ఉండండీ కొంచము.'

'వీ ళ్ళిప్పు డెందు కొచ్చారు ?'

'నీ కోసమే జామలా'

వచ్చినయైదుగురును నిర్ఘాంతపడి చూచుచు నిలచి పోయిరి.

'వీళ్ళ కెలా తెలిసింది ?'

'ఇప్పు డిప్పుడు బెల్ రింగ్ చేశాను. (ఎలెక్ట్రిక్ గంట మీటనొక్కాను.)

'ఈ ఉేబి ల్లోనుంచేనా ?'

'మరేమి ? సంసారమంతా యిందులోనే.'

'చాలా సంతోషించాను.' అని జామల యనునరికి మంగల్సేను 'మీరు జమీలియా, జమీలియా అని చెప్పే వారు ఆ జమీలియా యేనా ఈమనిషి ?' అని యరీందమును

అడిగెను. అందుకు జమీందారిణీ 'ఔను. ఆ జమీందారిణిని నేనే' అనెను. ఇంతలో పద్మాబాయిగూడ నొక ద్వారముదగ్గర కానవచ్చెను. అంతయు నాశ్చర్యమే 'అమ్మా, పద్మాబాయీ, ఇదిగో మనయోగిని చూడు.'

'మన యోగినియేనా ఇది ?'

'ఔను. పద్మాబాయి, నేనే! నే నెవ్వరైనో నీకు బాగా తెలియదుగాబోలు.'

'నీచరిత్ర సంపూర్ణంగా మొదటినుంచీ చెప్పు—వినాలని ఉంది.' అరిందము అనెను.

'ఐతే వినండి—చెప్తాను'

లాహూరుదేశము నా జన్మభూమి. మదన్ మోహన్ పఠాణీకర్ నాతండ్రి. నాతల్లి చందేలీబాయి. నాభర్తయగు లజపతిమోహన్ దేవ్ నా పసితనముననే కొద్ది కాలంలోనే పోయారు. అదేమోగాని దేశాలు తిరగాలని బుద్ధిపుట్టి కొందరు బైరాగుల్ని, ప్రసిద్ధిపొందిన దోపిడికాండ్రను కలిసి తిరుగుతూ వుండగా ద్రోహకులనాయక శిఖామణి అని ప్రసిద్ధినామము పొందిన కాలూరాయ్ అనే జగదేకవీరుణ్ని కూడా కలిసి ఆయన దగ్గర నాలుగేళ్ళు శిశ్రూషపొందుతూ వున్న కాలంలో ఆ మా గురువుగారిదగ్గర అదివఱకే శిశ్రూషపొందుతూ వున్న బడాఖానీదార్ బిన్నాత్‌లాల్ చటోపాధ్యాయి అను నా

సహపాఠకునితో మొక్కుడ కలిసిమెలిసి తిరుగుతూ వుండగా, తనకు ఆయనచేత ప్రేమింపబడ్డాను. మేమిద్దరం చాలా సాయిలా పాలుబలాగావుండే వాళ్ళం. ఇలాగ్గా కొంతకాలం జరిగే సరికి ఆయన శక్తులు యుక్తులు నాకున్నూ, నా వూహాలు నా తెలివితేటలు ఆయనకున్నూ తెలియజేసుకుంటూ మాగురువుగారివల్ల మెప్పులు పొందుతూ వుండేవాళ్ళం. మా గురువుగారు నాకున్నూ, మాచటోపాధ్యాయి గారికిన్నీ గొప్ప గొప్ప వనమూలికలు, మందులు యిచ్చి, ఘనమైన మంత్రాలు ఉపదేశంచేసి, యీ ప్రపంచ లో విడిచిపెట్టారు. చటోపాధ్యాయిగారు చాలా మారుపేర్లతో తిరిగి తిరిగి, తాము పూల్సాహేబని మారుపేరు పెట్టుకుని, నన్ను మోతీ బీబీ యని పిల్చేవారు. ఆయన కొంతకాలమునకు నీ చేతనే—కాదు కాదు—విద్యుచ్ఛక్తిచేత పట్టుబడి అనంతరం పరలోకగతులైనారు. కాని మాగురువుగారు అజేయులుసుమా !

పూల్సాహేబువంటి అఘటనఘటనా సమర్థుని చేత నయితము మెప్పులుపొంది ప్రేమింపబడి వానికి సదా సహచారిణిని అయి చివరకు అతనికి చేదోడు వాదోడుగావుండి అతని సర్వప్రయత్నాల్లోను జయం సమకూర్చినదానను నేనే.

ఇంతేగాక నన్ను ముప్పతిప్పలాపెట్టి మూడు చెరువుల నీళ్ళు త్రాగించిన పూల్సాహేబుకి గూడ 'జమీలియా యందుగూడ నాకు తగినంత విశ్వాసములేదు. ఆమె నాయొక్క

ప్రియురాలే అయినచో నలపాలలోగాని యంత్రతంత్రములలో గాని నాకంటె ఘనతగలది నన్ను కూడా గోతిలో పడద్రోయు నేమో యను ననుమానము కలదు కనుక నామె నింక వయిని జీవింపనీయను. పొడిచి చంపివేసెదను. * * అదీ స్త్రీమాత్రురాలుకాదు. ఆమెకు పదిమంది పురుషులయిననూ చాలరు ' అని తోచేటట్టు ప్రవర్తించిన దానను నే నే

నా ప్రియుడగు ఫూల్‌సాహేబును నీవుపట్టి మంచవు కోటికి కట్టి నన్ను పట్టుటకు వచ్చినప్పుడు నీకు కానరాకుండా అతనిని విడుదల చేసినదానను నే నే.

నీవు నన్ను పట్టుటకు వచ్చినపుడు నా బహాద్దూరీకి లోవంరాకుండా అమీనాను మాత్రమే నరికి నిన్ను విడిచిన దానను నే నే.

నీ వలన ఖైదులోపడి, లంకేశ్వర సింహుడను పహారా సిపాయిని మోహపు మాటలచే వశము చేసికొని వానిని జంపి నేను తప్పించుకొనుటేగాక ఫూల్సాహేబుని కూడ విముక్తి జేసిన దానను నే నే.

యోగీంద్రబాబుతో నౌకాయాత్రచేసి మారువేషమున నాతనిమోసముచేసి [illegible]విషపుపొగచే బాధించినదానను నే నే.

నన్ను నీవుపట్టవచ్చినప్పుడు నాచేత కూపమున ద్రోయ బడిన మిత్రాబాబును నీవు బయటికి దీయ బ్రయత్నిం

చుచుండ నీమీద పిక్ రిక్ ఆమ్లముబోసి నిన్ను బాధించిన దానను నే నే.

ఆలాగు పూల్సాహేబు గతించినతరువాత దేవీపూర్ ఎస్టేటులో దివాన్‌గిరీ చెలాయిస్తూ నామాట సుగ్రీవాజ్ఞ అయేటట్లుచేసి బాధకరం అన్న వాడ్నల్లా పరలోకానికి పంపిస్తూ, ఉన్న భానోజీవి నే నే.

(అరిందము ముక్కుమీద వ్రేలు పెట్టుకొనెను)

ఆ యెస్టేటు తాలూకా కొన్నికాగితాలు ఈ పద్మాబాయి తీసుకొని వెళ్ళిపోవస్తే ఈమె వెంటనంటి కరీంగాడిని— అంటే మీగులాబ్‌సింగును— పంపించిన దానను నే నే.

(వినుచుండినవారు ముక్కుమీద వ్రేళ్ళుతీయుటకు వ్యవధిలేదు.)

భవానీపూర్‌లో పద్మాబాయి యున్నదని తెలిసి వచ్చి బోటుహౌసులో నుండి నాటకమాడించిన ఏలినవాడను నే నే.

బోటు హౌసులో మాట్లాడుతూవుండి నువ్వు పెంకి మాటలాడేసరికి విషవాయువులతో నిండి ఉన్న గోతిలోనికి మీటనొక్కి నిన్నుత్రోసిన ప్రభువును నే నే.

ఫైర్‌సాలేకు అని నువ్వు కేక వేశివెయ్యడంతో వచ్చిన సెర్చిలైటు చూచి అరిందమువే అన్న అనుమానం కలిగి

ఇంతలో నీ దండు బోటులో నిండిపోవడంచూచి తప్పించుకోవ డం కష్టమని ఆడవేషంతో ఆ హుగ్లీనదిలోపడిన దానను నే నే.

పడీ పడడంలో మీవాడుకూడా నీట్లోవురకడం చూచి నాచీరను పారవేసి లో యీతతో మీబోటున్నదిక్కు ఆ చీక టిలో, నీటిలోని మొసళ్ళకుగూడా, జడియకుండా, పోయి పోయి బోటునెక్కిన సుందరిని నేనే.

మహా సాహసంతో అరిందమ్ అన్నపేరు చెప్పి జత్తీ బాబు కళ్ళుగప్పి, బోటుతెప్పి, చిన్న సరసంతో తమాషాచేసి తాను కాలుస్తూవున్న సిగరెట్టు నేను రెండుపీల్పులు పీల్చి తననోట్లో పెట్టేసరికి జత్తీబాబుని ఒళ్ళుతెలియకుండా పడిపో యినట్టుచేసిన త్రాచుపామును (అనే విషమును) నేనే.

ఒక్కర్తె నై పోవడం చేతనున్నూ, తగిన సామగ్రిలేక పోయినకారణంచేతనున్నూ, వ్యర్థంగా కొంత నీ ఇల్లంతా గా లించి, నీకాగితాలుకొన్ని చూచి, తగిన కాసి మరునాడు చేతామని వెళ్ళిపోతూ ఆచీటీని నీకువ్రాసిన ముద్దరాలిని నేనే.

ఈ మంగళ్ళెన్ని చూపిన తడాఖాకేమి—నువ్వెంత మారువేషంలో వున్నప్పటికీ, నీ కాళ్ళమీది జోడు కాయాలు చూచి, ముసలిదాని వేషంతో నెత్తిమీద తట్టపెట్టుకొని ఆ మాలువుదగ్గిర నీవు నాకు నీళ్ళుపడుతున్నప్పుడు నీచేతికి నాపన్ను నాటించి, ఇక నీహాలుహారులో నువ్వుండమని ఆగులాబ్ సింగుకు

తెలిసేటట్టు మనమరాలిని పిలిచినట్టు పిలిచిన మునలిముండను.
నేనే—ఈనాకళ్ళు అందరి కళ్ళులాంటివి కావే :—

నీకు సాయంచేశేటట్టు వచ్చి బండిమీాద నిన్ను తీసుకొనివచ్చిన గులాబ్ సింగు నిన్ను చంపమని నాతోయెంతపోరు పెట్టినప్పటికి, నాకు మనసొప్పక, ఆఖరుకు ఆరైలు కమ్మీాల మీాద పెట్టి, పోయి విచారించిన ఆడదానను నేనే.

నువ్వు తరవా తెలాగోచావు తప్పించుకొని మహాసావానంతోశీల్డాతోవలో ఆపాడు పడిపోయిన యింటికి నన్ను పట్టుకోవడానికి వచ్చావే, అప్పుడు నువ్వు చూస్తుండే మాాయమయిపోయిన పంచ భూతాధికారిని నేనే. (మీా కందరికీ మహేంద్రజాలమే!)

ఈలోగా నువ్వు దేవీ పూరులో చేసిన సంగతులు తెలుసుకొని పెద్ద మెత్తుతో కాలూరాయి గాడి మిమమీాద నిన్ను మూాడు చెరువుల నీళ్ళు తాగించాలని వచ్చిన యోగినిని నేనే.

ఇప్పుడు నీ బలవత్తరమైన మాాయకు లోబడి, ఈపాములలో చిక్కి, తప్పించుకొనుట అసాధ్యమే యని నిశ్చయించుకొని, నాచరిత్ర లోకానికి చక్కగా తెలియజెయ్యాలని ఇంత దూరము చెప్పిన జుమీాలియానను నేనే.

అరీందమ్ ఏమంటావు? ఇదే మనయిద్దరకూ ఆఖరు మాటగదా. నాయావజ్జీవమునన్నా నిన్నోడించాలని మహాఅభిలాషవుండేది. అందుచేతనేనిన్నానాడు చంపలేదు. ప్రాల్సాహేబున్నప్పుడు గూడా అమీనాను చంపానుగాని నిన్ను చంపలేదు. ఎప్పుడు నిన్ను చంపుతే నన్నెవ్వడడ్డగలడు? కాని, నాకది ఇష్టములేదు. అయితే ఒక్క సంతోషము మనసులోవుంది. నీకు తగినదానను నేనే. నాకు తగినవాడవు నువ్వే. అలాంటి నీ చేతుల్లో చిక్కిపోవడం నిజంగా ఒక్కసుకృతమే. మరే కుళ్ళు ముండావాడిచేతిలో చిక్కేదానికన్నా ఇదే మేలు గదా— ఛీ, నీచేతిలోనూ చిక్కలేదు, లేదూ. మానవాతీతమయిన విద్యుచ్ఛక్తికి చిక్కాను; ఎలక్ట్రిసిటీకి చిక్కాను; అంతే-నీకా చిక్కాను? అలా చిక్కనే. ఈవిగ్రహాన్ని పట్టడానికి మనుష్యులు చాలారా? ఉత్తది. నన్ను పట్టాలంటే విద్యుచ్ఛక్తే రావాలి; మరొకటి చాలదు; మనుష్యులు చాలరు ఈభూగోళాన్ని పట్టివుంచడానికి దేనికి బలమున్నాది? ఆమహాశక్తినన్ను గూడాపట్టాలి. అంతే నీతరమూ, నన్నుపట్టడానికి? ఏమంటావు?"

అనుసరికి స్తంభీభూతులయి యున్న యాత్రికులకా సుందర విగ్రహ మత్యంత భయంబు నాపాదించు చుండెను. తా మప్పుడు చూచుచున్నది సాధారణమైన మానిసి కాదనియు, నేదియో తపోలోపంబుచే నీరీతి నాపాములకు పటుబడి

యున్నదనియు దోచెను. ఒక్కరును నోరుదెప్పి మాటలాడుటకు గూడ సాహసింపరైరి. ఇంతయేల? బిగ్గరగ నూపిరి దీయుటకు గూడ నంతరాత్మ శంకించుచుండెను. పట్టుబడియు దానే యచ్చటనున్నవారి నందరిని బంధించివైచెననునట్లుండెను. ఎట్టకేల కరీందమ్ తన యాశ్చర్యము నొకకొంత మట్టుపఱచి, 'జుమీలియా, నీసంగతి నాకు క్రొత్త కాదు. ఇదిగో యిక్కడ నున్నవాళ్ళకు క్రొత్త. ఈ పద్మాబాయి నువ్వెవ్వరో సాధారణము మనిషివనుకొంటున్నది. నేను వేరే చెప్పకుండా నువ్వే నేను కోరగా చెప్పి నాకు చాలామేలుచేశావు అందుకే కదా ప్రాల్సాహేబు చచ్చిపోవనున్నప్పుడు నాతో 'నా ప్రియురాలు జుమీలియాను పట్టుకోవడం అసాధ్యం సుమా అది మాత్రం తెలుసుకో' అని అన్నాడు. అది నేనెప్పుడయినా మరచి పోతానా? ఇంతేకాదు. 'అరీందమ్, జుమీలియా బ్రతికియున్నంతకాలము నీకుఅపాయము లుండనే ఉంటాయి' అని చెప్పినమోహినీని మఱచిపోయానా? అన్నివిధాలా నన్ను మించిపోయిన తెలివితేటలు గలదానివే అని నేనే ఒప్పుకుంటానే! జుమలీ, నేనన్నదంతా ఏమిటి? నీసుందరాకారానికీ, నీ తెలివితేటలకీ, నీచర్య బాగులేదనేకదా! ఇప్పుడయినా నా మాటవిని ఈ మార్గంలో కాలుపెట్టకుండా నాదగ్గరనే ఉండు. నీయంగీకార మిచ్చావంటే చాలును. ఈపాములూ ఈస్ప్రింగు

లూ ఒక్క క్షణములో విడిచిపోతాయి. చెప్పు' అని టేబిలు లోనుండి క్రిందకు దిగుచుండెను.

'ఆఁ! ఆఁ! అదేమిటి దగ్గరగా వెళ్తారేమిటి?' అని పద్మాబాయి యాత్రముతో ననెను. 'లేదమ్మా, వెళ్తే మాత్రం యింకేమి టున్నది? పాపము!'

'ఏఁవిటీ, అరీందమ్! ఇంకేవిటున్నదేం! 'పాపము' అని నన్ను కనికరిస్తున్నా? నీకనికరం యెప్పుడయినా పొందుతా ననుకొన్నావా? నన్ను కనికరించేపాటి ధైర్యంకలవాడు ఈ మూడు లోకాల్లోనూ ఉన్నాడూ? ఒకరి కనికరం పడివుండే ఘటం అనుకున్నావా నన్ను? ఏఁవిటదీ! ఎంత పుచ్చిపోయినా మిరియాలు జొన్నలపాటి చెయ్యవు? పాపమేం? దగ్గరకు రాగలవూ?'

ప్రళయకాల రుద్రుని చూడని వారా యాకారమును చూచిన బోధపరచుకొనగలరనునంత రౌద్రముతో జేవురించిన యాననము. అయినను సుందరవిగ్రహమే.

'జూలియా, ఎందుకిలాంటి పెద్దమాటలు? నే నడిగిన దాని కేదో జవాబు చెప్పు; లేదంటే మరి దగ్గరకు రాకపోతే ఎలాగవుతుంది?'

'నువ్వడిగిన దానికేమి జవాబిస్తానో నీకు తెలియదూ? నన్నెందు కడగాలి? ఇకను దగ్గిర కొచ్చి యేమిచేయగలవు?

ఈ శరీరం మేమిటి అనుకున్నావు ? విషం నేనెవర్తెను ? త్రాచు పామును ముట్టుకుంటే ఏమి టవుందో తెలుసునా ? ఆ వుద్దేశం వద్దనుమా అరీందమ్ ! వద్దు !! నామీద చెయ్యి వెయ్యడాని కెవడికయినా గుండెలున్నాయా ? వెట్టి ! నువ్వెరుగవ్వూ ?'

'అవును; అలాగయితే ఆస్ప్రింగులలోబడి యిగి రిగిరి ప్రాణాలు వదులుకుంటావా ఏమిటి ?'

'ఆఁ ! వస్తుతో ప్రాణాలు వదలుకుంటాను ? నేనెవర్తెను? జుమీలియాను కానా ! అరీందమ్, తెలివిలేని మాటలాడుతు న్నావు ! దిద్దు—దిద్దు—నీనాల్క, నేనలా చస్తానని కలలో నైనా నమ్మతావా ?'

'అయితే మరేమి టంటావు ?'

'ఏమిటంటానా ? నేనే ప్రాణాలు తీసేసుకుంటాను అని అంటాను.'

'జుమలా, నీ రివాల్వరుకూడా నువ్వు తియ్యలేవు. చెయ్యికదల్పలేవు తెలుసునా ?'

"తెలుసును, తెలుసును, కాని చూడు. ఇంత సౌంద ర్యంకూడా మంటిలోగలిపి కోతిలాంటి తయారు భానోజీని చేసిన ఔషధం నాదగ్గిరుందని నీకు తెలుసునా ? తొంభై యేండ్ల తొక్కలాంటి యోగినిని తయారుచేసిన ఔషధాలు నాకు

వూల్సా హేం బిచ్చాటన్న మాట తెలుసునా ?—ఆహా ! ఆ మహానుభావుడు చచ్చి స్వర్గాన్నున్నాడు. 'జుమలా, ఈ అరిందం బ్రతికున్నన్నాళ్ళూ నీకు భంగాలే' అన్నాడుకదా?— ఇన్నాళ్ళవధాలుండీనీన్నీ నాదగ్గిర చచ్చిపోవడానికే ఔషధం ఉండదూ ?"

'అవును. ఉంటుందికాని—నీకిప్పు డెలా వస్తుంది ?'

'రావడంయేఁవిటి' నేను మీాభీష్ముడు పుట్టిన నక్షత్రాన్నే పుట్టాను. నాకు స్వచ్ఛందమరణం దేముడు వ్రాశాడు. ఒకరి చేతిలో నేను చావను. అందుకే యెప్పుడూ నానోటిలోనే వుంటుంది. ఈఔషధం. తెలుసునా ? చూడు ఈపన్ను చూచా ? ఇది పన్ను కాదు. గాజు (పింగాణి) వుండ. దీనిలో ఔషధం వుంది.'

అని జుమీాలియూ మిక్కిలి బలముతో మెడ నొక్క సారి త్రిప్పి వాలుమ్మని యాయుండను పండ్లతోపట్టి యరిందము నకు చూపెను.

"చూచావా ? నేను భీష్ముడనేనా ? నాదికూడా స్వచ్ఛంద మరణమేనా ? ఈ స్ప్రింగులే నాకు అంపశయ్య. అరిందం, ఇప్పుడయినా నాకు ఓడిపోయావా లేదా ?"

'ఓడిపోతూనే వున్నాను ఆ వుండ కొరకగలవుసుమా ! వద్దు, నీప్రాణానికేమీా భయము లేదు. జుమలా, వద్దు ! వద్దు!! అంత సాహసం కూడదుసుమా !!!'

అనుచునే యరీందం టేబిలులోనకి చెయ్యి పెట్టెను తోడనే జమీలియా—

'ఔను, అరీందం అప్పను మెచ్చాను. మల్లీమాట నొక్కావా? మళ్ళీ బేటరీకి కర్రెంటు పెట్టి నన్ను కొరకనీయకుండా చేశేదామనే! మాటతీసేయ్ తీయవ్వకదూ! నరే.'

అని యావచ్ఛక్తితో నాయుండను పటుకున్న ముక్కలు చేసి, 'పద్మాబాయీ, నీ దేవీపూరును నువ్వేలుకో నేను పెట్టిన బాధలకిదే శిక్ష అనుకో. అరీందం. నీ తెలివితేటలకూ నాకే సరి నాయుక్తికి, నీ యుక్తే సరి నిన్నే మెచ్చాను. కాని, నీమాట వ్యర్థము'

'చెలో! జాన్! ఫూల్సావాబ్ కాపాన్'

'జాయ్! శాంకరీ!'

శరీరమంతయు నట్టులనే యుండెనుగాని, మెడమాత్ర మొకప్రక్క కొఱగిపోయి యుండెను. ముఖమునగల అంద మంతయు నంతర్ధానమందుచు నల్లబడుచుండెను.

* * *

ఈ స్త్రీరూప భీష్ముఁ డంతరించెను.

అరీందమ్ దుఃఖమును వ్రాయ మాతరముగాదు. దేవీపూరును పద్మాబాయి కొప్పజెప్పి తగినవారలఁ గార్యనిర్వాహణమున కునిచి మరలివచ్చెను.

పాపము ! అరిందము, 'ఆనాడు నేను సెర్చిలైటు పెట్టి ఆపాదుపడియున్న యింట తన్నెదిరించినప్పుడు తానేరీతిని మాయమైపోయినదో అడిగి తెలుసుకుందమన్నను సమయ మీయకనే గతించినది' అని విచారించును.

'ఆహా ! ఏమివ్యక్తి గతించెను ! ఏమి సాహసము !'

'నిశ్చయముగ భీష్ముడే !'

'కాని, యెవని కొఱకు నేను గోపాల్‌చందనే పేరుతో నిలాగున నున్నానో ఆ కాలూరాయిగా డున్నాడు. వీ డసాధ్యుఁడు. వీనిని పట్టెడుపని నానెత్తిమీఁద నొక పెద్ద భారమై యున్నది' అని యనుకొనుచుండెను

* * *

దీని తరువాయి కథ కాలూరాయి అను భాగమున జదువ నగును.

---

శ్రీ కొండవల్లి ప్రెస్, ఇ. జి 405 14—1000—1947

# న వ ల లు

| ఆంధ్ర ప్రచారిణీ లిమిటెడ్ వారి | | రు | అ |
|---|---|---|---|
| మాయావి | 1 వ భా | 1 | 8 |
| మనోరమ | 2 ,, | 1 | 8 |
| మాయావిని | 3 ,, | 0 | 12 |
| ఫాదుషా హైదరాలి | | 1 | 8 |
| ప్రణయచాంచల్యము | | 1 | 8 |
| సాహసిక | | 1 | 0 |
| వీరపూజ | | 2 | 0 |
| సురస | | 1 | 0 |
| అమరవిజయం | | 1 | 0 |
| కావ్యకుసుమావళి | 1 వ భా | 4 | 0 |
| డిటో | 2 ,, | 4 | 0 |
| **చరిత్రాత్మక నవలలు** | | | |
| వనదుర్గము | | 1 | 8 |
| తపోవనము | | 1 | 8 |
| జపమాలిక | 1 వ భా | 1 | 0 |
| డిటో | 2 ,, | 1 | 0 |
| డిటో | 3 ,, | 1 | 1 |
| తానీషా | | 1 | 0 |
| ఇచ్ఛినీకుమారి | | 1 | 0 |
| ధర్మరాజు | | 1 | 0 |
| ప్రతిబింబములు (మొ॥ నరసింహశాస్త్రి) | | 1 | 0 |
| హోతింతాయి | | 0 | 12 |
| స్వర్ణకుమారి | 1 వ భా | 1 | 0 |
| డిటో | 2 ,, | 1 | 0 |
| ప్రసన్నముఖి | | 1 | 0 |

| సరస్వతీ గ్రంథమండలివారి నవలలు | | రు | అ |
|---|---|---|---|
| హత్యారహస్యము | | 1 | 0 |
| కుముద్వతి | | 1 | 0 |
| సింహగడము | | 1 | 0 |
| మణిహారము | | 1 | 0 |
| ఛిన్నహస్తము | 1 వ భా | 1 | 0 |
| సంజీవి | 1 ,, | 1 | 8 |
| సంజీవి | 2 ,, | 1 | 8 |
| ప్రజారాణి | | 1 | 8 |
| కాశీఖండము | | 1 | 0 |
| సేవాశ్రమము | 1 వ భా | 1 | 0 |
| సేవాశ్రమము | 2 ,, | 1 | 0 |
| అంతఃపురము | 1 వ భా | 1 | 0 |
| అంతఃపురము | 2 ,, | 1 | 0 |
| హత్యాభ్రమ | | 1 | 0 |
| మేరీరాణి | | 1 | 0 |
| రాజ్యలక్ష్మి | | 1 | 0 |
| విదురునియుపదేశములు | | 0 | 12 |
| కాంచనమాల | | 1 | 0 |
| సీమంతిని | | 1 | 0 |
| సుశీల | | 0 | 12 |
| యమునాబాయి | | 0 | 12 |
| శ్యామల | | 1 | 0 |
| కాంతం కథలు (చిన్నకథలు) | | 0 | 12 |
| కాలసర్పి | | 0 | 12 |
| ప్రేమమందిరి | | 1 | 0 |
| ఫాస్టు | 1 వ భా | 1 | 0 |

శ్రీ సత్యనారాయణ బుక్ డిపో, రాజమండ్రి.

## జీ వ న ప్ర భా త ము

(రఘునాథజీ)

అనువాదకులు : తల్లావఝుల శివశంకరశాస్త్రిగారు

ఇందు మహారాష్ట్రుల విజృంభణము, భారతీయుల ప్రాచీనపురౌన్నత్యమును జాటును. శ్రీఛత్రపతి శివాజీ మహాశయుడు హిందూ సామ్రాజ్య సంస్థాపనకై పడినపాట్లు, పొందిన యాగచాట్లు, పన్నిన యుక్తులు, వేసిన జిత్తులు, చూపిన విక్రమసాహసములు, చదువునపుడు ప్రతి భారతీయుని యొడలినరములు పెల్లుబికి రుధిరము నవనాడుల రేకెత్తించుననిన చాలదా? మొగలాయిసామ్రాజ్యము భిన్నభిన్నమై రూపు మాసిన తెలుంగు నెలుంగ నీపొత్తము రాజబాట. సుమారు 300 పేజీలు. వెల రు 1—8—0

## జీ వ న సం ధ్య

(తేజసింగు)

అనువాదకులు : తల్లావఝుల శివశంకరశాస్త్రిగారు.

ఇందలి యాఖ్యాయిక రాజపుత్రస్థానమునకు తలమానికమనందగు మేవాడు రాజ్యమందలి సూర్యమహాల్ దుర్గము ప్రాతిపదికగా మొదలిడి పలుదుర్గములను పాఠకులకు గోచరింపజేయుచు వివిధ యుద్ధగతుల నారితేరిన యోధుల నెందరనో గొంతుకట్టబెట్టుచు చిత్తూరు మహారాణా ప్రతాపసింగు తనపోయిన చితోడు దుర్గమును పునరాక్రమింపనొనర్చిన యద్భుత సాహసోపేతములైన వీరగాథలను బల్కుచు నానాటి రాజపుత్రస్థానపు టౌన్నత్యమును వేవిధంబుల జాటుచు చేతబట్టినది మొదలు తుదివరకు పలుచవుల గూర్చుచు విభ్రమ, ఆశ్చర్య, ఆనంద, ఆందోళన సాగరముల ముంచెత్తి శరీరము మరపింపగలట్టి రసవంతమైనది. గ్లేజు పేపరు సుమారు 220 పేజీలు

వెల రు 1—8—0

---

శ్రీ సత్యనారాయణ బుక్ డిపో, రాజమండ్రి